# ఏది సత్యం?

'శారద'

ప్రకాశకులు :
కుబేరా ఎంటర్‌ప్రైసెస్ లిమిటెడ్
"కుబేరా బిల్డింగ్స్"
21, సుంకురామచెట్టి వీధి : : మద్రాసు-1

# 1

హాస్పిటల్ రోడ్డు టర్నింగ్ కు కొంచెం దూరంగావున్న పెద్దమేడ పక్కనున్న పెంకుటింటిముందు ఒక సైకిల్ రిక్షా ఆగింది. దాని లోంచి దిగి, ఒకతను ఆ యింటిలోకి తొంగి చూశాడు.

అంతా కటిక-చీకటి. అయితే, ఏదో ఒక మసక వెల్తురు లోపలవున్నదేమో నన్న భ్రమ కలిగిందతనికి. ఏదీగూడా వివరంగా కనపడని నిరాశవంటి చీకటి అది. బైటతలుపూ, లోపలితలుపూ తీసే వున్నాయి. దొడ్డిగడప వరకూ సరాసరి కన్పిస్తోనే వుంది. దొడ్డి గడప అవతల ఎర్రటి సంధ్యాకాంతి కివతల, గడపమీద కూర్చుని వుందొక యువతి నీడ. వొట్టి నీడగా అగుపిస్తుందామె అవతలి వెలుగులో... మోకాలిమీద తల ఆనించి, ఆలోచిస్తున్నట్టుందామె.

"అమ్మగారూ!" అని పిల్చాడతను రెండునిముషాలు అలాగే చూశాక.

ఆ యువతి హఠాత్తుగా తలెత్తిచూసి లేచి వచ్చింది. గడప నుంచి ఇవతలికి వొచ్చాక ఆమె ఐదు నిమిషాలు చీకట్లో కలిసి పోయింది. తర్వాత వాకిలిదగ్గరకొచ్చి "ఏం?..." అని ప్రశ్నించిందామె ఏదో అనుమానం వ్యక్తపరుస్తూ.

"అమ్మగారూ! కాస్త ఆస్పత్రికిరండి..." అన్నాడు వొచ్చిన వాడు.

"ఆస్పత్రికా? దేనికి వెంకటయ్యా?" అని ప్రశ్నించింది ఆ యువతి. ఆమెకి ఇరవై ఏళ్ళుంటాయి. సన్నగావుంది. కోలమొగం అందంగా కళగావున్నా చాలా నిరాడంబరంగా వుంది. చేతుల రెండు గాజులూ, మెళ్ళో తాళిబొట్టూ తప్ప మరే ఆభరణాలూ లేవు సాదా నీలంరంగుచీర, తెల్ల రవిక వేసుకుంది. తలదువ్వి వాలుజడ వేసుకుంది.

"అయ్యగారు ఆస్పత్రిలోవున్నారు...తొందరగా రండి. అదిగో ఆ రిక్షా ఎక్కండి," అన్నాడు వెంకటయ్య.

"అయ్యగారు ఆస్పత్రిలో వున్నారా? దేనికి? వొస్తున్నా వుండు," ఆమె గాభరాతో అంది. ఇంట్లో కెళ్లి తలుపులన్నీ గడియ

పెట్టేసి, వాకిలి తలుపు తాళంవేసుకునివచ్చి రిక్షా ఎక్కింది. అప్పటికి బాగా చీకటిపడింది. విజయవాడంతా దీపాలతో వెలిగిపోతోంది.

వెంకటయ్య రిక్షావాడితో, "ఇందాక చూశావుగదూ! సూర్యనారాయణగారి ఆస్పత్రి! అడికి తీసుకుపద అమ్మగార్ని. నేను వెనకాతలవొస్తా," అన్నాడు.

రిక్షా రయ్‌మని మోతబెడుతూ, తొలిరాత్రి చీకట్లని చీల్చుకుంటూ, వీధి దీపాలకాంతిలో గాంధీనగరంగుండా గవర్నర్‌పేట వైపు పరిగెడుతోంది. వీధులన్నీ జనసంకీర్ణంగా వున్నాయి. రిక్షాలో కూచున్న అమ్మాయి అయోమయంగా, దిగులుగా, ఆదుర్దాగా అటూ ఇటూ చూస్తూంది. గవర్నరుపేట సెంటరుదాటి మనుషుల్ని తప్పించుకుంటూ సైకిలురిక్షా, ఏలూరు రోడ్డువైపు తిరిగింది. సూర్యనారాయణ ఆస్పత్రి ఆ రోడ్డు చివర సినిమాహాలు కెదురుగా వుంది. రిక్షా మరొక్క ఐదునిమిషాలకల్లా ఆస్పత్రి ముందాగింది.

సూర్యనారాయణ ఆస్పత్రి పెద్ద భవనం. లోపల దీపాలు జగజ్యోతిగా వెలుగుతున్నాయి. ఇద్దరు ముగ్గురు నర్సులు అటూఇటూ తిరుగుతున్నారు. కంపౌండరొకాయన గడపదగ్గర నుల్చుని బీడీ కాలుస్తున్నవాడల్లా, రిక్షాదిగిన అమ్మాయిని ఒక నిమిషం నిర్లక్ష్యంగా చూసి, చేతిలో బీడీ అవతలపారేసి, "మీరు ఆ రైస్‌మిల్ సూప్రవైజరుగారికోసం వచ్చారా?" అని ప్రశ్నించాడు. "అవును," అంది ఆమె కొంచెం దిగులుగా.

"అయితే నాతో రండి," అన్నాడు కంపౌండరు.

వాళ్లిద్దరూ లోపలికెళ్ళారు తొందర తొందరగా. మధ్య హాలులో ఎవరో ఇద్దరు రోగులు ముసుగులు కప్పుకుని మంచాల మీద వున్నారు. హాలు గోడలు తెల్లగా శుభ్రంగావున్నాయి. తలనొప్పి మందు కంపెనీవాళ్ళ పెద్ద కాలెండర్లు గోడలకి వేళ్ళాడుతున్నాయి.

వాళ్లు హాలుదాటి లోపలిగదిలోకి వెళ్లారు. డాక్టర్ సూర్యనారాయణ ఒక కుర్చీలో కూర్చుని మంచంమీద రోగిని స్టెతస్కోపుతో పరీక్షిస్తున్నాడు. సూర్యనారాయణ గారికి ఏభై ఏళ్లుంటాయి. విజయవాడలోకల్లా ఆపరేషన్ కేసులకి ప్రసిద్ధి పొందాడు. ఆమె గదిలో అడుగుపెట్టి మంచంమీది రోగిని చూడగానే కంగారు

డింది. "ఏమైంది ? ఏమైంది ?" అంటూ మంచం దగ్గరకి పరు
గెత్తింది.

ఆమె రోగిమీద పడిబోతుందేమోనన్న భయంతో, డాక్టర్ మెల్లగా నవ్వుతూ, చెయ్యి అడ్డంపెట్టి "అలా కూర్చోవమ్మా. గాభరాపడకు. జరిగిందేదో జరిగిపోయింది," అన్నాడు.

"ఏం జరిగిందండి ?" ఆమె కంగారుగా రోగికేసి చూస్తూ ప్రశ్నించింది.

డాక్టర్ స్టెతస్కోపు మెడకి తగిలించుకుంటూ, "చెబుతా, చెబుతా—ఇప్పుడాయన్నే మీ కదిలించకు తల్లీ. మైకంలో వున్నారు," అంటూ, "నీ పేరేమిటి తల్లీ ?" అని అడిగాడు.

"పార్వతి," అన్నదామె పరధ్యానంగా. ఆమెజుట్టు గాలికి రేగి మొహాన పడుతోంది. డాక్టర్ చూపించిన 'స్టూల్' మీద కూర్చోలేక పోతోంది. ఆమె చేతివేళ్లు వీణతంత్రుల్లా వొణుకు తున్నాయి. డాక్టర్ నవ్వుతున్నట్లు, చాలా ప్రశాంతంగా ఆమెభయాన్ని పోగొడుతున్నట్టున్నా ఆమె కంగారేమీ తగ్గలేదు.

"చెప్పండి డాక్టర్ గారు," అందామె ఏడుపు స్వరంతో.

"మరేమీ లేదమ్మా, మీవారు మధ్యాహ్నం నాలుగు గంటలకి రైసుమిల్ హాల్లర దగ్గర, కింద ఆయిల్ మీద కాలేజారు గాబోలు, కాలుజారి ఆ మరచక్రాల్లో పడిపోయినారు. కుడికాలు తొడ దగ్గిర విరిగిపోయింది. చాలా ప్రమాదమైన దెబ్బే గాని, ప్రాణాని కేమీ ఫరవాలేదు !"

"ఆఁ!..." అని పార్వతి హోరున ఏడ్వసాగింది. అవును... మంచంమీద రోగి కుడికాలు కట్లకి నెత్తురు చారలు కన్పిస్తున్నాయి. ఆమె గుండెలు ఝల్లుమన్నాయి. ఆ గదీ, డాక్టరూ, గోడకున్న కవహార్ బొమ్మా—అన్నీ తిరుగుతున్నట్టున్నాయి ఆమె దృష్టిలో. అయితే, ఆమె ఈ దుఃఖపూరిత వికార మనస్థితిలో ఐదారు నిమిషాలే వున్నాయి. తర్వాత ఒక రకంగా కోలుకుని, తల ఎత్తి డాక్టర్ కేసి చూసింది కన్నీళ్లతో.

డాక్టర్ కూర్చునివున్న వాడల్లా లేచి పార్వతి దగ్గిరకొచ్చాడు. "నివ్వేక్కడే వుండమ్మా. మీ ఆయనకేం ఫరవాలేదు," అన్నా

డాయన ఆమె తల నిమురుతూ. ఆమె నా స్థితిలోచూస్తే, రాళ్లు కూడా కరిగిపోయాయేమో! "ఆమె కనుకొలుకులు ఎర్రబడ్డాయి. జుట్టు చిందర వందరగావుంది. విద్యుద్దీపకాంతిలో ఆమె ఎర్రటి అందమైన శరీరచ్ఛాయ, అమాయకమైన వైఖరీ డాక్టర్లోని మాన వత్వాన్ని రెచ్చగొట్టాయి.

"ఆయన్ని లేపకమ్మా. ఆయనంతట ఆయన లేచేవరకూ మనం ఏమీ చెయ్యకూడదు," అని ఆయన చెప్పి వెళ్లిపోయాడు.

పార్వతి భర్త మంచం పక్కనే కుర్చీలో కూర్చుంది. మందు మైకంలో మంచంమీద పడున్న తన భర్తకేసి చూస్తూ ఆమె అలాగే కూర్చుండిపోయింది.

## 2

పార్వతిభర్త సాంబశివరావు ఉద్యోగం దొరక్క పూర్వం నించీ తన అమ్మమ్మతో హాస్పిటల్ వీధిలోని పెంకుటింట్లో ఉంటు న్నాడు, కష్టంతో కాలంగడుపుతూ. యుద్ధకాలంలో అతనికి ఒక రైసుమిల్లులో కూలీలమీద సూపర్వైజరుపని దొరికింది బహు కష్టంమీద. దానికి అతని స్నేహితుడొకడు ఎంతో సిపార్సు చెయ్యాల్సి వచ్చింది. సాంబశివరావు సన్నగా, నీరసంగా వుంటాడు. చదువుగూడా ఎస్. ఎస్.ఎల్. సి కి మించిందిగాదు. పార్వతికి యీ ప్రపంచంలో "నా" అనేవారు ఎవరూలేరు. ఇంట్లో పనులుచేస్తూ వుంటుందని, ఆమె మేనమామ పెద్దదయిందాకా ఆమెను పోషించాడు. ఎవడికో ఒకడికి అంటగట్టాలని ప్రయత్నిస్తూ సాంబశివరావు కామెనిచ్చి చేతులు కడుక్కున్నాడు.

పార్వతి తెలివైనపిల్ల. మేనమామా, అత్తా ఆమెను ఎంత నిర్లక్ష్యంగా చూసినప్పటికీ, స్కాలర్షిప్పు సంపాయించి ఎలాగో ఎస్. ఎస్. ఎల్. సి. పాసైంది. ఆమె దీక్షతో టైప్ రైటింగ్ పరీక్షకూడా పాసయింది.

పెళ్లి అయినాక ఆమె భర్తతోపాటు ఆ యింట్లో అడుగు పెడ్తూనే ఆశ్చర్యం వెలిబుచ్చింది. "ఏమిటండీ, ఇంత చీకటిగా వుంది ఇల్లు!" అని అడిగింది. సాంబశివరావు నవ్వాడు. అంతకంటే

అతనిచ్చే సమాధానం ఇంకేమీ వుండదని గ్రహించిన పార్వతి తానూ నవ్వేసి పూరుకుంది.

సాంబశివరావు అమ్మమ్మ అశక్తురాలు కావడంవల్ల ఆరోజు నించీ పార్వతి గృహ బాధ్యతలు తన నెత్తినే వేసుకుంది. ఆమె ఏ మూలనవుండి పనిచేస్తున్నా సాంబశివరావు కళ్లు ఆమెవైపే వుండేవి. ఫ్యాక్టరీలో పని అయిపోగానే, అతను ఆత్రుతగా యింటికి వెళ్ళే వాడు. అతనికి కొద్దిరోజుల్లోనే భార్య బహిఃప్రాణంగా తయారైంది. పార్వతికూడా ఇందుకు భిన్నం కాదు. భర్త దుర్బలుడుగా కనపడ్డా, అతనిలోని తృష్ణల్ని ఆమె పరిపూర్ణంగా అవగాహన చేసుకుంది.

పార్వతిని వెంటబెట్టుకుని సాయంకాలం షికారుకెళ్లడం సాంబశివరావుకి బాగా సరదాగా వుండేది. కాని, ఆమె సిగ్గుపడేది.

"పల్లెటూరి పిల్లలా ఎందుకంత సిగ్గుపడతావు?" అని అతను ఆమెను అపహాస్యం చేసేవాడు.

అనవసరంగా ఇద్దరూ పకపక నవ్వుకునేవారు. పార్వతి రోడ్డు మీద అటూ ఇటూ చూడకుండా భర్తపక్కనే నడుస్తూ వుండేది. వాళ్ల దగ్గిర సినిమాలకూ, సర్కసులకూ వెళ్ళడానికి కావల్సిన డబ్బు లేదు. అందువలన వాళ్ళు కృష్ణానది వొడ్డున ఆనందంగా తిరిగేవారు. ఏ పార్కులోనో కబుర్లు చెప్పుకుంటూ కూర్చునేవారు.

వాళ్లింటిదగ్గిరే వున్న పంతులుగారి పార్కులో ముద్దమల్లె చెట్లకింద కూర్చునేవారు. పార్వతి వనదేవతలా అటూ ఇటూ ఆ పచ్చిగడ్డిమీద తిరుగుతూ "మీకు ఇంకా కొంచెం జీతం పెరిగితే, మనదొడ్లో చిన్న తోట వేద్దామండి," అనేది.

"మనదొడ్లో మొక్కలు బతకవు. ఆ యింట్లో మనం ఎలా అర్ధాయుష్షుతో జీవిస్తున్నామో మొక్కలూ అంతే...పార్వతి! ఇలా కూర్చో. ఏదీ! నిన్ను చూడనీ?" అనేవాడు సాంబశివరావు. ఆమెలోకి ఎంతచూసినా అతనికి తనివి తీరేది కాదు.

ఈవిధంగా వాళ్లిద్దరి మధ్య గాఢమైన అనుభూతులు వేళ్ళు పాతుకుపోవడానికి కారణం—పార్వతి మొదట్నించీ మేనమామగారింట్లో అస్వతంత్రురాలుగా వుండి, చాకిరీ చేసేవరకే బాధ్యతలు పరిమితమై వుండడమూ, ఏవిధమైన సానుభూతిగానీ ఎవరినించీ పొంద

లేకపోవడమూ. సాంబశివరావు గూడా మొదటిసారి తనను ఒక వంక గౌరవిస్తూ, అదే సమయాన ప్రేమిస్తూ తన ఇష్టం వొచ్చినట్టు ఆడుతూ వుండే వ్యక్తిని కలుసుకున్నట్టు ఫీలయినాడు. అవడమే కాదు; అదీ నిజమేమో గూడానూ.

# 3

పార్వతి కాపరానికొచ్చిన కొద్ది రోజుల్లోనే ముసలమ్మ చని పోయింది. ఆమెగూడా లేకపోవడంతోటి, భార్య భర్తలకి ఆ యింట్లో ఉన్న ఒక్క అడ్డంకీ తొలగినట్టయింది. ఇప్పుడు—పార్వతికి సాంబశివరావూ, సాంబశివరావుకి పార్వతీనూ. సాంబశివరావు ఆవేళ సాయంత్రం పూలు కొనుక్కుని, ఈల వేస్తూ ఇంటికివొచ్చాడు. వాకిలి తలుపులు ఓరగా వేసివున్నాయి.

అతను మామూలుగానే తలుపు నెట్టుకుని లోపలికివొచ్చాడు. పార్వతి దొడ్లో బొత్తిగా మరుగే లేకపోవడంతోటి వంట గది పక్క నాపరాయిమీద కూర్చుని నీళ్ళు పోసుకుంటోంది. మామూలు ప్రకారమే వివస్త్రంగావుంది. సాంబశివరావు చాలా తాపీగా తలు పులు తీసుకుని లోపలికి రావడంతోటి, ఆమె భర్తరాకను గుర్తించ లేదు. పైగా వంటింటికీ, మధ్యహాలుకీ ఒక తడిక అడ్డం కట్టివుంది.

నీళ్ళు పోసుకుంటున్న ధ్వనినిబట్టి ఊహించినవాడై, సాంబశివ రావు అసలు చప్పుడేలేకండా నడిచివెళ్ళి తడికమీదగా భార్యని తదేకంగాచూస్తూ నిలబడిపోయినాడు. ఒకరికొకరు వారెంత సుపరి చితులైనా భార్య సౌందర్యం అతనికి కొత్తకాకపోయినా, ఆమె నగ్న సౌందర్యం అతన్ని దిగ్భ్రమ కలిగించింది. దంతపుశిల ప్రాణం పోసుకువచ్చి కూర్చున్నట్టున్నది. ప్రతి అవయవమూ సొంపులు చిందుతూ, లావణ్యం వుట్టిపడుతూ సాంబశివరావు మనస్సులో ప్రతి మూలనూ—ప్రతి అణువునూ ఆక్రమించుకుంది.

ఆమె వొంటిమీద వేడినీటిబొట్లు రవ్వల్లా ధగధగ మెరిసి పోతున్నాయి—లోపలికొచ్చిన కొద్దిపాటి వెలుగులో. ఇంతలోనే ఆమె ఎందుకో తడికవైపు చూసింది. భర్త! ఆమె ఉలిక్కిపడి, పమీపాన్నే వున్న తడిగుడ్డను లాక్కుని, వొంటికి చుట్టుకుని

తైటికి వచ్చింది. రావడం తోటే భర్తకేసి చూడలేక తలొంచు కుని, "కాస్త పిలవకూడదేమిటి?" అన్నది తడికమీద మడతపెట్టి పడేసిన వాయిల్ చీర తీసుకుంటూ.

"పిలిస్తే ఎట్లా? మళ్ళా కావాలంటే అలాంటిదృశ్యం దొరుకుతుందా పార్వతీ!" అన్నాడు సాంబశివరావు, దాదాపు ఆమెని కౌగలించుకుని. అతను క్షణికోద్రేకపరుడు.

"అబ్బ—ఊరుకోండి! ఆ పాడు గుడ్డలతోటి నీళ్ళుపోసుకున్న దాన్ని కాస్తా తాకారు!" అంటూ పార్వతి దూరంగా జరిగింది.

"నేనూ నీళ్ళు పోసుకుంటాను!" అంటూ భర్త ఆమె బుగ్గ మీద గాఢంగా ముద్దెట్టుకుని దొడ్లోకి వెళ్ళాడు.

వాళ్ళ అన్యోన్య దాంపత్యానికి ఆర్థికపుచిక్కులు మరింత దోహదమిస్తున్నట్టుగా వుండేవి. విజయవాడలో అరవై రూపా యల జీతంతో — ఆ కంట్రోలు రోజుల్లో బతకడం ఎంత దుర్భరంగా వుండేదో ఆ ఉభయులకీ తెలుసును. పంచదార దగ్గరనించి బియ్యం వరకూ అన్నీ రెండింతలూ, మూడింతలూ ధరఇచ్చి కొనవల్సివచ్చేది.

ఒకొక్కప్పుడు బియ్యం కొందామన్నా దొరకేవికావు. ఉన్న కాస్తబియ్యం వుడకేసి పార్వతి భర్తకోసం నిరీక్షిస్తూవుండేది. సాంబశివరావుకి ఈ సంగతి తెలుసు. అతను రావడమే "భోం చేశావా పార్వతీ!" అనేవాడు.

"రండి!" అనేది భార్య.

"నా కాకలిగాలేదోయ్. నేను ఈపూటకి భోంచెయ్యను. నువ్వు తినేశెయ్యి," అనేవాడు.

"నాకు తలనొప్పి ఇంతంతా కాదు. ఈ పూటకి నేను భోజనం మానుకుంటున్నానండి," అనేది పార్వతి, మొహం ముడుచుకుని.

సాంబశివరావు "రెండు చేదుమాత్రలు తెస్తాను. తలనొప్పి తగ్గిపోతుంది!" అనేవాడు.

"చాల్లెండి సరసం. రండి. ఉన్న మెతుకుల్నే ఇద్దరం కలసి తిందాం," అని చెయ్యిపట్టుకుని, భర్తని లాక్కొచ్చి విస్తరిదగ్గర కూర్చోబెట్టేది. ఇద్దరూ ముసిముసి నవ్వులు నవ్వుతూ, ఆ కాసిని

మెతుకుల్నే సంతృప్తిగా తినేవారు. అన్నం కరువు వారి హృదయాల్ని తాకలేకపోయేది.

"అలా షికారు పోదాం పార్వతి! ఇవ్వాళ శుక్రవారం కదూ? కనకదుర్గ గుడికి వెళ్దాం," అంటూ ఒక సాయంత్రం సాంబశివరావు బయల్దేరాడు. పార్వతి ఎంతో సంతుష్టిగా అలంకరించుకుంది. తళతళలాడే వాయిల్ చీరకట్టి, జుట్టు చక్కగా దువ్వి జడ వేసుకుని, మల్లెపూలు తల్లో జొప్పించుకుని బయల్దేరేది. ఆమెకి ఆభరణాలు లేవే అనే చింతే లేదు. మామూలు గాజులు తొడిగించుకుని, నొసట కుంకుమదిద్ది, భర్త పక్కన నడవడమే ఆమె కెంతో గర్వంగా వుండేది.

బజార్లో వెంట నడుస్తూవుంటే ప్రతివాళ్లూ ఆమెవంక చూసేవాళ్ళే. ఆమె సౌందర్యం అందరిని ఆకర్షించేది. పక్క ఇంటి కాళిదాసూ, అతని భార్య వేదవతీ పార్వతీ, సాంబశివరావుల దాంపత్యాన్ని ఎంతో ముచ్చటగా చూసేవారు. కాళిదాసు అనేక తడవలు తన భార్యకు పార్వతిని చూపించి "ఆమె అలా ఎప్పుడూ నవ్వుతూ వుంటుంది చూడు! ఎంత అదృష్టవంతులు వాళ్ళు!" అంటూ వుండేవాడు.

దుర్గ గుడిమీద శుక్రవారాలు విపరీతమైన జనం వొత్తిడి. పూజ చేయించడానికి నిల్చున్న భక్తుల 'క్యూ', హనుమంతుడి తోకలాగా పెరిగిపోతోంది. రకరకాల ఆడవాళ్ళూ, నగలతోటి మెరిసి పొయ్యేవారూ, పెళ్లికాని ముగ్ధకన్యలూ, ఇప్పుడే యౌవ్వనోదయ ప్రాంగణంలో అడుగుపెట్టి, నిష్కారణంగా అపరిచితుల్ని సైతం చూసి, ఫక్కున చిరునవ్వుతో వొలకపోసి, మళ్ళీ పశ్చాత్తాపబడి, వాలిక కొరుక్కునే బాల్యంవొదలని యువతులూ దుర్గగుడిలోని పూజనీయ వాతావరణానికి సౌందర్యం సమకూరుస్తున్నారు. సాంబశివరావు వాళ్ళవంకా, తన భార్యవంకా చూసి తన భార్య ఎవరికీ ఏ విధంగానూ తీసిపోదని నిర్ణయించుకుని గర్వంతో తనలో తానే నవ్వుకున్నాడు.

పార్వతి అమాయకంగా గుడిచుట్టూ తిరిగి ప్రదక్షిణం చేస్తోంది. తన ముందూ, వెనకా నడుస్తూన్న ఆడవాళ్ళ వివిధ

అంకరణల్ని చూసి ఆశ్చర్యపోతోంది. ఎన్ని రకాల చీరెలు! ఎన్ని రకాల ఆభరణాలు!

వీటన్నిటినీ మించి ఆమెకి ఆశ్చర్యం గొల్పేవి, కొండమీద నించి సాయంత్రాల్లో కిందకి చూస్తే విద్యుద్దీపాలకాంతిలో కన్పించే విజయవాడ నగరదృశ్యం.

సాంబశివరావు దుర్గ గుడిమీద సంధ్యాసమయాన 'గప్' మని వెలిగిన దీపాల కాంతిలో నిరాడంబరంగావున్నా, అనన్యసౌందర్యం తోటి మెరిసిపోతున్న తన పార్వతిని మళ్ళీ మళ్ళీ చూస్తూ మురిసి పోయేవాడు.

"పార్వతీ! ఈ 'క్యూ'లో నుల్చుని పూజచేయించడమంటూ వస్తే ఇవ్వాళ్టికి కుదరదు. రేపొచ్చి చేయిద్దాం!" అని బయల్దేరే వాడతను.

అలా రోజులకు రోజులు, రాత్రులకు రాత్రులు మధురాతి మధురంగా గడిచిపోయాయి.

## 4

సాంబశివరావు క్షణికోద్రేకపు మనస్తత్వానికి ఏ మాత్రం తీసిపోనిది పార్వతి. చాలామంది భార్యల్లాగా భర్తకి విసుగు కలిగేట్టు ప్రవర్తించటం ఆమె ఎరగదు. ఒక పౌర్ణమినాటిరాత్రి సాంబశివరావు ఇంటికిరావడానికి ఆలశ్యం ఐంది. 8 గంట లయ్యాయి. పార్వతి, దొడ్లో నుక్కిమంచంమీద పడుకుంది. పొంకమైన అవయవాల సొంపు పౌర్ణమి వెన్నెలకాంతిలో మరింత అందం చేకూర్చుకుంటున్నాయి. ఆమె వయస్సుకూడా పధ్దెనిమిది దాటలేదు. మంచంమీద వెల్లికిలాపడుకుని ఆకాశంమీద నక్షత్రాలు లెక్కపెడుతోంది ఆమె. ఆమె కళ్ళల్లో పసిపిల్లల అమాయ కత్వమూ, ఆమె సౌందర్యంలో ఎంతటి ఋషీశ్వరుణ్ణి ఐనా కాము కుణ్ణి చేసే శక్తీ వున్నాయి.

సాంబశివరావు సరాసరి దొడ్లోకొచ్చాడు. ఇంట్లో బెడ్‌రూం లైట్ కాంతి మృతప్రాయంగా పరుచుకుంటూవుంది. భర్తరాకను పరధ్యానంగావుండి పార్వతి గమనించలేదు. పక్కమేడమీద కాళి

దారూ, వేదవతీ పేముకుర్చీల్లో కూర్చుని మాట్లాడుతూన్నారు. సాంబశివరావు భార్య దగ్గరకొచ్చి నిలబడి "ఏమిటో చాలా పరధ్యానంగా వున్నావు!" అంటూ ఆమెవైపు వంగి, ఆమెంతం ఆమెని చేతుల్లోకి తీసుకొన్నాడు.

పార్వతి పైకి చూసింది. కాళిదాను తమ వైపు చూస్తూ వుండడమూ, ఏదో నవ్వుకోడమూ చూసిందామె. భర్తచేతుల్లో చేపలాగా గిలగిల లాడింది. రెండుకళ్లు చేతుల్లోకి చప్పున మూసుకుంది.

సాంబశివరావు ఇదేమీ గమనించకుండానే ఆమెని లోపలికి తీసుకెళ్ళాడు.

వాళ్ళిద్దరూ లోపలికెళ్ళాక మేడమీద కాళిదాను తన భార్యతోటి "వేదవతీ! వాళ్ళిద్దర్నీ చూస్తూవుంటే ఎంతయినా ముచ్చటవేస్తుందోయ్! నిష్కల్మషమైన హృదయాలతోటి ప్రేమించుకుంటున్నారు గదూ!" అన్నాడు.

వేదవతి మౌనంగా నవ్వి వూరుకుంది.

ఇలా రోజులు గడిచిపోతున్నప్పుడే పదిరోజులు పార్వతి జ్వరంలో పడింది. ఆ పదిరోజులూ సాంబశివరావు ఫ్యాక్టరీకి శలవు పెట్టి ఇంట్లో వుండిపోయాడు. పిచ్చెత్తినట్టు డాక్టర్ చుట్టూ తిరిగాడు. నెలజీతం ఆ పదిరోజుల్లో ఖర్చుపెట్టాడు. భార్యబతికి బైటపడితే అంతేచాలు అనుకున్నాడు.

ఆ తర్వాత నెలరోజులవరకు పార్వతి మనిషి కాలేదు. ఆమెకి టానిక్కులకూ, బలమైన ఆహారానికీ సాంబశివరావు అప్పుచేశాడు. ఆమెకోసం ఏం చెయ్యటానికైనా అతను సిద్ధమే.

అతను ఒకటి రెండురోజులు ఊళ్ళో లేనప్పుడు పార్వతికి పిచ్చెత్తినట్టుగా వుండేది. ఒకరికొకరు అంతగా అతుక్కుపోయినారు. ఒకరొకమాట అంటే రెండోవారు అదేమాట. భర్తస్థితి తెలిసిన పార్వతిగూడా తనకు సహజంగా కలిగే అలంకార ప్రియత్వాన్ని కూడా మరిచిపోయి, అణిచేసుకుని ఊరుకునేది.

ఆమెకి క్రేప్ సిల్కు చీర కొని, అందంగా అలంకరించుకునేట్టు చెయ్యాలని సాంబశివరావు ఆశపడేవాడు. కాని, వీలు కుదిరేదికాదు.

"చూడు పార్వతి! నువ్వు తడిగుడ్డచుట్టుకుని వంట చేస్తూంటూనే... అప్పుడే బావుంటావు సుమా!" అన్నాడొకసారి.

"చాల్లెండి, సిగ్గులేకపోతే సరి! అల్లా చూడవచ్చా!" అని భయపెట్టేది పార్వతి భర్తను.

"చూడగలిగితే ఎంత బావుణ్ణు! నిజానికి ఐదు నిమిషాల కంటే ఎక్కువసేపు నిన్ను చూడలేను!" అంటూ సాంబశివరావు ఆమెని దగ్గిరకి లాక్కునేవాడు.

చాలా చనువుగా ఆమె అతని వొళ్లోకి వాలిపోయి, వోరగా అతని కళ్ళల్లోకి చూసేది.

## 5

ఇప్పుడామెకివన్నీ లీలగా జ్ఞాపకం వచ్చినాయి. గత నాలుగైదేళ్ల జీవితంలో ఓవిధంగా కష్టాలు అధికమైనా, వాట్ని అధిగమించడానికి చాలినంత ప్రేమానుభవం ఎప్పటికప్పుడే ఉభయులకీ లభిస్తూ వుండేది.

ప్రతిరోజూ కొత్తగా అగుపించేది. ప్రతిఋతువూ ఆహ్లాదంగా తమకోసమేనన్నట్టు వికసించేది. ఉద్ధృతమైన వానాకాలమూ, ఎండాకాలమూ, చలికాలమూ అన్నీ తమ సౌఖ్యం కోసమే ననే భావన తనకూ, తన భర్తకూ త్రికరణశుద్ధిగా కలిగేది. ప్రకృతంతా తమదే. తానే గనక రచయిత్రి ఐతే బ్రహ్మాండమైన కావ్యం రాసి వుండేది. తన భర్తగూడా అదేమాట తనతో లక్షసార్లు అని వున్నాడు. "పార్వతీ! నీతో ఏదేదో మాట్లాడాలని వుంటుందిగాని, చివరికి ఏమీ మాట్లాడలేకండా వున్నాను. ఇంత అందాన్ని ఎక్కణ్ణించి తెచ్చుకున్నావు? ఏమిటీ నీ కళ్ళు ఎప్పుడూ ఏమిటో వెతుకుతూనే వుంటాయి? దేన్ని? చెప్పవూ!" అని తనగడ్డం పట్టుకుని బతిమాలేవాడు. ఆయన కళ్ళల్లో వెలిగే తీక్ష్ణమైన కాంక్షల్ని చూస్తూవుంటే తన కంతో పట్టరాని ఆనందంవేసేది. తనలో ఏగొప్పతనాన్ని చూసి, ఇట్లా తనను వదలకండా వున్నాడీయన!

గడిచిపోయిన యీ దృశ్యాలన్నీ ఆమె మనస్సులో గిర్రున తిరి గాయి. చాలాసేపటివరకూ పార్వతి హాస్పిటల్లో అలాగే శిలా విగ్రహంలా కూర్చుండిపోయింది.

పార్వతి విచారిస్తూ కూర్చోలేదు. తెల్లవార్లూ మేల్కొని భర్త కన్ను తెరిచి పలకరిస్తాడేమోనని చూసింది. తెల్లారగట్టే డాక్టర్ వొచ్చి "నువ్వింటికి వెళ్లి రావమ్మా! మేమున్నాంగా! మరేం ఫర్వాలేదు!" అన్నాడాయన.

పార్వతి నిదానంగా తల ఆడించింది. నిద్రలేమితో వాచిన కళ్ళు సులుముకుంటూ, బరువెక్కిన మనస్సుతో ఆమె మెల్లగా రోడ్డుమీదికి వొచ్చింది. ఎవరేనా అప్తులుంటే వెళ్లి చెప్పుకుని ఏడుద్దామని ఉన్నదామెకి. మేనమామకి కార్డు రాయాలనుకుంది. ఏది ఎలావున్నా తనకీనాటికి తన సంగతేమిటో తాను చూసుకో వల్సిన అగత్యం పట్టింది.

ఇంత జనసంకీర్ణంగావున్న ఆ విజయవాడ పట్టణం వీధుల్లో తాను వొంటరిగా వున్నట్టూ, అంతా సూన్యమైపోయినట్టూ భావన కలిగిందామెకి. ఇంట్లో ఏమీలేదు. భర్త జీవితంలోకి తీగెలా అల్లుకుని, అతనిమీదే ఇన్నాళ్ళూ ఆధారపడివుండడంవల్ల ఆమెకి ప్రస్తుతజీవితం బ్రహ్మాండమైన సమస్యగా పరిణమించింది.

ఆమె ఇంటికివొచ్చి తలుపుతీసింది. ఏమీ తోచలేదు. ఇల్లు ఖాళీగావుంది. రాత్రి వొదిలేసిన అంట్లగిన్నెలు పడివున్నాయి వంటింట్లో. ఉదయపుఎండ దొడ్డి గడపగుండా లోపలికి పడుతోంది.

ఆమె మామూలుగా పనులు చేసుకోటాని కుపక్రమించింది గాని, పని కొనసాగటంలేదు. తన భర్తకు పాలు, రొట్టె ఎలాగా? అతనికాలు నయమవుతుందా? ఇలాగే లక్ష సమస్యలు ఆమె మెద డులో తిరుగుతున్నాయి.

ఆమె విసుగ్గా అంట్లగిన్నెలుతోమి, లోపలపెట్టేసి, మొహం కడుక్కొని వాకిట్లోకి వొచ్చింది. ఆమె కేదో ఆలోచన తట్టినట్ట యింది. ఆయన తిరిగి కులాసా చిక్కి, పని చేసుకునేవరకూ తనతిండి సమస్య తనే చూసుకోవాలనే అవసరం ఏర్పడిందిప్పుడు...తన మెళ్ళో ఏ గొలుసేనా ఇప్పుడున్నట్టయితే ఎంతో బాగుండేది!...

పార్వతి దొడ్లోకివెళ్లి తమఇంటికి పక్కనేవున్న మేడవైపు దొడ్లోకి చూసింది. ఆ యింట్లో వంటచేసేఆమె పార్వతికి బాగా పరిచయం. ఆవిడ కొంచెం ఆగి బయిటకి వచ్చింది. పార్వతి కొంచెం గొంతు స్థాయిపెంచి "ఏమండోయ్ వదినగారూ మాట," అంది.

మేడకీ, పెంకుటింటికీ మధ్యన గజంఎత్తు గోడవుంది దొడ్లో. పాతదవడంవలన ఆ గోడ అక్కడక్కడ శిధిలమై వుంది. వంటచేసే ఆవిడ బొద్దుగావుంది. పొట్టిగా బలిష్టంగా వుంది. మంచి నలుపురంగు. ఆమె అడ్డగోడవైపుగా వస్తూ, నెత్తిమీద ముసుగు సరిచేసుకుంటూ, "ఏమిటమ్మా పార్వతి !" అన్నది.

పార్వతి గొల్లుమని ఏడ్చేసింది. వంటామె "ఏమిటమ్మా, ఏమిటమ్మా ! ఎందుకూ ఏడుస్తావు ! ఏమిటోచెప్పు," అంటూ, గోడ ఇవతలనుంచున్న పార్వతిచెయ్యి పుచ్చుకుంది.

పార్వతి రెండు నిమిషాలు అలాగే ఏడ్చింది. తర్వాత నెమ్మదగా తేరుకుని "మా వారికి... ఫ్యాక్టరీ ఇంజిన్‌లోపడి కాలు విరిగిపోయింది వదినగారూ ! ఏం చెయ్యను ? ఎట్లా గడపను ?" అంది గద్గద స్వరంతో.

వంటావిడ రెండునిమిషాలు "ఆ !" అని నోరు తెరుచుకుని వినింది ఈ మాటల్ని. ఆమె చూస్తున్న ఈ నాలుగేళ్ల నించీ ఈ అమ్మాయి జీవితం దిన దిన గండంగా గడుస్తోంది... మళ్ళీ ఇదొక అవాంతరమా ! అనిపించిందా మెకు.

"ఏం కావాలి తల్లీ ! ఏడవకు ! చెప్పు అసలేమిటో !" అన్నది అనూనయిస్తూ.

ఇంతలోనే, "ఏమండోయ్ సీతమ్మగారూ !" అని కమ్మని కంఠస్వరం వినిపించింది మేడనుంచి.

వంటామెపేరే సీతమ్మగారు. ఆమె వెళ్ళబోతూ, "అమ్మాయి, ఇక్కడేవుండు. ఇప్పుడేవస్తా," అంటూ లోపలి కొచ్చింది. ఆ మేడ కాళిదాసుగారిది. కాళిదాసుగారు చాలా డాబుసరిగా వుంటాడు. మంచి డబ్బున్న భూస్వామి. బి.ఏ గ్రాడ్యుయేటు. ఆయనా, ఆయనభార్య వేదవతీ ఇద్దరే ఆ యింట్లో వుంటు

న్నారు. వాళ్ళిద్దరూ చదువుకున్నవాళ్ళే కావడంవల్ల ఆ యిల్లు అత్యంతాధునిక నాగరికతలతో విలసిల్లుతోంది.

వేదవతి బి. యే. బి. ఎల్. చదివింది. అయితే, ఎక్కడా ప్లీడరీ ప్రాక్టీసు పెట్టలేదు—అంతే. ఆమె సీతమ్మను పిల్చింది. సీతమ్మ వంటింట్లోనే వేదవతిని కలుసుకుంది. వేదవతి ఏమీ అడక్కముందే సీతమ్మ "మరేనండి, ఆ పక్కింటి పార్వతి పాపం, ఆ అమ్మాయి మొగుడు ఫ్యాక్టరీ చక్రంలోపడి కాలు పోగొట్టుకున్నాట్ట," అంది.

"అరెరె పాపం! నేనుపోయి కనుక్కుంటాను. ఏమీలేని వాళ్ళకే అన్నీ వస్తాయి. మీరు కాఫీ మావారికిచ్చి రండి," అంటూ వేదవతి దొడ్లోకొచ్చింది. ఆమె చక్కగా ఎర్రగావుంది. ఉదయపు మార్దవమైన ఎండపొడలో ఆమె శరీరం తళతళ లాడుతూంది.

ఆమె దొడ్లో అడ్డగోడదగ్గరకొచ్చి పార్వతిని రెండు నిముషాలు పరిశీలనగాచూచి "ఏమిటమ్మాయ్, ఏం జరిగింది?" అని అడిగింది.

పార్వతి, కొంగు వేలితో మెలేస్తూ, అంతాచెప్పి "నాకేం దిక్కుతోచకుండా వుందండి..." అని మాత్రం అన్నది.

వేదవతి "ఏమిటమ్మా! మీ వాళ్ళెవరూ లేరూ?" అని అడుగుతూ, "మరీ గాభరాపడి పోకమ్మా! అటుతిరిగి మా యింట్లోకిరా, ఆలోచిస్తాను," అంది.

పార్వతి "వస్తానండి," అన్నది. ఆమెకేమీ తోచటంలేదు. వేదవతి ఏం చెబుతుందో? సీతమ్మగారేం చెబుతుందో?—అనుకుంటూ ఆమె తలుపులకి తాళాలువేసి, వాకిలివైపుగా వేదవతి ఇంట్లోకి వెళ్ళింది.

ఆమె ఈ యింట్లోకి వెళ్ళడం ఇది రెండోసారి. ఇదివరకూ ఏదో ఒక తడవ భోజనానికి పిలిస్తే వెళ్ళింది. డబ్బు అనేదివుంటే, దాన్ని ఎన్ని రకాల వినియోగించవచ్చో ఆ యిల్లు నిరూపిస్తోంది. గోడలకి విదేశీ చిత్రాలు వేళ్ళాడుతున్నాయి. ఆ యింటిలో వున్నవారి అభిరుచులన్నీ దాదాపు విదేశీవే అనటానికి అక్కడ చాలా తార్కాణాలున్నాయి. కిటికీల కన్నిటికీ తెరలు; కలువ

వాకిళ్లకి తెరలు, టేబిల్స్‌మీద కాయితం పూలు. రేడియోలో ఏదో విదేశీ స్టేషన్ మోగుతోంది.

పార్వతి హాలుదాటి లోపలిగదిలో ప్రవేశించింది. కాళిదాసు నిలబడి కాఫీ తాగుతున్నాడు. నిలువుచారల పైజమా, అదే చారల నిండుచేతుల చొక్కా తొడుక్కునివున్నాడు. ఆయన ఉంగరాల క్రాపు ఎంతకీ దువ్వెనకి లొంగకుండా వుంది. మనిషి ఎర్రగా బాగా ఎత్తుగావున్నాడు. వేలికో వజ్రపు ఉంగరం మెరుస్తోంది.

ఆయన అదో మాదిరిగా చూశాడు పార్వతివంక. వెంటనే మొహం పక్కకు తిప్పుకుని "వేదవతీ!" అని కేకేసాడు. వేదవతి పరుగునవస్తూ, "ఏం కావాలి!" అన్నది.

"ఎవరో వచ్చారు చూడు!" అంటూ కాళిదాసు బైటికి వెళ్లిపోయినాడు, హుందాగా.

పార్వతి చూస్తూ నిలబడివుంది. నోటమాట రాలేదామెకి.

వేదవతి "రా అమ్మా రా!" అంటూ ఆమెను హాలుకి ఎడం వైపున్న గదిలోకి తీసుకెళ్లింది. "ప్రస్తుతం నువ్వేమీ ఆలోచించ లేవు. మీవారు ఆస్పత్రినించి విడుదలయ్యేవరకూ నువ్వు చేసేది ఏమీలేదు. ఊరికే ఆలోచించి బుర్ర చెడగొట్టుకోకు. సీతమ్మ నీ సంగతంతా చెప్పింది," అంటూ డ్రాయర్ లాగి అందులో వున్న ఓ పది రూపాయల కాయితంతీసి పార్వతికిచ్చి, "తర్వాత తిరిగి ఇద్దువుగాని—ఖర్చుల కుంచుకో. వెళ్లు. ఆస్పత్రికెళ్లవూ?" అన్నది పార్వతికి మాట్లాడే అవకాశమే ఇవ్వకుండా.

పార్వతి మౌనంగా వేదవతికి నమస్కరించి తన యింటికి వెళ్లిపోయింది.

## 6

ఆ రోజు ఉదయమే పదిగంటలకి డా॥ సూర్యనారాయణ ఆస్పత్రిముందు చిన్న అందమైన కారు ఆగింది. అది చంద్రా రైసు మిల్ యజమాని భానుమూర్తిది. కారునుంచి ఆయన గంభీరంగా కిందికి దిగి, నిదానంగా మేడమీదవున్న డాక్టర్ ప్రయ

వేట్ గదికి వెళ్ళాడు. మనిషి లావూ, పొడవూ సమానంగా వున్నాడు. చామన ఛాయ. సదా తమలపాకులు నమలవటంవల్ల గార పట్టిన పళ్లు. కళ్లు రెండూ ఎర్రవాసగా వున్నాయి.

ఆయన పైకెక్కిపోతూ కంపౌండర్‌కి సంజ్ఞచేసాడు. ఆయన పైకి వెళ్ళిన మరొక్క పదినిమిషాలకల్లా సూర్యనారాయణ పైకి వెళ్ళాడు.

డా॥ సూర్యనారాయణ ప్రయివేట్ గది చాలా విశాలమైనది. కిటికీలనుండి గాలీ, సూర్యరశ్మి గదిలోకి ధారాళంగా ప్రసరిస్తూ ఆరోగ్యకరంగా, ఆహ్లాదకరంగా వుంది. నాజూగ్గా రెండే రెండు దేశ నాయకుల రూపచిత్రాలు వెళ్ళాడుతున్నాయి. ఒక టేబిల్ మీద ఏదో ఒక లావాటి వైద్యగ్రంథమూ, దాని పక్కనే భగవద్గీత పుస్తకమూ వున్నాయి. ప్రిస్క్రిప్షన్ గాసే చీట్ల పుస్తకం వొకటి గూడా వున్నది. మెత్తనిసెంప్లు అమర్చబడియున్న నాలుగు పేము కుర్చీలున్నాయి.

డాక్టర్, గదిలోకివెళ్లి భానుమూర్తికి అభిముఖంగా కుర్చీలో కూర్చుని "ఏమిటింత ఆదుర్దాగా వొచ్చారు! అతనివిషయం రాత్రే ఫోన్ చేశానుగదూ!" అన్నాడు.

భానుమూర్తి ఖరీదుగల దుస్తుల్ని సర్దుకుంటూ "రాత్రి మీరన్న మాటలతో నాకు నిద్రపట్టిందిగాదు. అతని కాలు తీసెయ్యవల్సి వస్తుందనిగదూ మీరన్నారు? గాభరా పడిపోయి నాను," అన్నాడు. ఈ మాట అని తీవ్రంగా డాక్టర్‌గారివైపు చూస్తూ, జేబులోంచి ఒక సిగరెట్ తీసి వెలిగించాడు. యదార్థంగానే ఆయన మొహంలో ఆదుర్దా బాగా కన్పిస్తోంది.

"ఆ మాట నిజమేనండి. నిన్ననే ఎక్స్‌రే తీయించి చూశాను. తొడఎముక విరిగిపోయింది. ఆ కాలు తీసెయ్యటమే క్షేమం అతనికి. నిన్ననే ఆపరేషన్ చేసేసేవాణ్ణి. రోగి చాలా నీరసంగా వున్నాడు. అసలుకే మోసం వస్తుందేమోనని ఆగాను..." అన్నాడు డాక్టర్.

భానుమూర్తి "అలాకాకుండా వుంటే నష్టం ఏమిటి? కాలు తీసెయ్యకుండా నయం చెయ్యలేరండి?" అన్నాడు పైగా "ఖర్చు కేమీ జంకబోకండి..." అనికూడా అన్నాడు.

"అతనేమీ పసిపిల్లవాడుగాదు. ఏదో ప్లాస్టర్ వేసి ఎముకలు అతుక్కుంటాయి అనుకోడానికి. ఈ పెరిగిన వాళ్ళఎముకలు అతుక్కోవండి...అదీ నేను చెప్పేది," అన్నాడు డాక్టర్.

"నిజమే. కాని, నేనడిగేది-కాలు వుంచితే ఏం నష్టమని?" నిక్కచ్చిగా అడిగాడు రైస్‌మిల్ యజమాని.

"మీరంత నిక్కచ్చిగా అడిగితే నేను ఏం చెప్పను? ఇప్పుడే ఆ కాలు తీసేస్తే అతనికి ఉత్తరోత్తరా ఏ బాధా వుండదు, ఆ కాలు ఉండి అతనికి ప్రయోజనంలేదు గనుక. ఉంచాలీ అంటారా ఏనాడో ఒకనాడు అది లోలోపల కుళ్లి మొత్తం గల్లంతయ్యే ప్రమాదం వుంది," అన్నాడు డాక్టర్.

"కావచ్చు. ఆ బాధ అంత ముదిరితే ఆనాడే తీసేసు కుంటాడు ఆకాలు. ఇప్పుడే-ఇవ్వాళే మీరాకాలు తీసేస్తే గాని వీల్లేని తక్షణ ప్రమాదం ఏమీ లేదుగా?" అన్నాడు భాను మూర్తి.

"లేదనే చెప్పాలి," డాక్టర్ నంజుతూ నములుతూ అన్నాడు.

"గ్యారంటీగా చెప్పండి డాక్టర్‌గారు! పదిరోజులు మీ హాస్పిటల్లోనేవుంచి పైగాయాలు మాన్పించండి. తరవాత ఇంటికి పంపించేద్దాం. అతనికి కాలు బాగా నయమై తిరిగి పనిలోకొస్తే నేనే పని ఇస్తాను," అన్నాడు భానుమూర్తి.

"అది ఎలాగా కుదరదండి. కాలు గనక ఉంచితే, అత నెన్నటికీ లేచి నడవలేడు. దానిమీద శరీరభారం మోపితే వెంటనే ఆ బొమిక మళ్ళీస్థానం తప్పుతుంది...అందుకే నేనేం చెబుతున్నా నంటే..." డాక్టర్ ముగించకముందే మిల్ యజమాని "అదే అదే వొద్దు అంటున్నాను...కాలు తీసేస్తే రెండువేలయినా కంపెన్సేషన్ ఇవ్వాల్సి వస్తుందండి...కాలుంటే ఓ రెండొందల ఖర్చుతో పొదిలిపోతుందండి," అన్నాడు.

డాక్టర్‌కు ఇప్పుడర్థమైంది ఆ యజమాని దయ. ఆయన నములలేక, మింగలేకా బాధపడుతున్నాడు. ఇటు ఆ యువకుణ్ణి

చూస్తూవుంటే జాలి కలుగుతోంది. కాలుతీసేస్తేగాని అతని జీవితం బాగుపడదు. ఇటు చూస్తే ఈ మిల్ యజమాని తనకున్న మంచి ఖాతాదారుల్లో ఒకరు. ఈయనమాట ఎలా కాదనగలడు.

కాని, ఈలోగానే భానుమూర్తి జేబునించి రెండు పచ్చ కాయితాలుతీసి డాక్టర్ జేబులో పెట్టేశాడు; డాక్టర్ అంతరాత్మ గబుక్కున నోరు మూసుకుంది.

భానుమూర్తి మెల్లగా లేస్తూ, "పాపం—అతన్ని కాస్త కనిపెట్టి వుండండి. అన్నీ సక్రమంగా చూడండి," అని కిందికి దిగి వెళ్ళిపోయినాడు.

## 7

డాక్టర్ సూర్యనారాయణ సాంబశివరావుకి కాలు తుంచి, నయంచేశాడు పదిహేనురోజులకి. ఈలోగా పార్వతి ఇంట్లో గిన్నెలూ, తప్పాలాలూ అమ్మకుని కాలం గడిపింది. సాంబ శివరావు ఇంటికి వొచ్చినరోజుకు ఇంట్లో అన్నం వొండుకునే తప్పాలా, రెండుగ్లాసులూ మిగిలివున్నాయి.

సాంబశివరావు బండిమీద ఇంటికొచ్చేటప్పటికి సాయంత్రం అవుతోంది. సూర్యుడు దుర్గ గుడి వెనక్కి వెళ్ళిపోయినాడు. పచ్చటి అంతిమ కాంతి ఎత్తయిన భవనాలమీదపడి ప్రకాశిస్తున్నది. భర్తకి వాకిలి దగ్గరగా నుక్కిమంచం వేసింది పార్వతి. మెత్తగా వుండేందుకు పాతచీరెలు మడతపెట్టివేసి వాటిమీద ఓ గళ్ళదుప్పటీ పరిచింది. ఓ పాతదిండుగూడా పెట్టి, బండివాడి సాయంతో సాంబ శివరావును మంచంమీద తెచ్చి పడుకోపెట్టింది. డాక్టర్ ఆస్పత్రి నించి ఆమె బయల్దేరేటప్పుడు చెప్పాడు: "ఇంకో రెణ్ణెల్లదాకా ఆయన్ని నడవనీయకమ్మా! ఖర్చులకు ఈ రెండువందలుంచుకో," అని ఇచ్చాడు. "ఈ డబ్బు భానుమూర్తిగారివ్వమన్నారు," అని గూడా చెప్పాడు.

పార్వతి మాట్లాడకుండా రెండొందలూ పుచ్చుకుంది. సాంబ శివరావుకి డాక్టర్ ముందే అన్నీ చెప్పివుంచాడు గనుక, అతను భార్యను రెండొందలు తీసుకోమని చెప్పే వుంచాడు. కొంతకాలం

పాటు ఈ డబ్బుతో గడపుతూ మరోదారి ఏదైనా చూసుకోవచ్చని భార్యా భర్తలిద్దరూ అనుకున్నారు.

"కొంతకాలానికి కాలు బాగా నయమైపోతుంది. అప్పుడు తిరిగి భానుమూర్తిగారే పనిలో పెట్టుకుంటారు," అని డాక్టర్ చెప్పాడు. అయితే ఆ కొంతకాలం ఎంత కాలమో ?

అసలు ఏమీలేకండా నిరాధారంగా వుండటంకంటే రెండొందలు చేతిలో వుండడంవల్ల పార్వతికి కొంచెం మానసికాందోళన తగ్గింది. కుక్కిమంచంమీద భర్తని పడుకోపెట్టి, పార్వతి లాంతరు వెలిగించి, దాన్ని ఓ జాజిచెక్కల పాతపెట్టెమీద పెట్టి, "ఏమండీ, మీరు అన్నం తినవచ్చన్నారుగా డాక్టరు? కొట్లోకివెళ్లి బియ్యం అప్పు తెచ్చి వండుతా," అన్నది.

సాంబశివరావు భార్యలోకి చూస్తూ, "ఈ పూటకుకూడా ఇంట్లో బియ్యం లేవూ ? ఈ చీకట్లో నువ్వు పోకపోతే పొద్దున్నే పోకూడదా ఏం ?" అన్నాడు.

పార్వతి "ఉంటే అనుకోడం ఎందుకు? మధ్యాన్నమే సీతమ్మగార్ని అడిగి ఓ గొట్టం బియ్యం అప్పుతెచ్చుకుని వండుకున్నా. చీకటేమిటండి—దీపాలు పట్టపగలులాగా వుంటేను ! తొందరగా వస్తాగా... మీకేం తోచకపోతే, ఇదిగో ఈ పత్రిక చదువుతూ వుండండి," అంటూ ఆమె దీపం భర్త తలవైపున పెట్టి. ఒక పాత మాసపత్రికను అతనికి ఇచ్చింది. "వెళ్ళొస్తాను" అంటూ సంచీ చేత పుచ్చుకుని బయటికి వెళ్లింది.

సాంబశివరావు పత్రిక తిరగేస్తూ ఆలోచించసాగాడు. మూడేళ్ళ మురిపెంలా ఉద్యోగం కాస్తా ఊడిపోయింది. లాంతర్ వెలుగు పడనిచోట్ల ఆవరించిన చీకటిలా ఈ రెండొందలూ అయిపోయిన తర్వాత తను చేసేదేమిటి ? అప్పులిచ్చేవారూ లేరు. తనూ కాలు లేకుండా ఏ ఉద్యోగమూ చేయలేడు. ఆదరించి "ఇలా అయిపోయిందిటోయ్ !" అనే స్నేహితులూ, బంధువులూ లేరు. సాంబశివరావు అట్టేసేపు ఆలోచించలేక పత్రిక పేజీల్ని నిరర్థకంగా తిరగేస్తూ జీవచ్ఛవంలా పరుండిపోయినాడు. పార్వతే లేకుండావుంటే తన గతి ఏమైయ్యేదో!...

అరగంటకు పార్వతి సంచీనిండా సామానులు పట్టుకుని వొచ్చింది. పార్వతి పొయ్యి వెలిగించి అన్నం ఉడకేసే ప్రయత్నంలో పడి, ఏవో మాట్లాడుతూనే వుంది.

వంట అయింది. భర్తని మంచంమీదే కూర్చో బెట్టి, కంచంలో అన్నం కలిపి పెట్టింది. అన్నం తినబోతూ సాంబశివరావు నోరు తెరిచి మాట్లాడాడు: "నా సంగతి కేంగాని, నీకు అన్నీ కష్టాలే నే పార్వతీ!" అన్నాడు చాలా బాధగా.

"ఊరుకోండి మీరు. ఇలాగే వుంటుందా ఎల్లకాలం? కాలు బాగా నయం కాగానే తిరిగి ఫ్యాక్టరీలో పనికి చేరచ్చుగదా? అందాకా డబ్బు సరిపోతుంది," అన్నదామె తన గొంతులో ఎక్కడ లేని ఆశ ధ్వనిస్తూ.

"ఈ కాలు ఇంక పనికిరాదని కంపౌండరు నాతో అన్నాడు. అయినా బొత్తిగా తీసెయ్యడానికి ప్రాణం వొప్పలేదుట డాక్టర్ కి. ఏముందిలే పార్వతీ! తిరిగి నేను పనిచేస్తానన్న నమ్మకం నాకు లేదు. ఇలా మంచంమీద కాలం గడపాల్సిందే," అన్నాడతను ముంగురులు చెరిగి మోహాన పడుతూవుంటే మాటిమాటికీ పైకి ఎగదోసుకుంటూన్న భార్యవైపు చూస్తూ.

"ఎందు కనుకుంటారండీ అన్నీ! ఏదో విధంగా అన్నీ సర్దుకుంటాయిలెండి," అంటూ పార్వతి తలెత్తి భర్తకేసి చూసింది. ఆమె వెడల్పాటి స్వచ్ఛమైన కళ్ళలో నీళ్లు తిరిగాయి. అయినా వాటిల్లో ఏదో ఆశ ద్యోతకమాతోంది.

ఆ తర్వాత సాంబశివరావు ఏమీ మాట్లాడకుండా భోం చేశాడు. భార్య ముద్దలుచేసి పెట్టిన అన్నం గప్‌చిప్‌గా తిన్నాడు బుద్ధిమంతుడైన పిల్లాడల్లే. ఆ తర్వాత పార్వతి వెళ్లి అదే కంచంలో అన్నం పెట్టుకుని తినింది.

ఆ వేళటికి భార్యాభర్తలిద్దరూ మరి ఎటువంటి సంభాషణ చెయ్యకుండానే నిద్రపోయారు. సాంబశివరావు మాత్రం, ఒకటీ రెండుసార్లు కాలు కొంచెం అటూ యిటూ పొర్లినప్పుడు నొప్పి పుట్టింది కాబోలు, నిద్దర్లోనే మూలిగాడు.

## 8

కాళిదాసు క్లబ్‌లో ఉన్నప్పుడు ఒక అడ టైపిస్టు ఏ కంపెనీకో కావాలని అతని మిత్రుడు మాధవరావు చెప్పాడు. రాత్రి వేదవతి పార్వతిని గురించి అతనికి చెప్పినపుడు కాళిదాసుకి ఆ ఉద్యోగం జ్ఞప్తికి వచ్చింది. "ఆ అమ్మాయి కెంత సహనమండి. ఆమె భర్త వొట్టి చిర్రుబుర్రు మనిషి. భార్యని ఎలాగైనా లొంగ తీసుకోవాలనుకుంటాడో ఏమో, ఎప్పుడూ ఏవో వంకలు పెట్టి తిడుతూనే వుంటాడు. చూడలేకపోతున్నాను," అంది వేదవతి.

"అసలైన భారతీయ దాంపత్యమంటే అదే! కాదూ?" అంటూ కాళిదాసు నవ్వాడు, సిగరెట్ ముట్టించి.

"మీకంతా వేళాకోళంగా వుంది. భర్తచేత నానా చీవాట్లూ తింటూ, వోర్పుగా వుండందే భారతీయ నారీరత్నం కాదు గావును! ఏది ఎట్లానన్నా వుండనివ్వండి, ఈ అమ్మాయి గతి ఏమిటా అని నాకు చింతగావుంది సుమండి!" అన్నది వేదవతి.

"అది నీలో నిండి పొంగుతున్నటువంటి మానవత్వానికి చిహ్నం! అయితే, ఒకటి అడుగుతాను వేదవతీ! ఈ అమ్మాయి కెవరూ నా అన్నవాళ్ళు లేరా?" అని ప్రశ్నించాడు కాళిదాసు.

"ఉన్నట్టు తోచదు. ఒకవేళ ఉంటే ఇంత ఆపదలో రాక ఇంకెప్పుడు వస్తారు? లేరనే అనుకోవాలి," అన్నది వేదవతి.

హాలునిండా విద్యుద్దీపపు కాంతి పరుచుకుని వుంది. చలికాల మేమో, కిటికీల తెరలన్నీ వేళ్ళాడుతున్నాయి. గోడల నీలవర్ణం అక్కడి వాతావరణపు ప్రశాంతతను మరింతగా ఎత్తిచూపిస్తోంది. కాళిదాసుగారు "ఊరికేనే అడిగాను. అదిసరేగాని, ఆ అమ్మాయి ఏమైనా చదువుకున్నదా?" అని హఠాత్తుగా ప్రశ్నించాడు.

"కొంతవరకూ చదువుకుంది. టైప్‌రైటింగ్ కూడా వొచ్చుట ఏం? ఎందుకూ? అట్లా అడుగుతున్నారు?" అని ప్రశ్నించింది వేదవతి.

"ఎక్కడైనా ఆమెకి పనిచూపిస్తే బాగుండదూ! మొగుడు ఏమీ చెయ్యలేనప్పుడు, భుక్తిమార్గం ఎలా? ఏమాలోచిస్తున్నారు వాళ్లు?" అన్నాడు కాళిదాసు సాలోచనగా.

వేదవతి రెండునిమిషాలు ఊరికే మౌనంగా కూర్చుంది. పార్వతికి ఉద్యోగం ఇప్పించటం మంచిమాటేగానీ, ఆమె భర్త అందుకు ఒప్పుకోవద్దా? ఆమె నెలాగైనా ఒప్పించగలదు తను... తనేమిటి ? పరిస్థితులే ఒప్పిస్తాయి.

"రేపు కనుక్కుంటానండి ఆ అమ్మాయిని. ఆమె ఒట్టి వెర్రి బాగులది. మొగుడంటే తగనిభయమూ,అభిమానమూ. ఏమంటుందో!"

"యేమంటుంది ? ఆమె యేమన్నా, నువ్వు ఎలాగైనా ఆమెని ఒప్పించాలి మరి. లేకపోతే పస్తుంటారా ?"

"ఇంతగా ఆ అమ్మాయికి ఉద్యోగం ఇప్పిస్తానని పట్టుపడు తున్నారుగదా, నేను ప్లీడరీపట్టా తీసుకునికూడా వూరికేనే ఇంట్లో కూర్చుంటున్నాను. నన్నూ మీరు కోర్టుకు పోనివ్వకూడదు ?" అని వేదవతి నవ్వుతూ అడిగింది.

"చాల్లేవోయ్, ఆ అమ్మాయికంటే బొత్తిగా జరగదు గనక నౌఖరీ తప్పదు. మనకేమిటి ? నాకున్న స్థిరచరాస్తులు నీకు తెలిదా ఏమిటి ? నువ్వు సంపాయించి పోగుచెయ్యక్కర్లేదులే," అని కాళిదాసు చిరునవ్వుతో జవాబిచ్చాడు.

"అయితే, పనిచేయడం డబ్బుకోసమేనా ?" వేదవతి అడిగింది.

"కాకపోతే దేనికి వీళ్లందరూ ప్లీడరీ చెయ్యడం ? లోకాన్ని ఉద్ధరించడానికా ? ప్లీడరీచేయటం డబ్బుసంపాయించటానికి కాక పోతే, నువ్వు ప్లీడరీచెయ్యకపోవటంలో నీ కొచ్చిన నష్టమేమిటి," అని అడిగాడు భర్త.

"కాస్త జీవితంలో ఏదో మార్పుగా వుంటుందని. అదీగాక ......" అని ఇంకేదో అనబోతుంటే కాళిదాసు తను కూర్చున్న చోటినించి లేచివచ్చి, వేదవతికి ఎదురుగా నిలబడి, ఆమె భుజం మీద చెయ్యివేసి, "నాకు ఆడవాళ్లు పనిచేయడమంటే అంత ఇష్టం లేదు. కాని, పరిస్థితులు వ్యతిరేకించి తనను తాను పోషించుకోవా లన్న అవసరంవున్న ఏ స్త్రీ అయినా పనిచేసుకోవాలనే నా వుద్దేశం," అన్నాడు.

"పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు !" అందామె.

"ఇంతటితో పోనీ వేదవతి. చలివెయ్యటంలేదూ? వెళ్లి పడుకో," అన్నాడు కాళిదాసు ప్రేమగా.

"నిన్న కొనుక్కొచ్చిన నవల ఇంకా చదవలేదండి. ఇవ్వాళ రాత్రికి సగమేనా చదివెయ్యాలి," అంటూ లోపలికి వెళ్లింది. కాళిదాసు ఆమె వెనకనే వెళ్ళాడు.

తెల్లారి సీతమ్మగారు, కాఫీలం పింగాణీ కప్పుల్లోపోసి కాళిదాసు దంపతుల కిచ్చినప్పుడు వాళ్ళిద్దరి మధ్య పార్వతి విషయమైన సంభాషణే సాగుతున్నది. "సీతమ్మగారూ! ఆయనకి కాలు ఎట్లా వున్నది?" అని అడిగింది వేదవతి.

"ఆ ఖర్మ ఏమడుగుతారులెండి. ఆ అమ్మాయిలేకుండా ఏమీ చేసుకోలేడుగదా ఆ అబ్బాయి. మంచందాటి పోలేడు. సరిగ్గా నుల్చోలేడు," అంది సీతమ్మ.

"చూసొద్దాం?" అన్నది వేదవతి సీతమ్మతోనూ, భర్తతోనూ. "నేను మధ్యాహ్నం వొస్తానులే. ఆ కంపెనీ మేనేజరు నా స్నేహితుడే. నేనూ, మాధవరావూ వెళ్లి ఆయన్ని కలుసుకుంటాం ముందు. ఆ ఉద్యోగాని కెంతమంది పోటీవున్నారో మరి," అన్నాడు కాళిదాసు సిగరెట్ డబ్బా చేతపట్టుకుని బయల్దేరబోతూ. "మీ రెలాగైనా ఈ ఉద్యోగం ఆ అమ్మాయికే ఇప్పించాలి!" అన్నది వేదవతి.

"ప్రయత్నిద్దాం. ముందు నువ్వు ఆ అమ్మాయినీ, ఆమె భర్తనీ ఉద్యోగం చెయ్యటానికి అనుకూలంగా తయారుచెయ్యి!" అన్నాడు కాళిదాసు నవ్వుతూ.

"అదీ ఒక సమస్యేనా?" అన్నది వేదవతి?

"తప్పకండా! ఇది భారతదేశం అని మర్చిపోకు," అంటూ కాళిదాసు వెళ్లిపోయాడు.

ఆయన వెళ్లాక వేదవతీ, సీతమ్మగారూ రోడ్డువైపుగా వొచ్చి సాంబశివరావువున్న పెంకుటింట్లోకి వొచ్చారు. ఉదయపు ఎండ ఎదురుగా కాలవమీదా, వొంతెనమీదా తళ తళ లాడుతోంది. పెంకుటిల్లు లోపలివైపు ఇప్పుడెంతో పరిశుభ్రంగావుంది. పార్వతి రెండొందల రూపాయల్ని చాలా పొదుపుగా ఉపయోగించి, అత్య

వసరమైన సామానులు మాత్రమే కొన్నది. సాంబశివరావు ఇంకా నిద్రలేవలేదు. పార్వతి లోపల వంటింటిలో కూర్చుని కుంపటి విసురుతోంది, కాఫీనీళ్ళు పెట్టి.

వేదవతి ఒకసారి ఆ చీకటి కొంపనంతా కలియచూసింది. "పాపం !" అనుకుంది. అవును, ఏముందా కొంపలో ? మానవులకు కావలసిన కనీసపు అవసరాలుకూడా లేవాయింట్లో. రెండు నుక్కి మంచాలు, వాటిమీద రెండు కొత్తదుప్పట్లు, కొన్ని ఇత్తడి సామాన్లూ కనిపిస్తున్నాయి. అయినా, గదులు ఇదివరకులాగ్లే మొలలోతు దుమ్ములో గాకుండా, చాలా పరిశుభ్రంగా కన్పిస్తున్నాయి.

వేదవతీవాళ్లూ లోపలికిరావటం చూసిన పార్వతి కుంపటి దగ్గరనుంచి లేచి "రండి రండి !" అంటూ వాళ్ళకి ఎదురొచ్చింది. వేదవతి "చుట్టాలొచ్చాం పొద్దున్నే ఏం పెడతావో," అంటూ ఆమె దగ్గరకుపోయి చెయ్యి పట్టుకుంది.

ముగ్గురూ వంటింట్లో కూర్చున్నారు. "అయ్యో ! మిమ్మల్ని కింద కూచోపెడుతున్నానే. పీటలైనా లేవండి," అంటూ "కాఫీ ఇస్తా చుట్టాలకూ," అన్నది పార్వతి.

"కాఫీలు తాగేవచ్చాం పార్వతీ ! నీతో అమ్మగారేదో మాట్లాడతారట. అందుకని-" అంది సీతమ్మ.

"కాఫీ ఇంకా కొంచెంతాగితే మరేం పర్వాలేదులెండి," అంటూ పార్వతి డికాక్షన్ వడపోసి పాలు కలిపింది. మూడు గాజుగ్లాసులలో పోసి సీతమ్మకీ, వేదవతికీ ఇచ్చింది. ఇంకా సాంబశివరావు లేవలేదు. అతనిగ్లాసు పక్కనపెట్టి, "ఏం పనండి ? నన్నే రమ్మంటే నేనే మీ యింటికి వచ్చేదాన్నిగా," అంది పార్వతి.

వేదవతి కాఫీ చేతబుచ్చుకుని తాగబోతూ, "నువ్వు ఎక్కడైనా వంటపనివుంటే కుదర్చమని సీతమ్మతో అన్నావుటగా ?" అని అడిగింది, పార్వతివంక చూస్తూ.

పార్వతి కొంచెం సిగ్గుపడుతూ తలవొంచుకుని "అన్నానండి. కాలం వెళ్లొద్దుటండీ ? వాళ్లిచ్చిన రెండొందలకిగాను ఇంకో ఏర్పాటు చేసుకున్నాయి. అవి ఎన్నాళ్లొస్తాయ్ ? ఆయనేమో లేచే పరిస్థితి

కనపడలేదు! ఏం చెయ్యడానికీ తోచక వొదినగారితో అన్నమాట నిజమే," అన్నది తనకాఫీ గిన్నెలోకి తిరగబోసి అర్పుకుంటూ. ఆమెమొహం సిగ్గుతో కొంచెం ఎర్రబడింది.

"నువ్వు వంటపనికి వెళ్తానంటే మీ వారు వొప్పుకుంటారూ?" వేదవతి ప్రశ్నించింది. సీతమ్మగారు వంటింటి గడప అవతలకూర్చుని "వొప్పుకోకపోతే జరిగే విధమేదీ?" అన్నది.

"ఏవిధమూ లేనప్పుడు ఏమంటూరు వారుమాత్రం?" అంది పార్వతి.

సీతమ్మగారు "మీవారు లేచారల్లేవుంది చూడమ్మాయ్!" అంది సాంబశివరావువంక చూసింది.

సాంబశివరావు లేచి దుప్పటి ముసుగుతియ్యకుండానే దిండు కానుకుని కూర్చున్నాడు. కాలువిరిగి మంచమెక్కిన దగ్గరనుంచీ అతనికి ఒకవంక చిరచిర ఎక్కువైంది. అనవసరమైన కోపం బల హీనతను కప్పి పుచ్చుతుంది కాబోలు!

పార్వతి మంచం కోళ్లవద్ద చెంబులో నీళ్ళూ, కచ్చిక, తాటాకూ పెట్టి "మొహం కడుక్కోండి; కాఫీ చల్లారిపోతోంది!" అన్నది మెల్లగా. గొంతులో ఎంతో నమ్రత ఉట్టిబడుతోంది. ఆమెకి బాగా తెలుసు భర్త తత్వం.

అయినా సాంబశివరావుకి కొంచెం కోపం రానేవచ్చింది. "ఉండవే ఊరికే సతాయిస్తావేంటి అట్లా? చలిపుట్టి చస్తుంటేను!" అన్నాడు. అతనికి వంటింట్లో ఎవరో ఉన్నారని తెలిసే అన్నాడు.

పార్వతి ఏమీ ఎదురుమాట్లాడకుండానే తిరిగి వంటింట్లోకి వచ్చింది. వేదవతీ, సీతమ్మా ఒకర్నొకరు అర్థవూర్తిగా చూసు కున్నారు. పార్వతికింకా ఇరవై ఏళ్ళుగూడా నిండలేదు...ఆమె ఈ దేవుండే మొగవాళ్ళెవరూ ఎవరిపట్లా గూడా ఇంత బాధ్యతతో, ఇంత నమ్రతగా వ్యవహరించరు...అయినా ఆమెని, తాళికట్టిన పాపానికి మొగుడు దబాయిస్తున్నాడు - ఏ కారణమూ లేకండానే.

వేదవతి పార్వతివైపు జాలిగా చూస్తూ, "మీ ఆయనకి కాఫీ ఇచ్చిరా, తీరికగా రెండుముక్కలు చెప్పి వెళతాను," అంది.

పార్వతి మౌనంగా తల ఆడించింది. కాఫీ గిన్నెల్లోంచి గ్లాసులోకిపోసి బైటికి తీసుకెళ్లింది. ఆమె బయటకి వెళ్ళాక సీతమ్మ, వేదవతి వంక తిరిగి గొంతు బాగా తగ్గించి, "ఆ కాలం వెరిగేక అతడు కిరాతకుడయ్యాడు! ఆ పిల్లని ఎప్పుడూ వేపుకుతింటాడంటే నమ్మ! కూచుంటే తప్పు, నుంచుంటే తప్పు. చెప్పుకునే దిక్కు లేదని మరీ మండిస్తున్నాడు. ఇంతకిముందు ఎంతో కలిసి వుండేవారు. ఏమొ చ్చిందో?" అంది.

"లక్షరకాల మనుషులు! అందులో ఇదొక రకం. మనం చెబితే వింటాడంటారా?" అంది వేదవతి.

"నేను వెళ్లి అతన్ని మెల్లగా కదిలిస్తాను. మీరు ఆ అమ్మా యికి చెప్పండి," అని సీతమ్మ జవాబిచ్చింది.

"సరే కానివ్వండి. నిదానంగా వొప్పుకునేట్టు చెయ్యండి. వొప్పుకోకపోతే అన్యాయంగా కడుపులు మాడతాయి," అంది వేదవతి.

"అలాగేనమ్మా!" అంటూ సీతమ్మ నడిమి ఇంట్లోకి వస్తూ, "ఏం తమ్ముడూ నయమేనా?" అని ప్రశ్నించింది సాంబశివరావుని.

అప్పుడే కాఫీ ముగించి మంచం మీదన పడుతున్న ఎండ పొడలో మొహంపెట్టి పడుకున్న సాంబశివరావు "అదే నయం! కుంటికాలు కుంటికాలే," అన్నాడు నీరసంగా.

"ఫర్వాలేదులే నాయనా. అదే నయం అవుతుంది. అయితే, నేను ఒకమాట చెబుతాగాని...కోప్పడవు గదా?" అంది సీతమ్మ, అనూనయిస్తున్న స్వరంలో.

"ఏమిటో చెప్పండి. కోపం దేనికీ?" అన్నాడు సాంబశివ రావు, బీడి తీసిగూడా సీతమ్మ ఎదుట ఎలా వెలిగించడమూ అని ఆలోచిస్తూ.

సీతమ్మ గొంతు సవరించుకొంది. "మరేమీ లేదు..." అని ఆమె కొంచెం తడబడి మళ్ళీ సర్దుకుని ఆరంభించింది. "మా కాళిదాసు గార్నెరుగుదువుగా?" అన్నది.

"ఆఁ! కానియ్యండి" అన్నాడు సాంబశివరావు చిరచిర లాడలక.

"ఆయన పార్వతికి ఓ పని చూసి పెడతానన్నారు."

"వంట పనేనా? పార్వతికూడా ఈ మధ్య ఆ మాట అంటున్నది లెండి!" అన్నాడు సాంబశివరావు నిర్లిప్తంగా.

"వంటపనేం ఖర్మ నాయనా? ఓ కంపెనీలో..." ఆమె సగం మాట అంటూ వుండగానే సాంబశివరావు అడ్డం వొచ్చి, "వంటపనిగాక ఇంకేం చేస్తుందని? కంపెనీల్లో ఇదేం చేస్తుంది!" అని హేళనగానూ, కొంత కటువుగానూ ప్రశ్నించాడతను. అతనికి భార్య చదువు సంధ్యల విషయం బొత్తిగా జ్ఞాపకం లేదు. పార్వతీ గూడా ఆ ప్రసక్తి ఎన్నడూ అతని ఎదుట ఎత్తి ఎరగదు.

"పార్వతికి టైప్ చేయడం వొచ్చటగా?" అన్నది సీతమ్మ.

సాంబశివరావు ఆమె ప్రశ్నకు జవాబియ్యలేదు. ఏదో అవ్యక్తమైన ఈర్ష్య ధ్వనిస్తోంది. ఇంతకాలమూ తనమీద ఆధారపడ్డ భార్య, ఈ రోజున తన సంపాదన అక్ఖర్లేకండా జీవిస్తాను అంటున్నది...ఇంక తానేం లెఖ్ఖచేస్తుంది?...సాంబశివరావు కప్పువంక చూస్తున్నాడు. పైకప్పులోని సన్నని రంధ్రాల్లోగుండా వెలుగు చారలు శూలాల్లాగా లోపలికి పడుతున్నయ్. ఆ చీకటికొంపలో కొంతమేర వెలుగు ఏర్పరచటానికి వ్యర్థప్రయత్నాలు చేస్తున్నాయి.

సీతమ్మ "ఏమంటావు నాయనా? ఆమె కొంతకాలం, నువ్వు లేచి తిరిగి సంపాయించేవరకూ ఎక్కడైనా పనిచేసి నాలుగు రాళ్ళు, తెస్తే హాయిగా కాలం గడుస్తుందని నాకు తోస్తున్నది. ఏదో పెద్దదాన్ని...కాలం అట్లా వొచ్చింది నాయనా! లేకపోతే పార్వతి గడపదాటే పనేమున్నది?" అన్నది ప్రేమతో.

సాంబశివరావు మౌనంగా వూరుకున్నాడు. మౌనం అర్థాంగీకారమని అతనూ ఎరుగును. సీతమ్మ అంతే అనుకుని "నేను వెళ్తున్నా నాయనా. కాళిదాసుగారికి చెబుతాలే," అంది.

సాంబశివరావు "మీరు తొందరపడకండి. నేను దానితో మాట్లాడి చెబుతాలెండి. వొట్టి అయోమయం మనిషి అది," అన్నాడు మళ్లీ ఇష్టంలేనట్టు ధ్వనిస్తూ. సీతమ్మ అతను జవాబిచ్చే లోగానే వెళ్లిపోయింది.

ఈలోగా లోపల వేదవతి పార్వతితో అన్నది: "వంటపని కంటే వుద్యోగమే దొరికితే ఇంకా మెరుగుగదూ?".

పార్వతి "ఉద్యోగమా? నా కెవరిస్తారు? ఏం ఉద్యోగం చేస్తాను నేను?" అన్నది ఆశ్చర్యంతో. తనమీద తనకే నమ్మకం నశించిపోయింది ఈ నాలుగేళ్ళలోనూ.

"ఏదో చదువుకున్నానన్నావు? టైపుగూడా నేర్చుకున్నానన్నావు. మరి ఇంక ఉద్యోగం చెయ్యడానికేం అభ్యంతరం?"

పార్వతి, "ఇంకా ఆ చదువూ, ఆ టైపూ జ్ఞాపకంవున్నాయంటారా? ఎక్కడో వంటచేసుకుని బతకడం మంచిదిగదండీ," అన్నది నీరసంగా.

"అదేమిటమ్మాయ్ అలా అంటావు? నాలుగేళ్ళకే చదువు మర్చిపోతావా? నీకంతా ఇప్పుడు అయోమయంగా వుంటుంది గాని, ఉద్యోగంలో చేరితే వాటంతటవే అవసరంకొద్దీ జ్ఞాపకం వొస్తయి. నీకెందుకు నువ్వు ఒప్పుకుంటే నేను ఉద్యోగం ఇప్పిస్తాను," అన్నది వేదవతి చాలా ప్రోత్సాహకరంగా.

"మగవాళ్లతో సమానంగా కూర్చుని పనిచెయ్యాలంటే సిగ్గుగా వుండదుటండీ," అంటూ పార్వతి తలొంచుకుంది.

"అలా సిగ్గుపడితే పొట్టనిండొద్దుటమ్మా? మగవాళ్ళు దెయ్యాలా, భూతాలా? వాళ్ళపని వాళ్ళు చేసుకునిపోతారు, మన పని మనం చేసుకుపోతాం. ఎంతమంది ఆడవాళ్ళు పట్నాల్లో పనులు చేసుకోటంలేదు. నీవు గనక ఉద్యోగంలో చేరితే అటువంటి సంశయాలూ అన్నీ గాలిలోకి ఎగిరిపోతాయి. కొంచెం తెగించక పోతే మీ సమస్యలు పరిష్కారమవవు," అన్నది వేదవతి.

"ఉద్యోగం దొరికితేగదా ఈ మాటలన్నీ," అని సగం వొప్పుకున్నట్టుగా అన్నది పార్వతి.

"నువ్వు ముందు వొప్పుకుంటే ఉద్యోగం కుదిర్చే భారం నాది. నే వెళ్లొస్తానమ్మా. పొద్దు పోతోంది," అని లేచింది వేదవతి. సీతమ్మకూడా లేచింది.

"నాకోసం ఎందుకండి ఇంత శ్రమపడుతున్నారు?" అంటూ పార్వతి వారిని బయటకు సాగనంపింది.

# 9

దుర్గా ఆటోమోబైల్స్ కంపెనీ యజమానులతో మాట్లాడ్డానికి మధ్యాహ్నంవేళ నిర్ణయించుకున్న కాళిదాసు, ఫోన్‌లో మాధవరావుకా విషయం తెలియజేసాడు. కాళిదాసుకి పదిన్నరకే భోంచేసే అలవాటుండడంవల్ల, 'ఆవేళగూడా అలాగే పెందళకడే భోంచేసి, ముందుగదిలో కూర్చుని ఏదో ఇంగ్లీషు పత్రిక చదువుతూవుండగా వేదవతి ఆ గదిలోకివొచ్చి "ఆ సాంబశివరావును మీరే ఒప్పించాలండి," అన్నది.

కాళిదాసు పత్రిక పక్కనపెట్టి "ఏమన్నాడేమిటి?" అని ప్రశ్నించాడు చిరునవ్వుతో.

"నా భార్య ఉద్యోగం గూడా చేస్తుందా?" అని ఆశ్చర్యపోయాడు. భార్య సంపాదించుకువొచ్చి పెడితే నేను తినటమా! అని అదొక బాధ! ఎన్ని ఏడ్పులు ఇందులో? సీతమ్మ చెప్పింది గాని, కుదరలేదు వ్యవహారం. మీరే వెళ్లి బాగా మాడుకుంటేట్టు చెప్పిరండి కాస్త. మీరు చెబితే వింటాడేమోను!" అన్నది వేదవతి ఎంతో నమ్మకంతోటి బతిమాలుతూ.

"అరగంట ఆగి వెళ్తాలే. మనమంటే పదింటికే తిని కూచున్నాంగాని, వాళ్లింట్లో భోజనాలకి అపరాహ్ణం దాటాలిగ!" అన్నాడు కాళిదాసు.

వేదవతి "సరే మీ ఇష్టం," అనేసి వెళ్లిపోయింది లోపలికి.

తర్వాత ఓ గంటసేపు ఆపత్రికను చదువుకుంటూ కాళిదాసు కూర్చున్నాడు. అటుపైన సాంబశివరావును కలుసుకొని మాట్లాడి వద్దామన్న ఉద్దేశంతో బయటకి వొచ్చాడు. ఆయన గంభీరమైన ఆకృతి, ఎదటివార్ని సగం ఆకర్షించి ఆయన మాటల్లో విశ్వాసం కలిగించుతుందని ఆయనకో గాఢ విశ్వాసంఉంది; అది నిజంగూడా.

ఎండ తీవ్రంలేదు. మధ్యాహ్నంవేళ గావటంతో వీధి నిర్మానుష్యంగా వుంది. ఎదురుగా కాలవగట్టుమీదవున్న గుడిశెలో వున్న ఓ ముసలాడు మాత్రం నులక పేనుతూ ఏదో బైరాగి పదం పాడుకుంటున్నాడు. పొడిగాలి వీస్తోంది కాలవమీదగా.

కాళిదాసు ఠీవిగా నడుస్తూ, బాగా వొంగి సాంబశివరావు ఇంట్లో ప్రవేశించాడు. సాంబశివరావు అప్పుడే భోంచేసి బీడీ కాలుస్తున్నాడు. పార్వతి లోపల భోంచేస్తున్నది. కాళిదాసు సాంబశివరావు కిదివరకే పరిచయం.

"ఏం సాంబశివరావు! కాలం కాస్త నడవనిస్తూందా !"అంటూ అతని మంచం పక్క నిలబడి కాళిదాసు అడిగాడు. సాంబశివరావు ప్రయత్నపూర్వకంగా తలపైకెత్తి, ఆ పక్కనే గోడకి ఆనించివున్న ఇంకో మంచాన్ని చూపిస్తూ "రండి! రండి? ఆ మంచం కాస్త వాల్చుకుని కూర్చోండి," అన్నాడు చాలా మర్యాదగా. కాళిదాసు మంచం ఒక్క అడుగుదూరంలో వాల్చుకుని కూర్చుని చుట్టూ చూశాడు. చేతిలో సిగరెట్ డబ్బాకింద పెట్టి "కాలం ఎలా వుందేమిటి?" అని తిరిగీ ప్రశ్నించాడాయన. ఒక సిగరెట్ తీసి వెలిగించాడు.

"కాలుకింద మోపలేనండి. ఇలా మంచం పాలై పడివున్నాను. ఒకప్పుడు బహు విరక్తి ఏర్పడుతోంది," అన్నాడు సాంబశివరావు.

"మరీ అంత నిరాశపడితే ఎట్లాగులే! అయితే ఏమోయ్, ఇకముందు ఏం చేద్దామని నీ ఊహ?" అన్నాడు కాళిదాసు ప్రశ్నార్థకంగా.

"ఏమీ తోచడంలేదండీ," అని నసిగాడు సాంబశివరావు. "మరి, మీ ఆవిడకి ఓ ఉద్యోగం చూసిపెడదామని వుంది. నీకే మైన అభ్యంతరమా?" కాళిదాసు ప్రశ్నించాడు.

సాంబశివరావు వంటింటివైపు చూస్తూ "దాని మొఖం, అదేం చేస్తుందండి వుద్యోగం?...అయినా దాన్నే అడిగితే పోతుంది. దానికి ధైర్యంవుండి చేస్తానంటే నాదేంవుంది. ఎలాగో జరుగుబాటు కావాలిగదా?" అన్నాడు తటస్థంగా.

"ఆమె వొప్పుకున్నట్టేలే. కాలం అట్లా పరిణమించినప్పుడు ఏం చేస్తాం? ఆడవాళ్లూ ఉద్యోగాలు చెయ్యవల్సి వొస్తుంది," అన్నాడు కాళిదాసు. సాంబశివరావుకి ఒక సిగరెట్ ఇచ్చి, తనొకటి ముట్టించాడు. కమ్మని సిగరెట్ పొగ సుడులుతిరిగి నింగుతోంది చీకటి ఇంటిలో. సాంబశివరావుకూడా సిగరెట్టు రెండుగుక్కలు

పిల్చి వొదిలి, "పడుచువాళ్ళు ఉద్యోగాలనీ, ఊళ్ళేలడాలనీ బయ ల్దేరితే, మరీ అలుసండి మొగాళ్ళకి. నేనుచూశానుగా ఫ్యాక్టరీలో... అక్కడ ఆడకూలీలతో ప్రతివాడూ సరసాలాడ్డం..." అన్నాడు అసంపూర్తిగా.

"అది ఆయా స్త్రీల ప్రవృత్తినిబట్టి వుంటుంది. పార్వతి తలొంచుకుపోయే రకం. ఎవడైనా అంటే తెగించి ఏదైనా అన్నాడూ, మేముశేమా? మళ్ళీ వాడ్ని బెజవాడలో కనపడనిస్తామా?" అన్నాడు కాళిదాసు తీక్షణంగా. "స్వతహాగా ఎవళ్ళగుణం వాళ్ళని కాపాడుతుంది సాంబశివరావు! పార్వతి చాలా మంచిపిల్ల. ఆమెని సాహసించి ఏమన్నా అనటానికి ఎవడూ పూనుకోడని నా నమ్మకం. ఏమంటావు?"

సాంబశివరావుకి ఎంతో గర్వంగావుంది, తనభార్యని కాళి దాసు పొగడ్డంతో. "మీరున్నారుగా, నాకేం అభ్యం తరం?" అనేశాడతను.

"మిస్టర్! నీకు కొంచెం కులాసాచేకూరి, ఉద్యోగంచేసే తాహతు వొచ్చిననాడు ఆమె ఇక పనికి పోవల్సిన పనేలేదు... ఇటుచూడు సాంబశివరావు, నా వైఫ్ లా డిగ్రీ పుచ్చుకుని వూరికే కూర్చుని వుంది. ఏం అంటావేమో! మాకు సంపాయిస్తేనేగాని గడవదన్న అవసరంలేదు. ఏదైనా అంతే అనుకో," అన్నాడు కాళిదాసు మృదువుగా.

ఈలోగా భోజనంముగించి, వంటఇంటి తలుపు కానుకుని వీరిద్దరి సంభాషణలనూ ఆలకిస్తున్న పార్వతికి కాళిదాసంటే ఎక్కడలేని గౌరవం ఏర్పడింది మనస్సులో. ఆయనకున్న డబ్బుకి తమబోటి వాళ్ళని లెక్కచేసి మాట్లాడడమే ఆశ్చర్యం. అందులోనూ తామంటే ఎంతో దయగా, శ్రద్ధగా వుండడం ఎంత ఆశ్చర్యం!

"మీ రింతగా చెబుతూవుంటే కాదంటానా? కానియ్యండి. ఏది ఏమైనా పూచీ అంతా మీదే," అంటూ సాంబశివరావు మళ్ళీ దిండుకి చేరగిల పడ్డాడు. కాళిదాసు లేస్తూ, "నీకు పొద్దు పోవడానికి పుస్తకాలూ, పత్రికలూ కావాలంటే మా ఇంట్లోంచి తెప్పించుకో. సందేహించకు," అంటూ బయటకి వెళ్ళాడు.

ఆ రోజు మూడుగంటలకి కాళిదాసు తన మిత్రుడైన మాధవ రావుతో కలిసి దుర్గా ఆటోమొబైల్స్ కంపెనీకి వెళ్ళాడు.

# 10

ఆ మర్నాడు ఉదయం వేదవతి దొడ్లో పంపుదగ్గర నీళ్ళు పట్టుకుంటున్న పార్వతిని పిల్చి "ఇవ్వాళ నువ్వు ఆ కంపెనీకి ఇంటర్వ్యూకి వెళ్ళాలమ్మా. ఉద్యోగం ఖాయమైనట్టే," అంది.

"కంపెనీ ఎక్కడండీ?" అడిగింది పార్వతి. ఆమెకేదో భయంగా, బెరుకుగా వుంది. తానేనాడూ ఇల్లువదిలి ఎరగదు. కొత్త వాళ్ళతో మాట్లాడ్డమైనా చేతగాదు. ఆ కంపెనీలో అందరూ మొగవాళ్ళే వుంటారు కాబోలు. అదీగాక తాను నిర్వహించవల్సిన పనులు ఎలాంటివో? ఈ సందేహాలన్నీ ఆమెని మొన్నటినుంచీ వేధిస్తున్నాయి.

"గాంధీనగరంనించి సత్యనారాయణపురం పొయ్యే రోడ్డు మీద సినిమాహాలుందిగా? దానికి ఎడంవైపు 'దుర్గా మాన్షన్స్' మేడవుంది. అదే కంపెనీ. కింది అంతస్తులో షో రూమ్ వుంటుంది. వెంటనే గుర్తుపట్టగలవులే. నువ్వు సరిగ్గా పదిగంటలకి బయల్దేరి అక్కడికి వెళ్ళు. మావారు గూడా అక్కడే వుంటారు. నీకేంభయం లేదమ్మా!" అంది వేదవతి.

"వెళ్తాలెండి. తప్పేదేముంది?" అన్నది పార్వతి.

"ఏమిటో మృత్యుగహ్వరంలోకి పోయేదానిలా మాట్లాడుతావేం పార్వతి! అక్కడ వున్నవాళ్ళు మనుష్యులే. నీకేం భయం అక్కర లేదు. ఏమిటి? తలెత్తి నా వంక చూసి మాట్లాడు," అన్నది వేదవతి.

పార్వతి కాస్త తల పైకెత్తి చూసింది. ఆ సమయానికే వేదవతి నవ్వటంతో ఆమెకూడా నవ్వేసింది. "వెళ్తానంటున్నాను గదండి! ఇంకా భయమెందుకూ?" అన్నది.

"పార్వతీ! ఏం చేస్తున్నావు దొడ్లో? బీడీలు తెచ్చి పెట్టమంటూంటే!" అని పెద్దగా అరిచాడు సాంబశివరావు

పార్వతి "వెళ్ళొస్తానండి," అని వేదవతితోటి చెప్పి లోపలికి పరిగెత్తింది. లోపలికిపోయి, "ఎక్కడ వున్నాయండి బీడీలూ!" అని అడిగింది భర్తను.

"ఎక్కడ వున్నాయే నీ మొహంమండా! పోయి ఒక అణాకి కొనుక్కురా," అని మండిపడ్డాడు భర్త.

"వెళ్ళొస్తానండీ. ఎందుకట్లా కోప్పడతారు?..." అంది బతిమాలుకున్నట్లు మొహంపెట్టి. "పో తొందరగా. కోపమట కోపం. పొద్దుట్నుంచీ బీడీలు లేక నేను చస్తూంటే!" అన్నాడు సాంబశివరావు మొహం పక్కకు తిప్పుకుని.

పార్వతి మొహం జేవురించింది. కాని, అలా నిలబడితే ఇంకా మండిపడతాడు అతను. అందుకని ఆమె వెంటనే అణా తీసుకుని ఆ వీధి మూలలోవున్న బీడీ కొట్టుకువెళ్ళి బీడీలు కొనుక్కొచ్చి ఇచ్చింది భర్తకు. భర్త బీడీ అంటించిన తర్వాత మెల్లగా అతని పక్కనే మంచం దగ్గిర నిలబడి, "ఇవ్వాళ ఆ కంపెనీ వాళ్లు ఇంటర్వ్యూకి రమ్మన్నారుట. వంటచేసి మీకు అన్నంపెట్టి పదిగంటలకు వెళ్ళొస్తా," అంది లాలనగా.

సాంబశివరావు ఎందుకో చిరచిరలాడుతూ, తలెత్తి భార్యవైపు చూశాడు. "అన్నీ నన్నడగడం దేనికి? ఎక్కడికి కావాలంటే అక్కడికి చావరాదు! నీ మొహం చూస్తే ఇచ్చేవాడూ ఉద్యోగం ఇవ్వడు," అని అన్నాడు చిరాకుగా.

పార్వతికి ఉన్న ఉత్సాహమూ నశించింది ఈ మాటలతో. అయినా, ఆయన మాటలు పట్టించుకుంటూకూర్చుంటే అయినట్లే అనుకుంది ఆమె. ఇంట్లోనే కూర్చునే రాత వుంటే, ఆయనకి కాలు విరగటం ఎందుకు!... "మీకేమన్నా కావాలంటే పిలవండి. నేను పొయ్యిమీద ఎసరు పెడతా!" అంటూ ఆమె లోపలికి పోయింది.

"పో-పో. నీ మొహంచూస్తేనే నాకు మంట," అన్నాడు విరక్తిగా. కాలు విరిగి మంచం పట్టాక అతనికి పార్వతి మాటంటే బొత్తిగా గిట్టడంలేదు. ఏదో అకారణ ద్వేషం; అనవసరపు కోపం.

పార్వతి గబగబ వంట చెయ్యసాగింది. చింతకాయ పచ్చడి నూరి అన్నం వొండి, తొమ్మిదింటికి సాంబశివరావుతో "ఏమండీ! ఇప్పుడు తింటారా, మళ్ళీ వొచ్చిపెట్టనా?" అని అడిగింది.

"ఇప్పుడే తిని కూర్చోలేనులే. పోయిరా. తర్వాత చూసుకుందాం," అన్నాడు ఏదో పత్రిక నుచదువుతూ. పార్వతి గబగబ ఉన్న

రెండు చీరల్లోనూ మంచి చీరను ఎంచి కట్టుకుంది. దొడ్లో కేవన్న మందార పువ్వుకోసుకొచ్చి తలలో జొప్పించుకున్నది. ఆమెకి పౌడర్లూ, స్నోలూ అలవాటులేదు. ఆమె నొసటనున్న కుంకుమబొట్టు మెరుపులా మెరిసిపోతోంది. ఆమె ఇలా తయారవడం సాంబశివరావు ఓరకంటితో చూస్తున్న వాడల్లా "ఏదో గవర్నర్ తో ఇంటర్వ్యూ కెళ్తున్నట్టు కులుకుతున్నావేమిటి? చాల్లే, పదింక!" అని కసిరాడు.

పార్వతి తన స్వల్ప అలంకరణ పూర్తిచేసుకుంది. తన ట్రంకుపెట్టెనుంచి పాతకాలంనాటి సర్టిఫికెట్లు తీసుకుని "కళ్లోస్తా నండి, జాగ్రత్త!" అంది.

"తొందరగా రా. దిక్కులు చూస్తూ పోకు. ఇది పట్నం!" అన్నాడు, సాంబశివరావు చిరాకుగా.

పార్వతి నిజంగానే పట్టణం ఎరక్కపోయినా, అంత అవ్యక్త మనిషి కాదు. అదీకాకుండా ఆమె ఇటీవల ఇంటికి కావల్సిన వస్తువులు కొనటానికి చాలాసార్లు విజయవాడ ఇరుకు బజార్లకు వెళ్లి నిగ్రహించుకొచ్చింది.

ఆమె చకచక నడిచి గాంధీనగరం ప్రవేశించింది. చెంగు చుట్టూ కప్పుకుని, కొద్దిగా తలపైకెత్తి అటూ ఇటూ చూస్తూ నడుస్తోంది ఆమె. పదిగంటలు కాలేదింకా. జనం ప్రవాహసాదృశ్యంగా బజార్ల వెంట నడుస్తున్నారు. రెండువైపులా కొట్లు, హోటళ్ళు. పేవ్‌మెంట్లమీద జనం కిక్కిరిసిగా నడుస్తున్నారు. అక్కడక్కడ గుంపులు జేరి మాట్లాడుతున్నారు.

పార్వతి నల్లని జడమీద ఎర్రమందారపువ్వు చవితిచంద్రుడులా మెరిసింది. ఎంత వాయిల్ చీరయినా అడకువగా ఒంటికి కతుక్కున్నట్టు కట్టుకోడంవల్ల అందంగా కనపడుతోంది. ఆమెకు నడక అలవాటులేకపోవడంవల్ల కొంచెం ఆయాసపడుతూ పదినిమిషాలకల్లా సత్యనారాయణపురం పొయ్యే రోడ్డుమీదవున్న సినిమా హాలువద్ద ఆగి చూసింది. హాలుకి ఎడంవైపుగా పెద్ద భవనంమీద 'దుర్గా మాన్షన్సు' అన్న బోర్డు, కింద 'దుర్గా ఆటోమొబైల్సు' అన్న బోర్డు కన్పించాయి. కింద అంతస్తులో నాలుగు పెద్ద షోరూమ్‌లలో

బ్రహ్మాండమైన అద్దాలకి వెనక కొత్తగా మెరిసిపోతున్న కార్లు కన పడ్డాయి.

షోరూమ్‌లకి ఎడంవైపు 'ఆఫీసుకి దారి' అనే బోర్డుతో మెట్ల వరస కినపడుతున్నది. పార్వతి కెందుకో గుండెదడ ప్రారంభ మైంది. భయంతో మేడమెట్లు ఎక్కింది.

# 11

మేడ మెట్ల చివర పెద్ద హాలు. నేల మీద ఖరీదైన రత్నకంబళి పరచబడివుంది. గోపీవన్నె రంగుపూయబడిన గోడలు. ఆ గోడలకి రకరకాల నాయకుల ఫోటోలూ, టైలర్ కంపెనీల కాలెం డర్లూ వేళ్లాడుతున్నాయి. పైన ఫాలింపంకాలు తిరుగుతున్నాయి. నలుగురు గుమాస్తాలు, ఒక అమ్మాయి బల్లలదగ్గర కూర్చుని వొంచిన తల ఎత్తకుండా పనిచేసుకుంటున్నారు. పార్వతి ఒక నిమిషం అన్నీ చూసింది. తర్వాత మెల్లగా నడిచి లోపలికి వెళ్లి, మూలన బల్లముందు కూర్చుని పనిచేస్తున్న అమ్మాయి దగ్గరకెళ్లి ఆగింది. "ఏమండీ!" అన్నది తగ్గుస్వరంలో.

అక్కడ పనిచేస్తున్న గుమాస్తాలు నలుగురూ, ఆమె లోపలికి రావటంతో ఆమెకేసి చూశారు. ఏదో లెక్కరాస్తున్న ఆ అమ్మాయి తలెత్తి. "మీకేనా ఇవ్వాళ ఇంటర్వ్యూ ఇస్తామన్నది? లోపలికి వెళ్ళండి. అదిగో ఆ స్ప్రింగ్ తలుపున్నదే—అది నెట్టు కుని వెళ్లండి," అన్నది. ఆ అమ్మాయి నవనాగరిక అలంకా రాలతో వన్నెల విసనకర్రలాగా వున్నది. పెదాలకు రంగు పూసింది. పౌడరు ఆ గుళం మందానికి పులుముకుంది. ఆమె కట్టు కున్న చీర బహుసన్నగా లోపల అవయాలు పైకి కన్పిస్తున్నా యేమోనన్న భ్రమకల్గిస్తున్నాయి. ఆమె పార్వతినిచూసి నోరు చప్ప రించేసింది. అవును మరి! ఏమాత్రం నాజూకులేని మామూలు వేషంలో వున్న పార్వతి ఆమెకి వింతగా కన్పించడంలో ఆశ్చర్యంలేదు.

పార్వతి ఆ అమ్మాయి ఆశ్చర్యాన్ని గుర్తించినట్టే, "థాంక్యూ" అనేసి, ఓరగంటితో చుట్టూవున్న వాళ్ళని ఒకసారి చూసి, స్ప్రింగ్ తలుపులు నెట్టుకుని లోపలి గదిలోకి ప్రవేశించింది.

ఆమె గదిలోకి వెళ్లగానే అక్కడ కూర్చున్న అమ్మాయి తన కెదురుగా పనిచేస్తున్న ఇంకో యువకుడ్ని "వాట్ మిస్టర్ సుబ్బారావ్?, దిస్ కంట్రీ గరల్ వాజ్ సెలక్టెడ్ ఫర్ దిస్ జాబ్!" అని రహస్యంగా ప్రశ్నించింది, హేళనగా.

సుబ్బారావు ఇన్‌షర్టువేసి నవనాగరీకంగా వున్నాడు. అతనూ నవ్వి, "యెస్ యెస్ మేడం," అన్నాడు. మిగతా ముగ్గురు క్లర్కుల్లోనూ తల నెరిసిన ఒకాయన "సుబ్బారావుగారూ! ఈ యమ్మాయేనండి. చూడండి ఎంత కళగా లక్ష్మిలావుందో," అని మెచ్చుకున్నాడు.

లోపలి కడుగుపెట్టిన పార్వతిని, ప్రొప్రయిటర్ కెదురుగా సోఫాలో కూర్చునివున్న కాళిదాను "రా అమ్మా, నీకోసమే చూస్తున్నాం," అని ప్రొప్రయిటర్ని ఆమెకి పరిచయం చేస్తూ, "వీరే ఈ కంపెనీ యజమాని మంత్రమూర్తిగారు," అన్నాడు. ఆయన పక్కనే కూర్చునివున్న మాధవరావు ఆమెని ఎగాదిగా చూశాడు, ఏదో ఆమెని అర్థంచేసుకోవాలని ప్రయత్నిస్తున్నట్టుగా. అతనికీ ఈ అమ్మాయికీ, ఈ ఉద్యోగానికీ సంబంధం వున్నట్టుగా వుంది. చాలా నిరాడంబరంగా వుండి, ఎంతో సిగ్గుపడిపోతూవున్న ఈ అమాయకురాలు ఎట్లా నిర్వహిస్తుంది తన ఉద్యోగ బాధ్యతను?

పార్వతి యజమానివైపు తిరిగి "నమస్కారం!" అంది ఎంతో నమ్రతతో. యజమానికి యాభై ఏళ్ళపైనే వుంటాయి. తళతళలాడే ఎర్రని శరీరం, విశాలమైన నుదురు, అగాధాల్లాంటి కళ్ళు. తెల్లగా నెరసిన క్రాఫుతోటి, ఆయన గంభీరంగా వున్నాడు.

యజమాని, టేబిల్‌కి ఎడంవైపున్న కుర్చీ చూపించి, "అలా కూర్చోండి! ఏవీ మీ సర్టిఫికేట్లు?" అని ప్రశ్నించాడు. పార్వతి తన చేతిలోవున్న మాసిపోయిన కాయితాల్ని ఆయన టేబిల్ మీద ఉంచి, కూర్చోకుండానే నిలబడింది. ఆమెకంతా ఏదో ఊపిరాడనట్టుగా వున్నదక్కడ. చాలా అయోమయంగా వుంది. ఇందరు కొత్తవాళ్లల్లో, అందులోనూ మగవాళ్ళల్లో మెలగాలి... ఈ ఎడారిలో ఒయాసిస్‌లాగా ఆ అమ్మాయి ఒకత్తె వుండడం తనకు కొంత తెరిపి... ఆమెకూడా ఏమిటో తనను పురుగును చూసినట్టు చూసిం

దేమిటి? కొ_త్త గనక నేమో, ఒకరినొకరు అర్థం చేసుకుంటే నాల్గు రోజులకి అన్నీ సర్దుకుపోవచ్చు.

ఆమె సర్టిఫికెట్లు చూశాక మంత్రమూర్తి హుందాగా "ఏమండి! మీ విషయమంతా కాళిదాసుగారు ఇదివరకే చెప్పారు. ఎల్లుండి ఫస్టు తారీఖున వొచ్చి మీరు ఛార్జి పుచ్చుకోండి. జీతం ఏభై. కరువుభత్యం పదిహేను. మీకు వీలైతే రేపే వొచ్చి వర్కు అవీ హెడ్ క్లార్కు నడిగి తెలుసుకోడం మంచిది. మిగతావన్నీ హెడ్ క్లార్కే చెబుతాడు," అన్నాడు.

పార్వతి "అలాగేనండి" అని పోదామా, వొద్దా అని సంశయిస్తూ నిలబడిపోయింది.

ఇంతలో ఆపద్బాంధవుడల్లే కాళిదాసు "ఇక నువ్వు వెళ్లొచ్చమ్మా! రేపు వొచ్చి వివరాలు తెలుసుకో," అన్నాడు.

పార్వతి అందరికీ నమస్కారం చెప్పి, చకచక బైటికొచ్చింది. ఈ తడవ ఆమె కొంచెం నిదానంగా నడుస్తూ హాలునూ, అక్కడ పనిచేసే గుమాస్తాలనూ ఒకటి రెండుసార్లు తాపీగానూ, పరిశీలనగానూ చూసుకుంటూ వచ్చింది. ఆమె బైటకి రావటం చూసిన ఇందాకటి అమ్మాయి "కంగ్రాచులేషన్స్ మేడం! మీరు డ్యూటీలో కెప్పుడు వొస్తారు? క్షమించండి, మీ పేరేమిటి?" అని అడిగింది.

పార్వతి ఆమె పక్కనే నిలబడి "నా పేరు పార్వతి, మరి మీ పేరు మేడం!" అని అడిగింది నవ్వుతూ.

"నా పేరు లీలారమేశ్," అంది ఆ అమ్మాయి కళ్లతో పార్వతిని వెక్కిరిస్తూ. పార్వతి కొంచెం చిన్నబుచ్చుకున్నప్పటికీ, "వెళ్లొస్తానమ్మా. మళ్ళీ రేపు కలుసుకుందాం," అని వెళ్లబోతూంటే, ఇందాకటి హెడ్ క్లార్కు "ఇటు రా అమ్మా!" అని పిల్చాడు ఆమెని.

పార్వతి కొంత బెరుకుగానే ఆయనదగ్గిరకి వెళ్లింది. ఆయన ఆమెని ఎంతో వాత్సల్యంతో చూస్తూ, తనపక్కనే కొంచెం ఎడంగా వున్న బల్లను చూపించి "ఇలా కూర్చో. నిన్ను పనిలోకి గమ్మన్నారా ప్రొప్రయిటరుగారు?" అని అడిగాడు ఆప్యాయంతో. మిగతా గుమాస్తాల హేళన చూపులకీ, ఈయనకీ ఎంత తేడా!

"అవునండి. ఫస్టున జాయిన్ కమ్మన్నారు. ఏమండీ! మీరేనా హెడ్ క్లార్కుగారు?" అని అడిగిందామె బెదురుచూపులతో.

"నేనేనమ్మా. రేపు ఒకసారి వొస్తే నీకు ఈ పనిగురించి వివరంగా చెబుతాను. రా. భయపడకు. రెండురోజులు కొత్తగా వుంటుంది గాని, మరేమీలేదు.. నీ సంగతి కాళిదాసుగారు ఇందాక నాతోటీ అన్నాడులే. నువ్వేం దిగులుపడకమ్మా. నీకేం తెలియక పోయినా నేనున్నానుగా, నన్నడుగు చెబుతాను," అన్నాడాయన. పార్వతి చాలా కృతజ్ఞతతో ఆయనకి నమస్కారం చేసింది. ఆమె కళ్ళు మబ్బులువీడిన ఆకాశంలా మెరిశాయి. ఆమె చిరునవ్వొకటి విసిరి, "వెళ్ళొస్తానండి, శలవు," అంటూ లేచింది.

"సరే!" అన్నాడు హెడ్ క్లార్కు. ఆయన వయోధిక రూపం, గొంతులోని ఆప్యాయత, చల్లని అనునయించే చిరునవ్వు పార్వతికెంతో శాంతినిచ్చాయి. ఆమె ఇందాకటికంటే ఎంతో ధైర్యంగా మేడదిగి ఇంటిదారి పట్టింది.

## 12

గాంధీనగరంనుంచి సత్యనారాయణపురం వెళ్ళే రోడ్డు మూలకు కొంచెం దూరంలో 'కోటిలింగం & బ్రదర్స్, టైలర్స్' అనే బోర్డు ఒక కటకటాల పెద్దగదిముందు వేళ్లాడుతోంది. గోడకి వున్న కోట్ స్టాండ్ కి రకరకాల గుడ్డలూ, రవికలూ వేళ్లాడుతున్నాయి. కోటిలింగం తమ్ముడు రామలింగం కుట్టుమెషిన్ దగ్గిర కూర్చుని తల అటూ ఇటూ తిప్పకుండా దీక్షతో గుడ్డలు కుట్టడంలో నిమగ్నుడై వున్నాడు.

కోటిలింగం కిందకూర్చుని ఏదో పాప్లిన్ చారలగుడ్డ చొక్కాకు కత్తిరిస్తున్నాడు. కోటిలింగానికి షుమారు ముప్ఫైఐదేళ్ళుంటాయి. అతని తమ్ముడికి ఇరవైనాలుగేళ్లుంటాయి. ఇద్దరూ ఒకటే అచ్చు. బాగా అణిగిమణిగిన క్రాపూ, నల్లగా నిగనిగలాడే శరీరచ్ఛాయా, సన్నటివొళ్ళూ. కోటిలింగం అప్పుడే రెండోసారి కాఫీతాగి వచ్చాడు, ఎదురుగావున్న హోటల్లో. అప్పటికి 9

గంటలవుతోంది. ఎండ తూర్పువైపునించి ఏటవాలుగా గోడమీద పచ్చగా ప్రతిఫలిస్తుంది. రోడ్డుమీద సందడి, కార్లు పోతున్నప్పుడు లేచే దుమ్ము, సైకిల్ రిక్షా గంటల గణగణ అన్నీ దర్జీ కోటి లింగం దృష్టిని చెదరగొడ్తున్నాయి.

ఇంకా కోటిలింగం కొట్లో సమావేశమయ్యే మిత్రులు ఎవరూ రాలేదు. వాళ్ళల్లో ముఖ్యుడు దుర్గా ఆటోమొబైల్సులో పనిచేసే సుబ్బారావు. అతను ఆఫీసువేళకి గంటముందువొచ్చి కోటిలింగం దగ్గిర కూర్చుంటాడు. అతనింకా బ్రహ్మచారి. అందంగా, బలంగా వుంటాడు. తగినంత ఎత్తూ, లావూ వుండి, ఎర్రగా ఆకర్షణీయంగా వుంటాడు. అతని ఇల్లు దర్జీషాపుకి దగ్గిరే వుండడంవల్లనూ, ఇట్లో ఏమీతోచదు గనుకనూ ఇక్కడికి చేరుతాడు వీలు దొరికినప్పుడల్లా.

కోటిలింగం బూట్లచప్పుడువిని తల పైకెత్తిచూసి, "సుబ్బా రావా? గావోయ్, రా! ఏదీ నిన్నసాయంత్రం వస్తానని కనపడ లేదేం?" అని ప్రశ్నించాడు. సుబ్బారావు బూట్లువిప్పి తలుపుమూల పడేసి, చేతిలో సిగరెట్ పీక ఆఖరుగుక్క అసక్తిగా పీల్చి, బైటపారేసి లోపలికివస్తూ. "ఏదోయ్ తీరనేలేదు. ఇంకా కొత్త సైనోగ్రాఫర్ చార్జి పుచ్చుకోలేదుగా! ఆ పనంతా నామీదపడింది. ఇప్పుడున్న ఆమె—పనిచేసే కంగాడు... చెప్పాగా?" అన్నాడు నవ్వుతూ.

కోటిలింగం "కూర్చోవోయ్, మరి 'ఎస్-క్రాస్‌వర్డ్స్' 23 కి రేపే క్లోజింగ్ డేట్. జ్ఞాపకంవుందా," అని అడిగాడు.

సుబ్బారావు జేబునుంచి ఎస్-క్రాస్‌వర్డ్స్ కూపన్ ఒకటితీసి "ఇందులో పన్నెండో క్లూ దగ్గిరే కాస్త తికమక పడ్తున్నానోయ్. సాయంత్రానికి పూర్తిచేసేస్తాను. మరి, మన సభ్యులందరూ చందా ఇచ్చేసారా?" అని అడిగాడు కోటిలింగానికి ఎదురుగా కట కటాలకి ఆనుకొని కూర్చుంటూ.

కోటిలింగం కాలర్ కత్తిరిస్తూ "అందరూ ఇచ్చారుగాని, శివ రామయ్య మాత్రం ఇగో, అగో అంటున్నాడు. వాడి భాగం గూడా మనమే వేసుకొని కట్టేద్దాం. వాడిముఖం వాడివల్ల ఏమా తుంది? ఎక్కడ్నించి తెస్తాడు?" అన్నాడు కత్తిరించడం పూర్తి చేసి జేబులోంచి సిగరెట్ తీస్తూ.

"అన్నట్టు శివరామయ్యకింకా వుద్యోగం దొరకలేదు గదూ? ఇదేం అన్యాయమోయ్ కోటీ? మగవాళ్లకే ఉద్యోగాలు లేక అల్లాడి చస్తూంటే ఈ ఆడవాళ్ల పోటీ? మా ఆఫీసే చూడరాదు! లైఫిష్టుపని ఆడదానికే రిజర్వు! అదొక మోజనుకుంటూ మా ప్రొప్రయిటర్ కి?" అన్నాడు సుబ్బారావు.

కోటిలింగం "ఏమో పోనిద్దు. మనకెందుకు అవన్నీనూ? ఈ తడవ క్రాస్ వర్డ్సులో ఫస్టుప్రైజ్ వస్తే మనమంతా కలిసి చక్కని పిక్చరు తియ్యాలోయ్ సుబ్బారావు! ఏమంటావు?" అన్నాడు కోటిలింగం పనిమానేసి, ఊహల్లోపడి.

"నేను అలాంటి పనేమీ చెయ్యనోయ్. హాయిగా ఒక కారు కొనుక్కుని దేశ దేశాలు తిరుగుతాను," అన్నాడు సుబ్బారావు, ఆటోమొబైల్సు కంపెనీలోకొచ్చిన కొత్తరకం చిన్న కారును స్మృతికి తెచ్చుకుంటూ.

"నువ్వొక్కడివేనా? నీతో ఒక చక్కని గరల్ వుండక్కర్లేదు?" అని ప్రశ్నించాడు టైయిలర్ హేళనగా.

"గరల్ లేకుండానా? తప్పకండా గరల్ వుండాల్సిందే. అందులోనూ మన"కల్చర్" లోవుండాలి అమ్మాయి. మా ఆఫీసులో ఇప్పుడు పనిచేస్తూందే లీల, దాన్నిచూస్తే నాకు అరికాలిమంట నెత్తికెక్కుతుంది. తానేదో నిన్ననే ఇంగ్లండునించి వొచ్చినట్టు ఆమె భావన," అన్నాడు సుబ్బారావు.

ఇంతలోనే ఇంకో ఇద్దరు వొచ్చారు లోపలకి. ఇద్దరూ పాతికేళ్ల వాళ్ళే. ఒకతను నిక్కరూ, పొడుగుచేతుల చొక్కా తొడుక్కున్నాడు. క్రాపు చెదిరివుంది. ఏదో విషాదపుపాటను గొణుక్కుంటూ వొచ్చాడు. అతనితోటి వచ్చినతను తెల్లని మల్లుధోవతి మడతపెట్టి గూడకట్టుకట్టాడు, సిల్కు చొక్కావేశాడు, క్రాపు ఎగదువ్వాడు. వాళ్లిద్దరూవొచ్చి కోటిలింగానికి ఎదురుగానే కూర్చున్నారు.

కోటిలింగం నిక్కరు వేసుకున్న చామనఛాయ యువకుని ఉద్దేశించి "ఏం గురువులూ! ఏమిటి విశేషాలు?" అని ప్రశ్నించాడు మామూలుగా.

గురుమూర్తి "ఇక్కడంతా మనవాళ్ళేగా!" అని జేబులోంచి ఓ ముక్కపుడక తీసి కోటిలింగానికిచ్చి, "ఇది కాస్త అమ్మి పెట్టవోయ్. పాదరు ఖర్చుకి చస్తున్నాం. ఇటు క్రాస్‌వర్డ్సుకి కడదా మన్నా డబ్బులుండటంలేదు," అన్నాడు మెల్లగా.

సిల్కుచొక్కా అతను "ఎవరిదిరా ముక్కుపుడక?" అని ప్రశ్నించాడు ఆశ్చర్యంతో.

"నాదే!" అన్నాడు గురుమూర్తి.

"నీదంటే!"

"మా వాళ్ళది," అన్నాడతను నిక్కచ్చిగా.

కోటిలింగం ముక్కుపుడకను చేతికి తీసుకుని పరిశీలించి, "నీకూ డబ్బులకు కరువేనా? మీ ఆవిడ కుట్టుమిషన్ పని మానేసిందా ఏమిటి?" అని అడిగాడు.

గురుమూర్తి "సరిగ్గా పనులు లేవు." అంటూ ఆగిపోయాడు. ఒక నిమిషం ఆగి "కాస్త అమ్మి పెట్టండిరా అంటే యేమిటోయ్ ఈ ప్రశ్నలు?" అన్నాడు కొంచెం కోపంతో.

"మాదేం పోయింనోయ్, మధ్యాహ్నం అమ్మి పెడతాలే," అన్నాడు కోటిలింగం. తర్వాత సిల్కుచొక్కా వ్యక్తి అతనివంక తిరిగి "ఏమోయ్ శివరామయ్యా! నీ చందా ఇంకా రానేలేదు... రేపే క్లోజింగ్ డేట్?" అని అడిగాడు.

"ఇక నేను క్రాసువర్డ్సుకి డబ్బులు కట్టదల్చుకోలేదురా. ఆ డబ్బులు పెట్టి కాఫీ తాగినా పుణ్యం పురుషార్థం," అన్నాడు శివరామయ్య.

మిగతావాళ్ళు అతని మాటలకి హేళనగా నవ్వారు. "అసలు నీ దగ్గిర డబ్బులున్నట్టు మహా! అన్నీ వేషాలు!" అన్నాడు సుబ్బారావు.

"నీకు ఆఫీసువేళ కావటంలేదురా సుబ్బారావు?" అన్నాడు కోటిలింగం, ఉన్నట్టుండి.

"అవున్రా. ఇళ్తాను. సాయంత్రం డబ్బులూ, ఈ కూపనూ ఆ కలెక్టర్ గాడికిచ్చేస్తాను వొస్తూ వొస్తూ. ఎంత కరెక్టయిందో ఇట్లా పడెయ్యి," అని అడిగాడు సుబ్బారావు.

కోటిలింగం "సాయంత్రానికిగాని పూర్తిగాడు. ఐదు రూపాయలకి ఇంకా ముప్పావులా తక్కువ. నీ దగ్గిరవుంటే వేసి కట్టెయ్యరాదు?" అంటూ నాలుగుంబావలా తీసి ఇచ్చాడు.

సుబ్బారావు వాటిని జేబులో వేసుకుంటూ లేచినవాడు అకస్మాత్తుగా వీధివైపు చూసి, "అదిగోనోయ్ కోటిలింగం! మా కంపెనీలో కొత్తగా చేరిన గర్ల్," అన్నాడు, అటు నిదానంగా తలొంచుకుని నడుస్తున్న పార్వతిని చూపిస్తూ.

"ఎర్రగా దొండపండల్లేవుందే పిట్ట!" అన్నాడు కోటిలింగం.

"చాలా ఫెమిలియర్ గా, సింపిల్ గా వుంది!" అన్నాడు శివరామయ్య ఆమె పోతున్న వైపే చూస్తూ.

సుబ్బారావు "లేచి నిలబడి మన కెదురుగా కూర్చుని పని చేస్తుందిలే. సరుకు ఎలాంటిదో ఒక్క రోజులో తేలిపోతుంది," అంటూ కన్నుగీటాడు.

శివరామయ్య "ఎందుకురా నోరు పారేసుకుంటారు? ఒక్కొక్కప్పుడు నిప్పుకూడా అందంగా కనబడుతుంది," అన్నాడు.

"అవి మాకు తెలుసులేవోయ్," అంటూ సుబ్బారావు కొట్టుదిగి, పార్వతిని అనుసరించాడు.

అతను వెళ్ళాక శివరామయ్య "పెద్ద ఆంబోతల్లే బాగామేసి, కనపడ్డ ఆడదాన్నల్లా వెంటబడ్డం! వెధవ. అదీ మొగతనమే అనుకుంటాడు వాడి మనసుకు!" అన్నాడు కఠినంగా.

"అంటర్నీ అంటావుగాని, నువ్వూ ఛాన్సువొస్తే వొదలవు ఏమో మహామాట్లాడ్తావ్!" అన్నాడు కోటిలింగం.

"నేనలాంటి వెధవను కాను," అన్నాడు శివరామయ్య.

"నువ్వు రామచంద్ర ప్రభువువి-ఏకపత్నీ వ్రతుడివి! పోనీ వెధవ సమస్య," అని సర్దేశాడు కోటిలింగమే, ఎవరో ఒక ముసలామె రవిక గుడ్డలు తీసుకొచ్చేసరికి.

# 13

క్రితంరోజు హెడ్ గుమాస్తా కైలాసం తనకు అక్కడి పని గురించి వివరించినప్పుడు పార్వతి కొంచెం గాభరాపడింది మొదట్లో. ఆయన ఒక ఇంగ్లీషు ఉత్తరం ఆమెకిచ్చి టైప్ చెయ్యమన్నాడు. పార్వతి జంకుతూ, టైప్ రైటర్ దగ్గిరకూచుని జాగ్రతగానే టైప్ చేసింది. కైలాసం దాన్నిచూసి "బాగుంది," అని సంతోషంగా తల ఊపాడు. ఆమెతర్వాత కొన్ని లెడ్జర్లు అవీ చూసింది. వాటిల్లో లెక్కలు ఎలా రాయాల్సిందీ కైలాసం చూపించాడు. చివరికి "అమ్మా, ఏదైనా అలవాటే. నాల్గురోజులు చూశావా, నాకన్న బాగా రాయగలవు!" అని ప్రోత్సహించాడు.

పార్వతి కొంచం బిడియంతో, ఆయనతో మాట్లాడింది. "రాస్తానండి..." అన్నది. తర్వాత ఇందాకణ్ణించీ తననే ఓరగంటితో చూస్తూన్న ఇతర గుమాస్తాలనీ, లీలనీ గమనించింది. లీల ఎందుకో హాండ్ కర్చీఫ్ నోటికి అడ్డం పెట్టుకుని నవ్వుకుంటోంది మాటిమాటికి.

పురుషులు తనను హేళనచేస్తే తను అర్థం చేసుకోగలదు. కాని, ఈ సోదరి ఎందుకిలా విరగబడిపోతూంది? తను నిరాడంబరంగా వుండడం చూశా? పార్వతి లీలని ఒకసారి చూసింది. ఎందుకంత ఎర్రరంగు పులిమింది పెదాలకు? కిటికీనుండి పడుతున్న ఎండ పొడలో అసలే చామనఛాయగా వున్న ఆ అమ్మాయి మొహం, పౌడరు అక్కడక్కడ సరిగ్గా అతక్కనో, రాలిపోయో చాలా పేలవంగా కన్పిస్తోంది. పైగా రెండు జడలువేసి, రెండువైపులా తమాషాగా చుట్టు చుట్టింది. ఉన్నట్లుండి చూస్తే ఆమె గుండ్రని మొహం, తేనెరంగు కళ్లు, గండుపిల్లిని గుర్తుకు తెస్తాయి. నొసట బొట్టులేదు.

పార్వతికూడా ఆమెవంక చూసి స్నేహపురస్సరంగా ఓ చిరునవ్వు నవ్వింది. ఆ తర్వాత ఆమె ఇందాకణ్ణించి తననే పరిశీలనగా చూస్తూన్న సుబ్బారావు వంక ఒక త్రుటికాలం చూసింది. సిగ్గేసి మళ్ళీ మొహం తన టేబిల్ మీద వున్న లెడ్జర్ వైపు తిప్పుకున్నది.

ఆ మేడ దక్షిణంవైపు తిరిగి వుండడంతో ఉదయాస్తమయాల సూర్యకాంతి ఆ హాల్లోకి విశాలమైన అద్దాల కిటికీలగుండా ధారాళంగా లోపలికి పడుతోంది. చల్లని ఆరోగ్యకరమైన గాలికి

అక్కడ లోటులేదు. తన ఇల్లులాగా కాదు...నవ్వుకున్నది పార్వతి. ఏదో కటిక చీకటినించి కొత్తగా వెలుగులో కొచ్చినట్టున్నదామెకి.

ఆమె ఆవేళ మరొకగంట కూర్చుని అక్కడ పనిగురించి సమగ్రంగా కాకపోయినా, చాలావరకు అర్థం చేసుకుని మధ్యాహ్నం రెండింటిగంటకు ఇంటికి వొచ్చింది. వంటపనికి తప్ప ఇంకెందుకూ పనికి రామని అనుకున్న తను, ఆఫీసులోకూడా పనిచేయగలనన్న విషయం ఎంతో సంతోషాన్ని కలిగించిందామెకు.

ఆమె ఇంటిముఖం పట్టగానే భర్తసంగతి జ్ఞాపకం వొచ్చి ఉలిక్కిపడింది. ఇవ్వాళ యుద్ధం తప్పదు. పన్నెండులోపే వొచ్చి అన్నం పెడతానని చెప్పి బయల్దేరింది తను. కాని, అనివార్యంగా ఆలస్యం అయింది. ఆయనకి ఆకలిగా వుండదూ? అసలే బక్కమనిషి, దేన్నీ వోర్చలేడు.

ఆమె చాలా తొందర తొందరగా నడిచి ఇల్లుచేరుకుంది.

సాంబశివరావు ఆకలితోటి నకనకలాడుతూ మంచంమీద పడుకోలేక, అటూఇటూ పొర్లుతూ మాటిమాటికీ ఆమెకోసం గోడ్డువైపు చూస్తున్నవాడల్లా "ఇల్లు గుర్తుకొచ్చిందటే భిడవా? ఇందుకే గదూ, నీకెందుకీ ఉద్యోగం అన్నాను? దరిద్రపు ముండ!" అని లేచాడు క్రోధంగా. కప్పునుంచి పడుతున్న వెల్తురు చారల్లో అతని కాంతిహీనమైన కళ్ళు కోపంతోటి, ఆకలితోటి మండిపోతున్నాయి ముదురుపచ్చగా.

"అక్కడ—ఆలశ్యం..." అంటూ ఇంకేదో అనబోతున్న పార్వతిని "ఇప్పటికైనాపోయి అన్నంపెట్టవే పింజారీముండా!" అన్నాడు మంచంమీద కూర్చుని. లేవగల్గితే అప్పుడున్న ఉద్రేకంలో ఆమెని చంపేసేట్టున్నాడతను.

పార్వతి చప్పున లోపలికివెళ్లి కంచంలో అన్నం పెట్టుకొచ్చి భర్తచేతికిచ్చింది. అతను ఇంకా భార్యని ఉరిమి చూస్తూనే అన్నం తినసాగాడు. రెండుముద్దలు మింగాక, "ఉప్పేశావుటే ఈ పులుసులో? ఉద్యోగం కాకముందే వంట ఇలా తగలేస్తున్నావేమే? ఇతలోనే ఇంత గర్వమా! ఛీ-ఛీ!" అని ఎదురుగా కూర్చునివున్న ఆమెముఖానికి ఓ ముద్ద విసిరికొట్టాడు. ఆమెకూడా అంతే ఆకలితోటే వుంటుందని

గానీ, మైలున్నర నడిచి వొచ్చిందనే ఆలోచనగానీ అతనికి లేనే లేదు. పార్వతికి ముఖం అంతా పులుసన్నం అలుముకోడంతోటి కళ్లు మంటలు పుట్టి, పైకి ఏడవలేక, లేచి లోపలికెళ్లి, మొహం కడు క్కొచ్చి తిరిగి భర్తకి మజ్జిగన్నం పెట్టి ఎదుట నిలబడింది. ఆమె కళ్ళు ఇంకా నీళ్లునిండే వున్నాయి. కనుకొలుకులు ఉప్పు కారం తగలటంతో ఎర్రబారిపోయాయి. ఏమీ అనలేదా అమాయకురాలు. పైకి ఏడిస్తే ఇంకా చివాట్లు...ఏం మాట్లాడినా చివాట్లే...ఆమె అలాగే లోలోపల కుమిలిపోతూనే భర్త భోంచేసిందాకా నిలబడి అతనికి చెయ్యికడిగి, లోపలికివెళ్లి భోజనానికి కూర్చుంది. కాని, అన్నం సయించడంలేదు...తనను ఏ పరిస్థితిలోనూ ఓదార్చేవారు లేరు...కాని, ఆకలిని నిగ్రహించడానికి రెండు ముద్దలు అయిష్టంగా తిని లేచింది. తర్వాత మెల్లగా చెంగుతో కన్నీళ్లు తుడుచుకుంటూ బైటికి వచ్చింది.

ఆమె మనస్సు మరీ వేదనగా వుండడంతో, తన ట్రంకుతీసి చూసింది. తన పెళ్లినాటి పట్టుచీర మడతలో ప్రాణప్రదంగా దాచు కున్న పాత ఫోటోను తీసుకొని వంటింట్లో కొచ్చి కూర్చుంది. అది తన మేనమామగారింటిలో తను చిన్నప్పణ్ణించీ రోజూ చూసి సంతోషించి, బాధలప్పుడు దగ్గిరపెట్టుకుని మొరపెట్టుకున్న ఫోటో. పెళ్ళయి కాపరానికొచ్చేప్పుడు కూడా తెచ్చుకున్నది...అది తన తల్లిదండ్రుల ఫోటో; తనెన్నడూ చూసి ఎరగని తన తల్లిదీ, తండ్రీదీనూ. "అమ్మా!...అమ్మా!" అని ఆమె ఆ ఫోటోను చూస్తూ విల విల లాడింది. "నాన్నా! నువ్వుంటే ఇలా అయ్యేదా నా బతుకు! చూడమ్మా...ఎందుకమ్మా నా కిన్ని బాధలు! నువ్వానా్న నేను అమ్మా!" అని ఆమె వాపోయింది.

ఆ ఫోటో పచ్చగా పాతబడిపోయింది. దానికి ఫ్రేంకట్టించా లన్న ఆమె కోరిక నేటివరకూ నెరవేరనేలేదు. అందులోవున్న ఆమె తల్లి, మూడు మూర్తులా కూతురు పోలికే. తండ్రిలాగా పార్వతి పొడవరీ, సూక్ష్మగ్రాహీ—అని ఆమె మేనమామ అంటూ వుండే వాడు.

ఫోటోలో నిల్చిపోయిన ఆమె తల్లిదండ్రుల నీడలు ఆమె వైపు నిశ్చలంగా, ప్రేమగా చూస్తున్నాయి. ఆ ఫోటో వాళ్ళిద్దరూ పెళ్ళప్పుడు తీసుకున్నది. 'భయపడకమ్మా!' అన్నట్టు చూస్తోంది తల్లి. తండ్రి "ధైర్యంగా వుండవమ్మా!" అంటున్నట్టు చూస్తున్నాడు.

ఆమె అలాగే మూడు గంటలకు కాఫీ పెట్టడానికి లేచే వరకూ ఫోటో దగ్గిర పెట్టుకుని వాపోతూనే వున్నది.

## 14

"స్త్రీకి నిజమైన జీవితం భర్తతోటే ప్రారంభమౌతుంది," అని ఏదో పుస్తకంలో చదువుతోంది వేదవతి. మంచి కాంతిగల బల్బు వెలుగుతోంది పడక కుర్చీ పక్క టేబిల్ మీద అమర్చిన షేడ్ లాంప్‌లో. వేదవతికి పుస్తకాల పిచ్చి. అందులోనూ తెలుగు నవలలంటేనూ, పత్రికలంటేనూ ఆమెకు చాలా ప్రీతి. ఎంత డబ్బు అయినా సరే ఇచ్చి ప్రతినెలా కొనుక్కొస్తూ వుంటుంది. కాళిదాసు వేదవతి విషయంలో సాధారణంగా పట్టించుకోడు. ఆమె మహిళా సభలో సభ్యురాలు. ఏవేవో కార్యక్రమాలకు హాజరవుతూ వుంటుంది.

కాళిదాసు ఆమెని ప్రోత్సహిస్తుండేవాడుకూడానూ. భార్యాభర్తల మధ్య ఎలాంటి విభేదమూ లేకపోయినా, వేదవతి దొంగ కోపం నటిస్తూ "ఏమండీ, స్లీడరీ చదివి నేనూ కోపడం ఏమిటండీ, బోర్డుకెక్కాను," అనేది వివాదానికి పిలుస్తున్నట్టు.

కాళిదాసు పెద్దగా నవ్వి "నువ్వూ బోర్డుకట్టి కోర్టుకి హాజరైతే ఇంకో అభాగ్య ప్లీడరు నోట్లో కరక్కాయకొట్టి, ఆయన కన్న రెండు కేసులూ నువ్వు తెచ్చుకోవడం అన్నమాట. అది మహాపాపం! ఊరుకో సతీమణి!" అనేవాడు నిదానంగా. ఇవన్నీ తల్చుకుంటూ తనలోతనే చిరునవ్వు నవ్వుకుంటూ, అటు పుస్తకము చదువుతున్న వేదవతి దగ్గిరకి అప్పుడే ఇంటికి వొచ్చిన కాళిదాసు నిలబడి, "ఏమిటి వేదవతి! అంత నవ్వొచ్చే విషయం ఆ పుస్తకంలో ఏముందేమిటి?" అన్నాడు పక్కనేవున్న కుర్చీలో కూర్చుంటూ.

వేదవతి గబుక్కునలేచి నిలబడి, మళ్లీ కూర్చుని "అన్నీ పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలుగల పుస్తకమండీ ఇది. అందుకే నవ్వొస్తోంది," అన్నది.

"దేనిని గురించిన పుస్తకం అది? నేను చూడవచ్చా?" అని ప్రశ్నించాడు కాళిదాసు.

"నిజానికి చూడగూడదు. ఇది 'స్త్రీ జనాభ్యుదయం' అనే వ్యాసాల సంపుటి. ఎవరో సోదరుడే రాశాడు లెండి. పాపం ఒకదానికొకటి సంబంధంలేకుండా రాశాడు. కొన్నిచోట్ల శారీర కావసరాలు సవ్యంగా తీరనందున వ్యభిచారం ప్రబలి దంటాడు; కొన్నిచోట్ల ఆర్థిక కారణాలవల్లనంటాడు. ఏమిటో గందర గోళంగా వుంది పుస్తకం." అంది వేదవతి నవ్వుతూ.

కాళిదాసు, "స్త్రీల సమస్యల్ని స్త్రీలే ఆలోచించి పరిష్కరించుకోటం మంచిదంటాను నేను. వాళ్ల బలహీనతలూ, సమర్థాసమర్థతలూ వాళ్లకే ఎక్కువ తెలుస్తాయి అని నా ఊహ. వేదవతీ! ఇటువంటి పుస్తకాలవల్ల సమస్యలు మరింత 'బూద'గా తయారవుతయ్యేగాని ప్రయోజనం శూన్యం. పద భోజనానికి," అన్నాడాయన.

వేదవతిగూడా లేచింది. "ఇవ్వాళ సీతమ్మ రాలేదండి. ఆమె మనుమరాలికి చాలా జబ్బుచేసి పోయిందట," అంది ఆమె సానుభూతి కనపరుస్తూ.

"అరెరే! ఏం జబ్బుట? నీ కేమైనా తెలిసిందా?" అన్నాడు కాళిదాసు.

"ఏం జబ్బా? ఏ జబ్బేముంది? కనలేక చచ్చిపోయింది. దానివీ వాళ్లు జబ్బుకిందే లెక్కకట్టి మాట్లాడుతారు. ఆ అమ్మాయికి పద్నాలు గేళ్లు. అప్పుడే గర్భం. శక్తి వుండొద్దా!—అదీ కథ," అంది వేద వతి వంటింట్లో లైటువేసి.

"మన ఆచారాలకి అర్థాలు చాలావరకు లేవు అనుకుంటా. మనం ఇంకా బాల్య వివాహాలు మానలేకండా వున్నాం చూడు! వీటికేంగాని వేదవతి! ఇవ్వాళ నీ వంటేనా?" అని అడిగా డాయన చొక్కావిప్పి భోజనానికి కూర్చుంటూ.

"అవునండి. ఏమిటి అలా అడుగుతారు! నాకు వంట చేత గాదనా, మర్చిపోయాననా?" అది వేదవతి అప్పడాలు, పచ్చడి వడ్డిస్తూ.

"రెండూ కాదు. అలవాటు తప్పిందిగదా. పొగలో ఎలా బాధపడ్డావో అని!" అంటూ చమత్కారంగా తప్పుకున్నాడు కాళిదాసు.

"మీరు మరీను! నా కెప్పుడూ వంటచెయ్యడమంటే సరదాండి. ఏదో వంటామెని పెట్టామే అనిగాని, లేకపోతే హాయిగా వంటచేయనూ? అదీ ఒక ఆర్టు కదా! అందులోకూడా అందరికీ నూటికి నూరు మార్కులు వస్తాయా?" అంది ఆమె, భర్తకి నెయ్యి వడ్డిస్తూ.

"వంటచెయ్యడం ఆర్టే కాదనునుగాని, వడ్డించడం మాత్రం ఒక స్పెషల్ ఆర్టు అంటాను. కాస్త తినేవాణ్ణి ఇంకా కాస్త తినిపించే ఆప్యాయమైన ఉపచరణ చేసే కళ నీలాంటి కొందరికి పుట్టుకతోటే అబ్బుతుంది వేదవతి!" అన్నాడు కాళిదాసు ఉసిరికాయ పచ్చడన్నం ముద్దలుతింటూ.

"మీరు నన్ను ఊరకే పొగుడుతారుగాని, నా ఉద్దేశంలో అన్నం పెట్టడం అటూ వొచ్చాక తినేవాళ్ని ప్రేమగా చూసి కడుపునిండా తినిపించాలనే. అలా లేకుండా మొహం మటమట లాడిస్తూ పరమాన్నం పెట్టినా ఉపయోగంలేదు," అంది వేదవతి.

కాళిదాసు "మొన్న మాధవరావు ఇంటికెళ్ళాను. ఆయన కిద్దరు పిల్లలు. ఒకటే అల్లరి! పిల్లలున్న ఇంటిగొడవ అసలు వేరు!" అన్నాడు.

ఆయనకీ, వేదవతికీ ఓ కొరత చాలా కాలంబట్టి వుండనే వుంది.

ఇవ్వాళ వేదవతి ఆయన పిల్లలు మాట ఎత్తగానే నవ్వింది. కాళిదాసుగూడా ఎందుకో తెలియకండానే నవ్వాడు.

ఉభయులూ భోంచేసి హాల్లో కొచ్చినతర్వాత వేదవతి కాళిదాసు చెవిలో ఏదో అంది ముసిముసి నవ్వుతూ.

కాళిదాసు పట్టలేని ఆనందంతో, ఆమె రెండు చేతులూ పుచ్చుకుని "నిజంగానా వేదవతీ? రేపే ఒక డిన్నర్ పార్టీ అరెంజ్ చేస్తాను!" అన్నాడు కళ్ళు మెరుస్తూంటే, భార్యవంక ఆప్యాయంగా చూస్తూ.

"ఇప్పణ్ణించే ఎందుకండీ పబ్లిసిటీ? ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ నానదు అంటారుగాని, మీ మొగాళ్ళ నోళ్ళూ క్షణం మాత్రం బదవు," అంది దొంగ కోపంతో.

"అబ్బే! ఇలాంటివి దాగటానికి వీల్లేదోయ్. రేపు మన ఇంట్లో డిన్నర్ పార్టీ జరగవలసిందే. నువ్వేళ్ళి పడుకో. వెళ్ళు— ఇక్కణ్ణించి నీ ఆరోగ్యం చాలాజాగ్రత్తగా కాపాడుకోవాలి," అని ఆమె చెయ్యిపుచ్చుకుని లాక్కెళ్ళాడు కాళిదాసు.

"అమ్మాయి పుడితే చాలా బాగుంటుంది. అదీ మీ పోలిక అయితే మరీ అందంగా వుంటుంది..." అంది వేదవతి ఓర కంటితో భర్తవైపు చూసి.

"వీల్లేదు. అబ్బాయే పుట్టాలి. బంతల్లే, గోచీ లేకండా ఇల్లంతా గల్లంతుచేస్తూ ఆ వెధవ తిరుగుతూవుంటే నా కెంత ఇష్టమనుకున్నావు? ఆడపిల్లయితే ఏం సుఖం? ఆడపిల్లకి అన్నీ రిస్ట్రిక్షన్సే!" అన్నాడు కాళిదాసు.

## 15

కాళిదాసు ఏర్పాటుచేసిన విందుకు విజయవాడలోవున్న డబ్బున్న కుటుంబాలవారు ఓ పాతికదాకా వొచ్చారు. కాళిదాసు స్వయంగా అందర్నీ ఆహ్వానిస్తున్నాడు. కార్లూ, గుర్రబ్బండ్లూ వరసగా నిలబడివున్నాయి వాకిట్లో. రాత్రి విందు కావటంవల్ల సాయంత్రం చీకటిపడుతూన్న సమయానికి అందరూ ఒక్కొక్కరే రాసాగారు.

వేదవతి, కాళిదాసు ఇద్దరూ ప్రత్యేకంగా పిల్చి చెప్పటంవల్ల పార్వతి సాయంత్రం ఆఫీసునుండి ఇంటికి రాగానే చీర మార్చుకుని వేదవతి ఇంటికి వొచ్చేసింది. వేదవతి ఇంకో కొత్త వంటామెని తాత్కాలికంగా ఏర్పాటుచేసింది వంటకు. పార్వతి "నేను ఇక్కడ

ఈ పనిచూస్తూ వుంటూ లెండి—ఆమెకి కాస్త ఆసరాగా. వొక్కతే ఇంతపనీ ఎలా చేస్తుంది?" అని తానూ వంటింట్లో కూరలు తరగడం లోనూ, నీళ్లు తేవటంలోనూ సహాయం చెయ్యడం మొదలెట్టింది.

"ఏ దుర్భోజనాని కొచ్చికూడా నీకు చాకిరీ తప్పలేదటమ్మా? చాల్చాల్లే రా, రా!" అంది వేదవతి. పార్వతి నవ్వి "పనిచెయ్యట మంటే నాకు సరదా. వంటయినాక వొచ్చేస్తానండి అక్కయ్య గారు!" అంది.

వేదవతి "నువ్వు ఇంత మంచిగా వుండడంవల్లనే నీకిన్ని కష్టాలు!" అనుకుంటూ బయిటికి వెళ్లింది. బైట పెద్దహాలు నిండా నగలూ, ఖరీదైన చీరలూ ధరించిన స్త్రీలూ, ముచ్చటయిన పిల్లలూ తిరుగుతున్నారు. ఆడవాళ్లు ఏమిటో లోకాభిరామాయణం చెప్పుకుంటూ కూర్చున్నారు. ఇది సామాన్యమైన విందే గనకనూ, పూర్వాంగమైన తతంగాలేమీ లేవుగనకనూ భోజనాలే తరవాయిగా మిగిలిపోయినాయి. పెళ్లయిన ఏడేళ్ల తర్వాత ఆదంపతులకి సంతానం కలగనున్నదన్న వార్త వాళ్ళకెంత సందాయకంగా వుందో, కాళిదాసు మిత్రులకీ, స్నేహితులకీ అంతే సంతోషంగా వుంది.

ఈ సంతోషాన్ని ఎక్కువచెయ్యటానికే నన్నట్టుగా ఆఖరున మాధవరావు వొచ్చాడు. అతనొచ్చిన దగ్గిరనుండి ఒకటే గోల ప్రారంభమైంది. అతను మనిషి మనిషినీ పలకరించి నవ్వించాడు. "నీకు డబ్బుండడం ప్రమాదించిందోయ్, లేకపోతే ఇంత లావెక్కిపోతావా రెండేళ్లలో?" అన్నాడు ఒక స్నేహితుణ్ణి. అందరూ నవ్వారు. ఆ స్నేహితుడు "ఏడ్చావులేవోయ్!" అన్నాడు.

మాధవరావు ఇల్లంతా తిరుగుతూ వంటింటికి వొచ్చి పెత్తన మంతా నెత్తిన వేసుకున్నవాడల్లే వంటింట్లోకి తొంగిచూసి "ఏమిటమ్మా ఇంకా వంట కాలేదూ? మేమంతా ఈలోగా ఆకలితో ప్రాణాలు కడపట్టి ఎక్కడివాళ్లం అక్కడే సొలిపడి పోయేట్టున్నాం," అన్నాడు.

అతని వెనకనేవున్న కాళిదాసు, "ఏం ఫర్వాలేదు. గవర్నమెంటు హాస్పిటల్ పక్కనే," అంటూవంటింట్లోకి తొంగిచూసి

"కాదు పార్వతీ! నువ్వు నిదానంగానే వంటకానియ్యమ్మా. తొందరపడితే పరమాన్నం పులుసుగానూ, పులుసు పరమాన్నం గానూ మారగలదు!" అన్నాడు నవ్వుతూ.

పార్వతి కొబ్బరి తురుముకున్నదల్లా తలెత్తి "అవునండి!" అన్నది ముసిముసి నవ్వు నవ్వుతూ. ఆమెకు కాళిదాసంటే ఇటీవల గౌరవంతో పాటే చనువుకూడా ఏర్పడ్డది.

మాధవరావు ఎందుకోగాని పార్వతిని తదేకధ్యానంగా రెండు నిమిషాలు చూశాడు. తెల్లగా ప్రకాశిస్తున్న దీపం వెలుగులో ఆ ఇంట్లో పోగైవున్న వారెవ్వరిలాగా కాకుండా నిరాడంబరంగా వుండి, పుట్టిన పాళంగా ఏ ఆభరణాలూ లేకుండానే వొట్టి తన సహజ సౌందర్యంతోటి మెరిసిపోతూన్న ఆమె మాధవరావును ఆకర్షించింది.

మాధవరావు కాళిదాసువైపు తిరిగి "ఈమేనా, దుర్గావాళ్ళ కంపెనీలో పనికి చేరింది?" అని అడిగాడు మెల్లగా.

కాళిదాసు మౌనంగా "అవును," అన్నట్టు తల ఆడించాడు.

మాధవరావు "మీకు వంటకూడా వొచ్చా? చనువుకున్న వాళ్ల వంటంటే సరి నాకు ఎక్కడలేని భయం," అన్నాడు నవ్వుతూ పార్వతిని ఉద్దేశించి.

పార్వతికి మాధవరావుతో పరిచయంలేదు. కాని, అడిగిందానికి సమాధానం చెప్పాలి గనుక తలెత్తి "చిన్నప్పట్నించి నాకు వంట తెలుసండి. మీరేమీ భయపడక్కర్లేదు," అంది కొంటెగా.

కాళిదాసు "నీ పెళ్ళాంలాగా 'హోంసైన్సు' అను కున్నావుటోయ్ వంటతెలియక పోవడానికి?" అన్నాడు.

మాధవరావు "మా ఆవిడకేం? అది రోజుకోరకం వంట తయారుచేస్తుంది. అన్నీ కొత్త రకమే. అదంతా 'రిసెర్చి' అని నేను మనస్సు కుదటపర్చుకుంటూ వుంటాను," అన్నాడు.

పార్వతీ, కాళిదాసూ, వంటచేస్తూన్న ఇంకో ఆమెకూడా నవ్వారు. ఈ సమయంలోనే అక్కడికి వచ్చిన వేదవతి "దగ్గరవుండి పనిచేయిస్తున్నారా యేమిటి మీరు! ఇక వంట అయినట్టే. పదండి పదండి; సమయానికి సీతమ్మ కూడావొచ్చింది. విస్తళ్లు వేసి పని

చూడాలి. పదండి...వంటకూడా అయిపోవచ్చినట్టే! ఏం పార్వతీ!" అంది.

పార్వతి "అవునండి, విస్తళ్ళు వెయ్యవచ్చు," అంది. ఆమె ముఖంమీద ప్రతిబింబిస్తున్న పొయ్యిలోని మంటల ఎరుపుకాంతినీ, ఆమె నుదుటపట్టిన చిరుచమట ముత్యాల్నీ చూస్తున్న మాధవరావు "వెళ్తున్నామండి వదినగారూ, చూడండి వంటకళ వర్థిల్లాలి!" అంటూ నిష్క్రమించాడు.

"చొట్టి బోలం మనిషి," అంది వేదవతి పార్వతితో. ఇంత లోకే సీతమ్మ వొచ్చేసింది లోపలికి.

"పార్వతిగూడా వంటచేస్తున్నదా ఏమిటి?" అన్నదామె. పార్వతి "అవునండి వొదినగారు! మరే, మీమనవరాలు పోయిందిటగా పాపం!" అన్నది సానుభూతిగా.

సీతమ్మ "ఉండేం సుఖపడిందమ్మా? అత్తా, ఆడబిడ్డా దాని వూపిరి తీశారు. ఆ కథ చాలావుందమ్మా. తీరికగా వాగాల్లాడు కుందాంలే. నేనుపోయి విస్తళ్లు వేస్తా..." ఆవేదనతో అంటూ ఆమె విస్తళ్లకట్ట చేతపట్టుకుని లోపలికి వెళ్లింది.

వడ్డన ప్రారంభంకాగానే పార్వతి, వేదవతిని లోపలికిపిల్చి "మావారికి అన్నం తీసుకెళ్లి పెట్టివస్తానండి," అంది.

"వెంటనే వెళ్లిరా. ముందాపని ముఖ్యం," అంది వేదవతి, సాంబశివరావు గుణం ఎరుగున్నది గనక.

పార్వతి అన్నం, కూరలూ, పులుసు, పులిహోర, పరమాన్నం అన్నీ గిన్నెల్లో పెట్టుకుని ఇంటికి వెళ్లింది. తిరిగి అందరూ భోజనాలై లేవబోతూండగా వచ్చింది.

మాధవరావు కాళిదాసుని అభినందిస్తూ "నీకు పిల్లలు పుట్టరేమో, నీకు మా పెద్దబ్బాయిని పెంపకమిద్దామనుకున్నానోయ్. నా ఆశ నిరాశచేశావు," అన్నాడు.

"నయం. నిన్నే దత్తతచేసుకోమనలేదు. రెండేళ్లల్లో ఆస్తంతా గుండం చేసేసేవాడివి," అన్నాడు పక్కనేవున్న జూనియర్ ప్లీడరు రఘుపతిరావు.

ఆ సభా కోశం ఇలా సంతోషంగానూ, కోలాహలాల సందడి తోనూ ముగిసింది. అతిథులందరూ వెళ్లిపోయారు. పోతూ పోతూ మాధవరావు క్రీగంట పార్వతిని ఒక చూపుచూసి వెళ్లాడు. రఘుపతి రావు "మీరిక కోర్టుకి రావటం ఖాయం," అన్నాడు వేదవతితో.

"మరేం నష్టంలేదు," అన్నాడు కాళిదాసు.

## 16

పార్వతికి ఉద్యోగభారంతో పాటు, ఇంటిచాకిరీ, భర్త శుశ్రూషా కలిసి తలకు మించిన పనులైనాయి. ఉదయం ఐదు గంటలకే లేచి, ఇంటికి కావల్సిన నీళ్లన్నీ తోడుకోవాలి. ఏడుగంటల కల్లా పంపులో నీళ్లు రావటం మానేస్తాయి. అక్కణ్ణించి సాంబశివ రావుకు కాఫీఇచ్చి స్నానం చేయించి, వంటచేసి అతనికి పెట్టి, తాను తిని, ఉద్యోగానికి పదిగంటలకల్లా హాజరవాలి. ఈలోగా ఇంట్లో ఏ సామానైపోయినా వెళ్లి బజారులో తెచ్చుకోవాలి. డబ్బులు లేకపోతే మళ్లీ వాటికోసం దేవుళ్లాడాలి.

ఆమెకి ఇవిగాక ఇంకా అనేకమైనపనులు తగిలేవి. గుడ్డలు ఉతకాలి. ఉన్న రెండు గుడ్డలూ చాకలాడికేస్తే ఎట్లా ? ఇవన్నిట్నీ ఆమె సంతోషంగా చేస్తూవుండేది. ఇంకా అంత పనిమీదపడ్డా భరించేదే. మధ్య మధ్య సాంబశివరావు ఏవేవో అంటూ వుండేవాడు. ఆమెని ఎందుకోగాని చీదపురుగును విదలించినట్లు విదిలించేవాడు.

ఆమె ఉద్యోగంలో చేరిన వారంరోజులపాటు, ఈ మామూలు కార్యక్రమానికేమీ భిన్నంలేకుండా వెళ్లిపోయింది. డిసెంబర్ 9వ తారీఖున, మధ్యాహ్నంపూట ఆమె విశ్రాంతి సమయంలో, గుమాస్తా లందరూ కింద కాఫీలకని వెళినప్పుడు, మెల్లగా ప్రొప్రయిటర్ గదిలోకి వెళ్లింది భయపడుతూనే. ఆమె అనేకసార్లు తనలో తాను 'రిహార్సల్స్' వేసుకున్న మాటల్ని పైకి అనటానికి విశ్వప్రయత్నం చేస్తూ ఆయన ఎదుట దూరంగా నిలబడింది.

మంత్రమూర్తి విశ్రాంతిగా కూర్చుని కిటికీనుండి దూరంగా కన్పించే దృశ్యాల్ని చూస్తున్నవాడల్లా "ఏమిటమ్మా ? ఏం పని," అని అడిగాడు అధికారయుత స్వరంతో.

పార్వతి తికమకలుపడ్తూ, "నా జీతంలో కొంత అడ్వా న్సుగా ఇప్పిస్తారా దయచేసి, చాలా ఇబ్బందిగా వుందండి," అన్నది చాలా ప్రయత్నంమీద.

"అలాగునా? చూద్దాం. రేపు తీసుకెళ్దువుగాని," అన్నాడు మంత్రమూర్తి.

పార్వతి "వెళ్తొస్తానండి," అనేసి తిరిగి తన స్థానంలోకొచ్చి కూర్చుంది.

ఆమె అనుకోనివిధంగా, ఇదివరకటి స్టెనోగ్రాఫర్ లీలా రమేశ్ పార్వతికి చార్జి అప్పజెప్పి, తాను ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసి వెళ్లిపోయింది ఫస్టు తారీఖునే.

పార్వతికి ఆ రోజున ఎక్కడలేని భయమూ వేసింది. తోడు అన్నది లేకుండా ఆ ఆఫీసులో అంతమంది మగవాళ్లలో పని చెయ్యటం ఎలాగని ఆమె దిగులుపడింది. కాని, లీల పోతూపోతూ వెక్కిరిస్తున్నట్టుగా అన్న మాటలు ఆమెకి రోషాన్ని రెచ్చ గొట్టాయి. "మీరెలా నిర్వహిస్తారో, ఈ పనిని! నా బోటి దానికే తలకుమించిన పని ఇది. ఈ పని ఒక ఎత్తూ-ఈ గుమస్తాలూ, అప్పుడప్పుడొచ్చే పెద్దమనుషులూ అనే మాటలూ, చూసే చూపులూ తట్టుకుని; మనమూ వ్యక్తిత్వం గలవాళ్లమే అని ధీమాగా నిలబడడం ఒక ఎత్తూ," అన్నది లీల. "నా బోటి దానికి," అన్న మాట నొక్కి పలకడంలో ఆమె తననేదో కించపరిచినట్లనిపించింది పార్వతికి. పని విషయంలో తను ఆమెకెలాగా తీసిపోదు. కాకపోతే, ఆమె చెప్పిన వ్యక్తిత్వం గురించిన వ్యవహారం. ఆ విషయంలో తన కెలాంటి పరీక్షా ఈ రోజువరకూ తగల్లేదు... వేదవతి అన్నట్టు మొగవాళ్లేం పులులా, పిశాచాలా?...

పార్వతి మంత్రమూర్తిని డబ్బు సంగతి అడిగివచ్చి కూర్చుని, తిరిగి గుమాస్తాలొచ్చేవరకూ ఇలాంటి ఆలోచనల్లో పడి పోయింది.

హెడ్ గుమాస్తా కైలాసంవొచ్చి తన స్థానంలోకూర్చుని పార్వతివైపు చూసి "ఏమమ్మా, నువ్వు హోటలుకి వొచ్చినట్టులేదే," అన్నాడు సానుభూతితోటి.

"లేదండి," అన్నది పార్వతి లెడ్జర్‌లో ఏదో రాస్తూనే.

"నీకు రావటానికి అభ్యంతరమైతే ఇక్కడికే తెప్పించుకో. కింద కుర్రాడున్నాడుగా," అన్నాడు హెడ్ క్లార్కు.

పార్వతికి ఈ సందర్భంలో భర్త జ్ఞాపకం వొచ్చాడు. ఇవ్వాళ ఆయనకి తాను మధ్యాహ్నం కాఫీ తయారుచేసిపెట్టి రాలేదు. రెండు పూటలా కాఫీలేనిదే ఆయన బతకలేడు. పాపం! మరిచిపోయి వచ్చింది...ఇప్పుడామెకి భర్తపట్ల జాలికన్న—సాయంత్రం ఏమంటాడో నన్న భీతి ఎక్కువయింది. ఏది ఏమైనా ఇప్పుడు చేయగలిగేదేమీలేదు......గోడ గడియారం మూడుంబావు గంటల్ని సూచిస్తోంది.

కైలాసం తన ప్రశ్నకి పార్వతి జవాబివ్వకుండా ఆలోచనలో పడిపోవడం గమనించి కుర్రాణ్ణి కేకేశాడు "ఒరేయ్ సుబ్బడూ!" అని.

పార్వతి తిరిగి తన పనిలో నిమగ్నమైంది.

సుబ్బడు పైకిరాగానే "ఒక కాఫీ తెచ్చివ్వరా, ఆమెగారికి." అన్నాడు కైలాసం. సుబ్బడు, పార్వతి తలెత్తి 'వొద్దు' అని ఆక్షేపించేలోపలే పరిగెత్తికెళ్ళాడు. కాఫీ తెచ్చాడుకూడా. ఆమెకిక తాగక తప్పింది కాదు.

దీన్నంతా గమనిస్తూన్న సుబ్బారావు తన పక్కనేవున్న రెండో క్లర్కు సుబ్రహ్మణ్యంతో, "ఛెట్టురా నాయనా ఛెట్టు. హెడ్‌క్లర్కు మనకేనాడయినా కాఫీ తెప్పించాడ్రా?" అన్నాడు కొంచెం కచ్చిగానూ, హేళనగానూ. గొంతు చాలా తగ్గించి అన్నాడు.

సుబ్రహ్మణ్యం నవ్వాడు 'అవును,' అని తలవూపుతూ.

మూడో క్లర్కు కాంతారావు కొంచెం ఎడంగావున్నా, మొహాలలో భావాల్ని బట్టి జరిగిందాన్ని ఊహించి తానూ నవ్వాడు. సుబ్రహ్మణ్యం, కాంతారావు లిద్దరూ పెళ్ళయి సంసారభారం మోస్తూన్నవాళ్ళే. అయినా, యువకులూ, విలాసాల్లో—ఆశగల వాళ్లూ కావటంవల్ల కొంతవరకు వాళ్ళు సుబ్బారావుకి సహచరులు. అలా లేకపోతే బ్రహ్మచారి సుబ్బారావు, వాళ్ళకి తాటాకులు

కట్టాడని వాళ్ల భయం. ఇంకో కారణం, ఎవరైనా వెక్కిరించి తద్వారా కొంత ఆనందాన్ని పొందటమనేది మానవుడిలోవున్న ప్రాథమిక గుణాల్లో ఒకటి కావటంవల్ల గూడానూ.

సుబ్బారావూ, సుబ్రహ్మణ్యమూ, కాంతారావూ ఏ కారణాలవల్లనైతేనేం, ఆ ఆఫీసులో కట్టకట్టుకుని జీవిస్తున్నారు. చాటుగా వాళ్లు ముగ్గురూ పోగై ఇటు హెడ్ గుమాస్తానీ—అటు యజమానినీ గురించి చాలా మాట్లాడుకునేవాళ్ళు. అవి సగం తిట్లుగానూ, సగం ఎగతాళిగానూ వుండేవి. ఈ సంభాషణలు వాళ్లకేదో హాయినిచ్చేవి అనేది ఖాయం.

లీలారమేశ్ వాళ్లకి కొంతలో కొంత తాళంవేస్తూ వుండేది. అదీగాక ఆమె ఇతర గుమాస్తాలని తనకి తెలిసే కొంత ఆకర్షించడానికి నిష్కారణంగా ప్రయత్నిస్తూ వుండేది. ఆమె వెళ్లాక పార్వతి ఆ స్థానంలో కూర్చుని, తన పని తాను నిష్కర్షగా చేసుకుంటూ బుద్ధిపూర్వకంగా ఎవర్నీ తనవైపు ఆకర్షించటానికి ఎటువంటి ప్రయత్నమూ చేసేదికాదు. ఆమె నిరాడంబరంగా వుండడం ఒక కారణమూ, ఆమె నిష్కళంకమైన మనస్సొక బలవత్తరమైన కారణమూ.

అయితే ఏం? ఆమె సుబ్బారావుకి దేవతలా కనపడసాగింది. మిగతా ముగ్గుర్నీ గూడా ఆమె ఆకర్షించింది.

కైలాసం ఆమె స్థితినీ, ఆమె సౌజన్యమైన రూపాన్నీ, మెత్తని మనస్సునూ చూసి జాలిపడి ఆమెని అభిమానించాడు. ఆ అభిమానానికి వరస చెప్పడం కష్టం.

సుబ్రహ్మణ్యం, కాంతారావులు ఏ విధమైన భావాన్నీ ప్రదర్శించకుండా మౌనంగా ఊరుకున్నారు. కాకపోతే, సుబ్బారావును చాలామటుకు అనుసరించారు, బలపర్చారు, తమకేమీ ప్రయోజనం లేనట్టే. కాకపోతే, వాళ్లకి మిగిలేది సుబ్బారావు ఏదైనాచేస్తే దానికొచ్చే ప్రతిఫలంయొక్క భావానందం మాత్రమే.

ఆఫీసులో వ్యవహారాల స్థితి ఇలావున్నదని—కైలాసం అంచనా వేశాడు అనుభవస్తుడు గనక. పైచెప్పిన పరిస్థితుల్ని అయ

నైనా అరికట్టడం అసాధ్యం. ఎందుకల్లా అంటే, ఇవేవీ పైకి ప్రమాద కరంగా కనపడవు, పైగా అలాంటి పరిణామాలకైనా అవి దారితీయక పోవచ్చు. సావిత్రి గుణవంతురాలైనంతవరకూ ఇంకా పదిమంది ఇలాంటివారి పక్కనవున్నా ఆమెకొచ్చే నష్టంలేదు...అనుకున్నా డాయన.

పార్వతి ఆరోజు ఇంటికి వొచ్చేటప్పటికి ఆమె అనుకున్నంత పనీ జరిగింది. సాంబశివరావు కాఫీ లేనందుకు మండిపడ్డాడు. దగ్గరకిపిల్చి చెంపమీద ఐదువేళ్ళూ అంటుకునేట్టు లాగి కొట్టాడు నోటికొచ్చినట్టు నానామాటలూ అన్నాడు. పార్వతి ఏమీ అన కుండా తిరిగి ఇంటిపనుల్లో లగ్నమైంది. ఆ రాత్రి ఆమెకి మళ్లీ శివ రాత్రి ఐంది.

## 17

ఒక ఆదివారం, కోటిలింగం టైలరింగ్ షాపులో-సుబ్బా రావూ, అతని స్నేహితులూ పొద్దున్నే సమావేశమై చీట్లపేక ప్రారంభించారు. మధ్య మధ్య విరివిగా బూతులు ఉపయోగిస్తూ, పెద్దగా నవ్వుకుంటూ, ఆ రోజల్లా తమకేమీ పనులులేవన్న ధీమా కొద్దీ, అందరూ కాస్తోకూస్తో డబ్బులు జేబుల్లో వేసుకుని కూర్చున్నారు.

కోటిలింగం, సుబ్బారావు ఒకే పార్టీ కావటంతో ఆట జోరుగా సాగుతోంది. వాళ్ళ కెదురుపార్టీ బలహీనమైంది ఆట రీత్యా. గురుమూర్తీ, శివరామయ్యా ఆసక్తికొద్దీ ఆడడమేగాని డబ్బులు పోగొట్టుకుంటున్నారు. చీట్లాటలోనేగాదు, ఏ జూదంలో నైనా నష్టం వొచ్చినకొద్దీ ఇంకా [illegible] పోరూ, నష్టం ఊడ్చుకోవా లనే ఉద్వేగమూ ఎక్కువ గనక వాళ్ళిద్దరూ మరింత పట్టుదలతో ఆడుతున్నారు.

సుబ్బారావు మూడోసారి ఆట ముగించి డబ్బులు పంచు కుంటూ ఈ "వెధవ ఆటల్లో గెలవటం గొప్పట్రా. అసలు గెల వాల్సినచోట గెలవాలిగాని!" అన్నాడు కోటిలింగంతో.

కోటిలింగానికీ, శివరామయ్యకీ ఆ అసలుచోటు ఏమిటో తెలుసుగనక, తలఊపారు ఇద్దరూ రెండు విధాలుగా. కోటిలింగం

'గెలవచ్చులే,' అన్నట్టు సూచించాడు. శివరామయ్య 'ఏడిశావులే జాగర్త,' అన్నట్టు సూచించాడు.

ఇద్దరికీ జవాబుగా సుబ్బారావు, "ఒరే! ఇవ్వాళ కాకపోతే రేపయినా విజయం సాధిస్తాన్రా. ఉద్యోగానికి వొచ్చే రకాలు ఏం పెద్ద పతివ్రతలేంటి?" అన్నాడు హేళనగా.

ఇంతలో కోటిలింగానికి కాఫీ జ్ఞాపకం వొచ్చింది. "ఒరే ఆట ఆపండిరా కాసేపు. చందా వేసుకుని నాలుగు కాఫీలు తెప్పిద్దాం పట్టండి," అన్నాడు.

గురుమూర్తి "మేం ఓడిపోయాం. మీరే తెప్పించండిరా. న్యాయంగా వుంటుంది," అన్నాడు జాలిగా పోజ్ పెట్టి.

కోటిలింగం "ఎప్పుడూ వెధవ ఏడుపు. తగలేస్తాంలే," అని ఎదురుగావున్న హోటల్ నించి కాఫీ తెప్పించాడు తానే అర్థ రూపాయిచ్చి.

అందరూ కాఫీలు తాగి, సిగరెట్లు వెలిగించారు. సుబ్బారావుకు తన ప్రయత్నాన్నంతా చెప్పెయ్యాలని కడుపుబ్బరంగా వుంది. "ఒరే, వినండిరా కాసేపు," అంటూ ఉపక్రమించాడు.

అంతనికి శివరామయ్య అడ్డ వొచ్చి "ఒరే వుండరా, నీ కోతలూ నువ్వూనూ! అక్కడ ఆఫీసులో తల తాకండా పని చేస్తూ, బైట అన్నీ వెధవ కబుర్లు!" అన్నాడు గోడకి జేర్లబడి.

గురుమూర్తి "ఏమిటిరా నీ ఏడుపు? చెప్పరాదు—ఏమిటో వెర్రి మోహం పెట్టకపోతేనూ," అన్నాడు సిగరెట్టు దమ్ము లాగుతూ.

కోటిలింగం గోడకి వేళ్ళాడుతున్న కామలిపింఛంపన్నె సిల్కు గుడ్డమీద ప్రసరిస్తూన్న ఉదయపు ఎండను చాలా ఆసక్తిగా చూస్తూ వున్నవాడల్లా చప్పున సంభాషణలోదిగి, "సుబ్బారావూ! నిజం చెప్పాల్సివొస్తే ఒక పెళ్ళాంతో జీవితమల్లా గడపడం అసహ్యం. గతిలేకగాని...," అని ఆవాక్యాన్ని అసంపూర్తిగా వొదిలేశాడు.

శివరామయ్య ఈ సందర్భంలో సుబ్బారావుకి అవకాశం ఇవ్వకండానే "అందరూ గతిలేకనే ఊరుకుంటున్నారనా తమ ఉద్దేశం? నీబోటి దౌర్భాగ్యులే నిక్షేపంలాంటి పెళ్ళాలుండగానే అడ్డమైన వాళ్ళ వెనకాలే ప్రదక్షిణాలు చేస్తూవుంటారు ఊరకుక్క-

ల్లాగా. నే పెరుగుతున్నా, ఎంతమంది ఆడవాళ్ల గేట్లదగ్గిర నిలబడి సినిమాహాలునించి వాళ్లని—ఇళ్ళదాకా శ్రద్ధగా తీసుకెళ్లి వొదిలి వస్తుంటారు... అదీ ఒక ఘనతే అనుకుంటారు," అన్నాడు.

సుబ్బారావు పగటి కలనించి మేల్కొన్నవాడల్లే ఉద్రేకంగా "నోరుముయ్యవోయ్ లక్ష్మీ! నీదీ బెజవాడే, నాదీ బెజవాడే మర్చిపోకు. ఏవో రెండు పుస్తకాలు చదివి ఇప్పుడు పెద్ద మనిషి వేషం వేస్తున్నావుగాని, ఇదివరకు నువ్వూ లేడీస్ కాలేజీల చుట్టూతిరిగి ఈలపాటలు పాడ్డం నేను మర్చిపోయానా ఏమిటి? మీసం ఉన్న వాడల్లా చేసేపనే అది. మళ్ళీమీ సిగ్గుపడి సమర్థించుకోనక్కర్లేదు!" అన్నాడు తన సన్నటిమీసం చేత్తో తడుముతూ.

కోటిలింగం "ఏమిటి ఈ తర్కం? సుబ్బారావూ! చెప్పరా నీ విషయం. నువ్వు కాస్త ఇంట్రస్టుగా చెబుతావు గదా," అన్నాడు. అదీ నిజమే. సుబ్బారావు చాలా బాగా చెబుతాడు ఏ విషయాన్నయినా సరే. అది అతనికి వొంటబట్టిన విద్య. అతను చెప్పేది వింటూన్నవాళ్లు కమ్మని కలల్లోకి వెళ్లిపోతారు.

సుబ్బారావు రోడ్డుమీదపోతూన్న ఎవరో అమ్మాయివైపు చూసి చప్పరించేసి "ఆడవాళ్లు నడుస్తూంటేనే అందంగా వుంటుందరా. అందులో ఒక్కొక్కళ్లు మరీ అందంగా వుంటారు. నాకే అట్లా కనపడతారో లేక అందరికీ అంతేనా? ఎన్నిరకాల అందాలు మనచుట్టూ వున్నాయి! నీ కొట్లో ఎన్ని రంగుల గుడ్డలున్నాయో చూశావా? అన్ని రకాలకో అందం. మగ వెధవలకి కట్టుకోడానికి ఆ గుడ్డలు పనికిరావే అని నాకు చాలా దిగులేస్తుంది అప్పుడప్పుడు..." అంటూండగానే శివరామయ్య "పోనీ నువ్వూ కుట్టించుకోరాదుట్రా ఆ పూల వాయిల్ చొక్కాలు?" అన్నాడు అక్కడ వేళ్ళాడుతున్న ఓ వాయిల్ గుడ్డ చూపించి. గులాబీరంగు గుడ్డమీద కుంకుమ రంగు పూలు అద్దినవాయిల్ అది. సుబ్బారావు దానివంక చూసి, "నాకు చాలా మోజురా అబ్బాయి. నేనే ఆ విషయంలో ముందడుగు వెయ్యటానికి భయపడుతున్నానన్నమాటేగాని... అయితే, మా ఆఫీసులో పని చేస్తోందే ఆ అమ్మాయి! ఆ అమ్మాయి ఎర్రని శరీరచ్ఛాయకి ఈ గుడ్డ ఎంతో చక్కగా అమరుతుంది. కాని, మనమెవళ్ళం ఆ

నిర్ణయాలు చెయ్యడానికి ? నాకు వీలుంటే మాత్రం ఇలాంటి చీర కొనిఇచ్చి ఆమె కట్టుకుంటే చూసి ఆనందించాలని ఉంది," అన్నాడు ఒక నిశ్వాసవిడిచి, ఏదో పోగొట్టుకున్నవాడల్లే మొహంపెట్టి.

"చాలా చవకబారు అభిరుచి," అన్నాడు శివరామయ్య మంటగా.

"ఏంచేత ?" అని అడిగాడు సుబ్బారావు.

"పెళ్లికాని బ్రహ్మచారివి గనక ఇలా అంటున్నావు. ఏ ఆడదానికి ఏ గుడ్డ బాగు టుందో ఆలోచించి, వీలయితే కొనిపెట్ట డానికి ఇప్పుడు సిద్ధమౌతున్నావుగాని, రేపు నీకే పెళ్లయి నీపెళ్లామే రెండో చీరలేక నువ్వు కొనుక్కొచ్చిన చవకబారు చీర నచ్చక, 'ఏమండి నేను ఆ దమయంతి పచ్చచీర కొనుక్కుంటానండి,' అని బతిమాలినా, 'ఛీ నోరుముయ్, అది పది రూపాయల్ట!' అని తిన్న టానికి సిద్ధపడతావు !" అన్నాడు శివరామయ్య.

కోటిలింగం శివరామయ్య వంక తిరిగి, "స్వానుభవం," అన్నాడు కన్నుగీటి.

"అంతా కాదులే. కొంతవరకు నిజమే," అన్నాడు శివరామయ్య.

సుబ్బారావు "నన్ను చెప్పనీయరా ఏమిటి ? నే పోతాను రా," అన్నాడు లేవబోతున్నట్టు నటిస్తూ.

కోటిలింగం "చెప్పరా, చెప్పు. అప్పుడే వెళ్లి ఏంచేస్తావు. వీరి ఇంట్లో భోజనాలకి వేళంటూ లేదుగా ? ఎప్పుడెళ్తే పెట్టరు?" అన్నాడు.

"ఎందుకని ?" అని అడిగాడు గురుమూర్తి.

"వాళ్ళ సంసారం చిన్న సర్కసు కంపెనీలాంటిదిలే. ఆరు గురు పిల్లలూ, ఐదుగురు పెద్దలూనూ. పిల్లల కోసం ఎప్పుడూ అన్నం సిద్ధంగా వుంటుంది. లేచేవాళ్లు లేస్తూవుంటే, తినేవాళ్లు తింటూ వుంటారు. పిల్లలున్న కొంపలన్నీ అంతేగా ?" అన్నాడు కోటిలింగం.

"అచ్చా. సుబ్బారావు! కానీ నీ ఆత్మపురాణం విందాం," అని శివరామయ్య సైతం అనేప్పటికి, సుబ్బారావు ఆరంభించాడు.

"నిజం చెబుతున్నానురా. ఆ అమ్మాయి నా కెదురుగా కూర్చొని తలొంచుకుని తన పని తాను చూసుకుంటూ ఎప్పుడేనా ఓరగా తల పైకెత్తి, నావంక ఒక్క తృటి కాలం చూస్తుంది. ఆ సోగకళ్ల మెరుపు, ఆమె చూపులోని శూన్యత నన్ను పిచ్చెక్కిస్తాయి. ఇంకెందుకురా! ఆమె ప్రతి కదలికకూ ఏదో ప్రత్యేకమైన అందం వుందని నా ఊహ. నేనా సౌందర్యానికి బానిసని. ఆమె ఉద్యోగరీత్యా నాతో మాట్లాడేప్పుడు, నా నోరు పడిపోతుంది. కాళ్లుచేతులు చల్లబడిపోతాయి. తిరిగి అనాలనుకున్న వేవీ అనలేను. ఊఁ...... అంటాను. అవునో కాదో—అని తలఊపటంతో సరి. ఏంచెయ్యనురా ఈ బలహీనతకు? అయినా ఇది ఏ రకం బలహీనత? ఆమె వ్యక్తిత్వంలో దేన్నిచూసి నేను భయపడుతున్నట్టు? అయితే ఒకటి. నా పక్కనే పనిచేస్తున్నారే ఇంకా ఇద్దరు వెధవలు... వాళ్లకంటే నేనే నయం. వాళ్లు బొత్తిగా పిరికివాళ్లు. నే నేమైనాచేస్తే చూసి సంతోషిస్తారేమోగాని—వాళ్లంతట వాళ్ళు వేలుకదపలేరు ఇటువంటి వ్యవహారాలలో. ఆ లెఖ్ఖన నేను నయంకాదుట్రా?" అని అడిగాడు కోటిలింగాన్ని.

"కొంత నయం. ఇంతకీ నీ అడ్వెంచర్ ఏమిటో చెప్పవేం?" అన్నాడు కోటిలింగం.

"నీకంటే సగటున వాళ్లే బుద్ధిమంతులన్నమాట! కానీ కథ," అన్నాడు శివరామయ్య.

"నీలెఖ్ఖన బుద్ధిమంతులంటే పిరికివాళ్లన్న మాట. కాని, నే నలాంటివాణ్ణి కాదు మిస్టర్. మనం కార్యశూరులం. ఒకమ్మాయిని హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను నేను. ఆ ప్రేమకోసం ఏమైనా చేస్తాను..."

"ప్రేమా? చాలా కొత్త విషయం," అన్నాడు శివరామయ్య, ఏదో పాపపు మాటవిన్నవాడల్లే రెండు చెవులూ మూసుకుని.

"నీకు మీ నాయన చిన్నప్పుడే పెళ్లి చేశాడుగావును, ప్రేమంటే నీకేం తెలుసు నీ తలకాయ? సంసారపు రొంపిలోబడి నీకు మతి చెడిందనుకుంటా," అన్నాడు కోటిలింగం.

"నాకు చిన్నప్పుడే పెళ్ళయినమాట నిజమేగాని, నీ వనుకున్నట్టు ప్రేమ విషయం నాకు తెలీదనుకోకు. నేను నా పెళ్ళాన్ని పెళ్ళాడేక తర్వాత ఈనాడూ-ఆనాడెంత ప్రేమించానో అంతే ప్రేమిస్తున్నాను. నీబోటివాడికి, అందులోనూ పెళ్ళాన్ని మార్చాలి—అని వాగేవాళ్ళకి సంసారం రొంపిగా వుంటుందంటే కొంత సమంజసంగా వుంటుంది," అన్నాడు శివరామయ్య మందలింపుగా.

సుబ్బారావు, "పెళ్ళాన్ని ప్రేమించకపోతే ఎలాగురే! ఇంకేం తేరగా దొరికేదాయె వీడి ముఖానికి! పెళ్ళాన్నైనా ప్రేమిస్తున్నాను అని చెప్పుకుని సంతోషిస్తున్నాడు. పోనీ కోటిలింగం! నా కథవిను... ఆఫీసుకి కరెక్టుగా వొచ్చేది నేనే ఇప్పుడు. మిగతా వాళ్ళందరూ పది నిమిషాలు అటూ ఇటూగా వొస్తారు. ఆ అమ్మాయి... పార్వతిగూడా నేనొచ్చే వేళకి వొచ్చేస్తుంది. రాను రాను నాకు ఇంట్లో ఒక్క క్షణం వుండబుద్ధి కావటంలేదు. ఎప్పుడూ ఆమె సమక్షంలోనే వుండాలని వుంటుంది. ఆదివారం శలవ ఎందుకొస్తుందా అనిపిస్తోంది... సాయంత్రాలు ఇంకా కాసేపు ఆఫీసు వర్క్ వుంటే బాగుణ్ణే అనుకుంటున్నాను ఇప్పుడు మే మిద్దరం వొచ్చిన పావుగంటకిగాని మిగతావాళ్లు రారుగదూ! ఉభయులం మౌనంగా ఎవళ్ల కుర్చీల్లో వాళ్లు కూర్చుంటాం. నేను పని ముట్టుకోనులే... ఆ అమ్మాయి రావటం, తన పనిలోకి దిగుతుంది. తలెత్తి వినా చూడదు. వృథాగా ఒక్క మాట మాట్లాడదు. ఆమె నన్ను పలకరిస్తే బాగుణ్ణే అని నేను ఎంతగా ఉవ్విళ్లూరుతున్నానో ఆమె కెలాగ తెలియజెయ్యడం? గొంతు సవరించుకుంటాను. ఆఫీసు గడియారం వంకచూసి, "ఇప్పుడింకా పది కాలేదు," అంటాను మెల్లగా పైకే. లేదా, టేబిల్ మీదవున్న న్యూస్ పేపరుమీద హెడ్డింగులన్నీ కంఠస్థమైయ్యేట్టు పైకి చదువుతాను. ఇంత అయినా, ఆమె తన పనేమో తనేమో... ఒక వేళ ఎప్పుడైనా అకస్మాత్తుగా తలెత్తి నా వంకచూసినా, ఆ చూపులో శూన్యం తప్ప ఇంకేమీ వుండదు. ఆ క్షణందాటితే తిరిగి తలవొంచుకుంటుంది. చుట్టూ ఎవరూ లేరన్న ధీమాకొద్దీ నేనే ఆమెని తనివిదీరా చూస్తూవుంటాను. పాపం, ఆమెకి రెండే చీరలున్నాయి అనుకుంటానురా! అదే

మార్చి మార్చి కట్టుకొంటూ వుంటూంది. కొంతమందికి ఎంతమంచి కొత్తచీరకట్టినా అందంరాదు...పైగా ఆ చీర పరువుగూడా పోతుంది. ఈమె ఏ పాతచీరకట్టినా అందంగా అప్సరలా వుంటుందిరా !..."

"వొరే ఆపరా నీ సోది, చస్తున్నాను. నీ రొమాన్సు వినటంతప్ప మాకు వేరే పనులు లేవనుకుంటున్నావా యేం ?" అన్నాడు ఇందాకణ్ణించి మెదలకండా పరధ్యానంగా వింటూన్న గురుమూర్తి.

"ఏంపని వుందంటావు ? నిజంగానే నీ కేమైనా పనివుందా ఏంరా ?" అన్నాడు సుబ్బారావు హేళనగా గురుమూర్తి వంక చూస్తూ.

"సుబ్బారావు! నా మాటవిను. ఇప్పటికే పది దాటింది. నీ ఇల్లు పక్కనే గనక గబుక్కునవెళ్లి దూరుతావు సరిపోతుంది. మా కొంపలు దూరం. పోవద్దూ ? మధ్యాన్నం వొద్దాం. వీలైతే నీ రింధను చూపిద్దువుగాని ! ఏం ?" అంటూ గురుమూర్తిని భుజం పట్టుకుని లేవదీస్తూ, అన్నాడు శివరామయ్య.

కోటిలింగం "అంతేగా, పోదాం పదండి. నేను మాత్రం మధ్యాన్నం రానులే. మాట్నీషోకి వెళ్తాను," అన్నాడు.

అందరూ నవ్వుతూ ఎటువాళ్లు అటు వెళ్ళిపోయారు.

## 18

సుబ్బారావు సహాగుమాస్తా కాంతారావు నీటుగా పొడుగు పాటి లాగువేసుకుని డాబ్సరిగా వుంటాడు. తాను అందమైనవాడన్న గర్వం సదా అతని మొహాన కనపడుతూ వుండేది. అతను ఎలాగైనా తానూ అందమైనవాణ్ణేనని ఎవరినోటంబడి అయినా అనిపించు కోవాలన్న తీవ్రమైన వాంఛతో కనిపించేవాడు. కాలరు మాటి మాటికీ సద్దుకొంటూ, గడియకోసారి జేబులోంచి అద్దంతీసి మొహాన్ని చేతిగుడ్డతో తుడుచుకుంటూ, తలదువ్వుకుంటూ సుబ్బారావును అధిగమించాలని ప్రయత్నం చేస్తూండేవాడు ఆఫీసులో. కాలు ఎత్తి త్తేస్తూ నడవడం ఫాషన్ అని భావించేవాడు. ఒక చెయ్యి కదలకుండా వుంచి, రెండో చెయ్యి ఊపుకుంటూ బజార్నపోతున్న

ఆడవాళ్లని క్రీగంట చూస్తూ అతను నడుస్తూంటే ఎవరికైనా నవ్వు రాక మానదు.

సుబ్బారావుకి తరుచు చేబదుళ్లు అవసరమౌతుండేవి. అందు కని అతడు కాంతారావు మనస్తత్వం కనిపెట్టి "మొన్న నువ్వూ, నేనూ మాట్నీకి వెళ్ళాం చూడు కాంతారావు! ఆవేళ, ఎవరో నలుగైదుగురు గరల్సు గూడా వొచ్చారు జ్ఞాపకం వుందీ?" అని ప్రారంభించేవాడు.

"అవును. దానికేం?" అనేవాడు కాంతారావు.

"వాళ్లు పిక్చరు మొదలెట్టేదాకా నిన్నే చూస్తూ కూచున్నారోయ్ ఒకటేమైన! నేను చూశాగా! ఎట్లాగైన నీలో ఏదో అట్రాక్షన్ ఉంది. ఎప్పుడో ఒకనాడు నిన్ను ఏ సినిమా డైరెక్టరో బుక్ చేస్తాడు చూస్కో! నే చెప్పాగా!" అనేవాడు సుబ్బారావు.

ఇది అబద్ధమని కాంతారావు అంతరాత్మకి తెలుసును. కాని, ఏమో! నిజం కావచ్చు. ఆ అమ్మాయిలు తను వాళ్లను చూడనప్పుడు తనవంకే చూశారు గాబోలు—అనుకొని సంతోషించేవాడు. అతను నలుగుర్లోకి వొచ్చినప్పుడు పెట్టే వంకరపోజులు అందరి దృష్టినీ ఆకర్షించే మాటగూడా నిజమే కొంతవరకు. అదంతా తన సౌందర్యాకర్షణే అని భ్రమపడుతూ వుంటాడు కాంతారావు.

ఈ భ్రమే సుబ్బారావుకి కావల్సిందిన్నూ, "కాంతారావు: నాకు చాలా ట్రబుల్‌గావుందోయ్. ఒక ఐదు రూపాయలుంటే ఇయ్యి. 'పే' తీసుకోగానే ఇచ్చేస్తాను," అనేవాడు సుబ్బారావు, కాంతారావు మొహం కొంచెం వికసించటం చూసి. మొత్తానికి ఈ డబ్బు తిరిగి రానీ రాకపోనీ—రాదనే అనుకుంటూ ఇవ్వక తప్పేదికాదు కాంతారావుకి. ఇవ్వకపోతే, సుబ్బారావు అప్పణ్ణించీ తాటాకులు కడ్తాడన్న భయం వేరే వుండనే వుంది!

కాంతారావు సుబ్బారావుతో సంభాషిస్తూ, "నా భార్య కొంచెం చామనఛాయగా వుంటుంది. కొంచెం పొట్టిగూడానూ. నేను కాస్త ఎర్రగా ఒడ్డూ, పొడుగ్గా వుంటానా! నా మొదట

మా ఆవిడ తక్కువతనం, అంటే 'ఇన్ ఫీరియారిటీ' ఫీలవుతుందోయ్. నేనేమంటే దానికి తలొగ్గి వుంటుంది. నేను ఇంకే ఆడదాని వంకన్నా చూస్తానేమో, తనకి కాకుండా పోతానేమోనని దానికి తగని భయం," అంటాడు.

"సహజమే మరి. ఎట్లాగైనా అదృష్టవంతుడవోయ్. మన కొత్త టైపిస్టు గరల్ గూడా నిన్నే చూస్తూంది సుమా! నీ ముందు మాబోటివాళ్ళం సూర్యుడిముందు దివిటీ!" అనేవాడు సుబ్బారావు, అనాలని లేకపోయినా అనక తప్పని పరిఅయి.

"మా కొంపలో అందరికీ మా దాంపత్యపు ఐకమత్యంచూసి ఈర్ష్యరా. మా ఆవిడ నా మాట జవదాటకుండా వుంటుంది గదూ! అందుకని!" కాంతారావుకీ సంగతి అందరికీ చెప్పందే తలపగిలి పోతుందన్నంత వెర్రి. దీనికి కారణం చాలా వుంది. కాంతారావు చెప్పే దాంపత్యపు ఐకమత్యం నిజమే.

ఐదు రూపాయలు చేబదులు సుబ్బారావుకి ఇచ్చి, ఇంటికి వెళ్ళాడు కాంతారావు. గడపదాటి లోపల అడుగుపెట్టగానే అతని వైఖరి మారుతుంది. మొహంమీద బలహీనమైన చిరునవ్వు వెలుస్తుంది. దార్ఢ్యం తగ్గినట్టు అతని బడాయి పోజులన్నీ మాయమై పోతాయి.

కాంతారావుకి ఇద్దరు అన్నలున్నారు. కాంతారావుకి పెళ్లి కాకముందు వాళ్లందరూ కలిసే వుండేవారు. తండ్రి ఎంతచెప్పినా వినకండా కాంతారావు పెళ్లయిన సంవత్సరానికల్లా ఉన్న కాస్త ఆస్తీ పంపిణీలు చేయించి, వేరే కాపరాలు పెట్టించేశాడు. ముసలాయన పోషణ తలా నాలుగు నెలలు అనుకొన్నారు అన్నదమ్ములు. కాంతారావు దగ్గరవుంటే నాలుగు నెలలూ ముసలాడు సాధ్యమైనంత వరకు వీధి అరుగుమీదే గడిపేస్తాడు. కాంతారావు పెళ్ళాం సావిత్రి బొద్దుగా, నల్లగా వుంటుంది. ఏ భావమూ చప్పున వ్యక్తం కావటానికి వీల్లేని మొద్దు మొహం. ఆమె కళ్ళైనక తెల్లగా లేటగా లేకపోయినట్టయితే ఆమెని ఐదు నిమిషాలు చూస్తూ భరించటం కష్టసాధ్యం.

ఇంట్లో అడుగుపెట్టూ కాంతారావు "ఏమే నీళ్లు తీసుకురా," అని అరుస్తాడు పక్క పోర్షన్లలో కాపరముండేవారికి వినపడేట్టు. కాని, సావిత్రి రాదు. ఆవిడకి మొగుడంటే దూదిపింజకంటే తేలిక.

దీన్ని మళ్ళీ సమర్థించుకోవద్దూ ? కాంతారావు వంటింట్లోకి తొంగి చూసి "పనిచేస్తున్నట్టున్నావే ? నేనే తెచ్చుకుంటాలే," పెద్దగా అనుకుంటూనే బావి దగ్గిరకివెళ్లి కాళ్లు కడుక్కొస్తాడు.

సావిత్రి మాట ఆ ఇంట్లో తిరుగులేనప్పుడు ఇంక ఐక మత్యానికి కొదవేమిటి ? కాంతారావు బైట ప్రవర్తనలోని డాబుకి కారణం అతని భార్య ఇంట్లో చలాయించే చలాయింపే.

కాంతారావు అడ్రస్ కనుక్కోవాలని ఒకనాడు అతని మేనమామ అదే బజార్న ఆరుసార్లు తిరిగాడు. అతని ఉద్యోగం, సాముద్రికాలక్షణాలూ అన్నీ చెప్పినా ఆ బజార్న ఎవరూ కాంతా రావు ఇల్లు చూపలేకపోయారు. పేరు చెప్పినా తెలుసుకోలేదు. చివరికి విసిగి ఆ మేనమామ రోడ్డుమూలవద్ద పంపులో నీళ్లుపట్టు కుంటున్న ఒకావిడను అడగ్గా, ఆమె అన్ని వివరాలూ తెలుసు కున్నాక, "సావిత్రమ్మ మొగుడుటండీ ?" అని ఇల్లు నిక్షేపంగా చూపించింది.

## 19

పార్వతి మర్నాడు ఆఫీసులో అడ్వాన్సు తీసుకుని ఆ వారంనాడు ఎక్కడో లీలామహాల్ దగ్గిర తీసివున్న చిల్లరకొట్లో కావల్సిన సామాన్లన్నీ కొనుక్కొచ్చింది. తాను తెచ్చుకున్న ముప్పైఫరూపాయల్లో పది రూపాయలు మిగిల్చింది. ఇరవైరూపా యల సామాగ్రి పది పన్నెండు రోజులపాటు రావాలని ఆమె అంచనా. తనకూ, భర్తకూ కావల్సిన అత్యవసరమైన కొన్ని గుడ్డలు కొనాలని మిగిలిన పది వుంచిందామె.

ఆమె సామాన్లు తెచ్చేవరకు ఉదయం పదయింది. ఆవేళ మామూలుకంటే కొంచెం వితరణగా వంటచేసి భర్త మెప్పు పొందా లని ఆమె తాపత్రయం. ఆమె సామాను కూలీవాడి నెత్తినుంచి

దింపి ఇంట్లో పెట్టి, "ఇవ్వాళ ఏం వంట చెయ్యను?" అని అడిగింది, సాంబశివరావు దగ్గిరగా వొచ్చి కూర్చుని చాలా ప్రీతిగా.

ఆమె మొహంలోని సంతోషాన్ని సాంబశివరావు తప్పర్థం చేసుకున్నాడు. తాను పనిచేసి భర్తకు పెడుతున్నాను—అన్న గర్వంగా దాన్నర్థం చేసుకున్న భర్త, "ఏదో వొకటి వండి తగల బెట్టు! ఏది పెడితే కాదంటాను కుంటి వెధవని?" అని విసుక్కున్నాడు మంటగా.

పార్వతికి చురుక్కుమంది. "ఎందుకండి నామీద అంత కోపం మీకు? మీకు ఇష్టంగదా అని కాకరకాయలు తెచ్చాను. కారంకూరి వేయిస్తే మీ కెంతో ఇష్టంఅని...." అంది ఆమె.

"అన్నీ నా యిష్టంకోసమే చేస్తున్నట్టు కబుర్లు. మధ్యాన్నం కాఫీకి రోజూ ఎంత ఇబ్బందైపోతున్నది నాకు! నువ్వు మూతపెట్టి వెళ్లే కాఫీ చప్పగా చల్లారి, నోటబెట్ట వీలులేకుండా వుంటున్నది. డబ్బేమన్నా మిగిలితే ఓ 'థర్మా ఫ్లాస్కు' కొనుక్కురాలేవూ?" అన్నాడు భర్త, ఆమెవంక చూడకండా ఇంటికప్పు కేసిచూస్తూ. ఆ మాటలే ఆమెవైపు చూస్తూ, నవ్వుతూ అంటే ఆమె ద్విగుణీకృత మైన సంతోషం అనుభవించేది. ఇప్పుడైనా ఆయన నోరు తెరిచి అడిగాడు. నిజంగా ఎంత బాధతో అన్నాడో, "రేపు ఆఫీసు నుంచి తిరిగి వొచ్చేప్పుడు గవర్నర్ పేటకెళ్ళి మంచి ఫ్లాస్కు కొనుక్కొస్తానండి," అంది పార్వతి, భర్తకాపు ప్రేమగా సర్దుతూ. ఆమె అనుకున్నట్టు రెండు రవిక గుడ్డలు ఎన్నాళ్ళనుంచో వేదవతి తొడుక్కుంటుంటే చూసి కొనుక్కుందామని ఎంతో మోజు పడ్డ ఆ రవిక గుడ్డలు ఈ తడవకు మానుకోవల్సిందే. బాడీలూ బొత్తిగా లేవు. కాని నిజమాలోచిస్తే ఫ్లాస్కే ముఖ్యం మరి.

ఆమె ఎప్పటికప్పుడే తన ఇష్టాల్ని బలవంతంగా అణచు కోడం నేర్చుకుని వుంది. ఆమెకి భర్తంటే ఏదో చెప్పరాని ప్రీతి ఏర్పడిపోయింది మొదట్నించి. అతను ఎంత కోపిష్ఠివాడైనా కానీ, కొట్టనీ, తిట్టనీ అతను ఆమెకి ప్రేమాస్పదుడే. అతని ఇష్టాఇష్టాలన్నీ ఆమెకి తెలుసు.

ఆమె మెల్లగాలేచి వంట ఇంట్లోకి వెళ్లింది. ఓ గంటలో వంటచేసి సాంబశివరావును మెల్లగా కింద కూర్చోబెట్టి, వేన్నీళ్లు కాచి చంటి పిల్లాడికి పోసినట్లు తలంటి పోసింది... ఈ గోలేగా తనకి తీరిక? రేపణ్ణించి మళ్ళీ ఉద్యోగం. ఊపిరి తిరగని పని! తన భర్తకు తనుగాక ఇంకెవరు? అతన్ని జాగ్రత్తగా రక్షించుకోవల్సిన విధి తనకున్నది.

తలంటిపోసి ఇస్త్రీగుడ్డలు తొడిగింది భర్తకు. తర్వాత ఓకూర, పచ్చడి, పప్పుపులుసు, కొద్దిగా పరమాన్నంతో సహా శుభ్రంగా వడ్డించి దగ్గర కూచుని తానే స్వయంగా కలిపి భర్తకు తినిపించింది.

సాంబశివరావు పైకేమీ అనకుండా భోంచేశాడు. కాని, లోలోపల ఏదో వేదన...'ఏమిటిది, తన నెందుకు ఇంత లాలిస్తోంది? ఏం కారణం? ఇదంతా తనమీద ప్రేమా? దుర్బలుణ్ని, కుంటివాణ్ణి, దమ్మిడీ సంపాయించలేని వెధవని, ఇంతగా గౌరవిస్తూందంటే ఏమనుకోవాలి? ఏదో తంతు. ఏమిటో దాస్తోంది లంజ,... అనుకుంటూడతను.

"ఇదిగోనండి బీడీలు, అగ్గిపెట్టె...ఇవ్వాళిటికి తమల పాకులూ, వక్కలూ తెచ్చా...ఇదివరకు వేసుకునేవారుగా రోజా కిల్లీలు!" అంది పార్వతి, ఆకులకి సున్నంరాసి వక్కలు భర్తచేతి కిస్తూ. సాంబశివరావు బీడీలూ అగ్గిపెట్టె అందుకుని, పార్వతివైపు ఏదో అర్థంచేసుకోవాలని ఆమె నిష్కల్మషమైన తెల్లని విశాలమైన కళ్ళల్లోకి చూస్తూ "ఎందుకీ అనవసరపు ఖర్చంతా నూ!" అన్నాడు. అతను తన సేవను గుర్తించి ప్రశంసాపూర్వకమైన ఒక్కమాట అంటాడేమో, ఒక్క ప్రేమగల చూపు చూస్తాడేమో, దగ్గరకి లాక్కుని తల నిమురుతూ 'పార్వతీ! నీ వెందుకు నా కోసం ఇన్ని అవస్థలు పడతావు!' అని నిట్టూరుస్తాడేమో. అతని కౌగిట్లో హృదయభారంతీరేట్టు ఒకసారి వెక్కి వెక్కి ఏడ్చి ఆనందబాష్పాలు నిండిన కళ్ళెత్తి అతనిలోకి చూసి, "మీ కోసం ఇంకెంత కష్టపడ మన్నా పడతానండి. మీరుగాక నా కింకెవరున్నారు!" అందామని పాపం ఆ అబల ఎంతో ఆశించింది. కాని, సాంబశివరావు రాయల్లే

పూరుకున్నాడు. విగ్రహంమల్లె కూర్చుని, భార్యవంక అయో మయంగా విరక్తిచూపిస్తూ విసుక్కున్నాడు. ఆమె హృదయాన్ని అణు అణువుగా గాయపర్చాడు. పైకి ఏమీ అనకండా చూపు తోనే ఎదటివాళ్ల ఉత్సాహాన్ని చంపే గుణసంపత్తి సాంబశివరావుకి పరిపూర్ణంగా వుంది.

అతను తీరికగా మంచంమీద పడుకుని ఆలోచిస్తూ పార్వతి దినచర్యలో లక్షతప్పులు ఎన్నుతూండేవాడు. ఆమెని ఎందుకో గాని లొంగదీసుకోవాలి. అణచివుంచాలన్న కోరిక అతనిలో తీవ్రంగా పనిచేస్తోందిప్పుడు. తాను ఉద్యోగం చేసుకునే రోజుల్లో, కులాసాగావున్న రోజుల్లో ఆమె తనూ ఎన్నోరాత్రుళ్లు ఆనం దంగా—అవునుమరి, తానెంత చిరచిర స్వభావంగలవాడైనాగాని, ఆమెతోటి ఆ రాత్రుళ్ళు కులాసాగానే గడిపాడు. తన కోర్కెని ఆమె ఏనాడు తిరస్కరించేదిగాదు. ఆహ్వానించేదిగూడా.

ఆమె తనకి శరీరాన్నంతా అప్పగించి వేసేది. చాలాసార్లు తన కోర్కెల్ని వెల్లడించింది. సంతృప్తి ప్రకటించేదిగూడా. మరి ఇప్పుడామె, అటువంటి కోర్కెలు లేకండానే వుండగలుగుతున్నది! ఏమిటీ తిరుగుడు? తనకీ కాలం బాధతో లేవలేకగాని లేకపోతే తనలో రోజు రోజుకీ పెరిగిపోతున్న వాంఛలు అగ్గిలా దహిస్తు న్నాయి...శరీరం అశక్తమైనా మనస్సూరుకోదుగా? పార్వతి శరీరం మనస్సూ ఒకే స్థాయిలోఉన్నా ఆమె తన కోర్కెల్ని తేణచేసుకోగలుగుతున్నదా?

మరి ఆమెకి మాత్రం వాంఛలులేవా? అప్పుడు ఉన్న కోర్కెలు ఏమైనాయి? ఎలా అణచేసుకుంటోంది? అడ్డమైన చెత్త పత్రికల్లోనూ ప్రకటించే చవకబారు కామసాహిత్యాన్నంతా పొద్దుపోక చదువుతూన్న సాంబశివరావుకు ఇలాంటి వెధవ సంశ యాలు నిరంతరం పీడించసాగాయి.

కాని, పార్వతికి ఇంకో ఆలోచనచేసే తీరికేలేదు. తెల్లారింది మొదలు రాత్రి పది గంటలకు 'అమ్మయ్యా,' అని నడుం వాల్చే వరకూ ఆమెకి నడుం విరిగే పని. చాలా బాధ్యతలతో కూడిన ఆఫీసు చాకిరీ, అంతకంటే భిన్నమైనా ఎంతో జాగ్రత్తగా చేసుకో

వల్సిన భర్త పరిచార్యా, ఇంటిపనులూ ఆమె మనస్సును నిరంతరం ఆక్రమించుకుని—తేరే ఎట్టి ఊహాలకూ తావిచ్చేదిగాదు. అధవా ఎప్పుడైనా పాత జ్ఞాపకాలొచ్చినా, ఎలాగైనా భర్తకు కాలం నయంచెయ్యాలి—అనే జిజ్ఞాసతో ఆమె తిరిగి మొదటి కొచ్చేది.

శారీరక వాంఛల్ని గురించి కొండంతంగా వర్ణించే అనేక పుస్తకాలూ, కథలూ, రచనలూ ఒక యదార్ధాన్ని సాంబశివరావుకి చెప్పలేకపోయినాయి. పార్వతిలాంటి అమాయక వ్యక్తిత్వానికి పరిమితమైన సంతృప్తి ఉంటుందనీ, ఆమె తన కోర్కెల్ని సుల భంగా అణచేసుకోగలదనీ, అన్నీ ఇతర వాంఛలలాంటివే శారీరక వ్యామోహాలూ గనక, వాటినీ ఆమె తేలికగానే విసర్జించుకోగలదనీ సాంబశివరావు తెలుసుకోలేక బాధపడసాగాడు.

ఇలాంటి ఆలోచన పార్వతికి ఎన్నడూ కలగనే లేదనటం గూడా అసహజమే కావచ్చు. ఎన్ని ఆలోచనలున్నా, రాత్రి పడుకునేసరికి అలసటతో ఆమె గాఢమైన సుషుప్తిలో పడేది. ఆమె కోర్కెలు ఒకవేళ కలల్లో కొచ్చేవేమో! ఎప్పుడైనా సాంబశివ రావు లేపితే లేచి, అతన్ని మంచం దిగటానికి సాయంచేసేది. సాంబశివరావుకి పరిచర్యచేయటంలోనే ఆమె మనస్సుకి అపరిమిత మైన శాంతి లభించేది. తిరిగి ఆమె నిద్రలో పడేది.

ఏది ఏమైనా, ఇరవై నాలుగు గంటలూ మంచంమీద వుండి ఏపనీలేక ఎల్లప్పుడూ అవే ఆలోచనలుచేస్తూ సాంబశివరావు మెల్ల మెల్లగా భార్యని గురించి తనలో తాను ఒక సమాధానానికి రావటం కోసం, ఒక అభిప్రాయాన్ని స్థిరపర్చుకోడంకోసం పెనుగులాడ సాగాడు.

ఆర్థికమైన లోటుపాట్లతో ఎప్పుడూ ఎగుడుదిగుడుగా వుంటూ, దినగండంగా గడుస్తూన్న భారమైన సంసార యాత్రలో చిక్కి పార్వతి యాంత్రికంగా ఆలోచిస్తూ, పనులుచేస్తూ ఈడు స్తోంది రోజుల్ని. భర్త ఆలోచనల్ని ఆమె ఏనాడూ గుర్తించనే లేదు. అతను నోరుతెరిచి పలకరించి అడిగితేనేగాని ఆమెకి తెలుసు కునే అలవాటు లేదుగూడానూ.

# 20

గవర్నర్‌పేటలోవున్న ఒక సినిమాహాలు బైట ఆవరణలో కాళిదాసు, ఆయన స్నేహబృందం కూర్చుని కబుర్లాడుతున్నారు. ఇంకా మొదటి ఆట ప్రారంభించలేదు. నగర ప్రదక్షిణానికి వెళ్లిన అడ్వర్‌టైజుమెంటు కారు తిరిగి వొచ్చేదాకా టిక్కట్లివ్వరు. హాలు పాతది. అందులోకి అట్టే కొత్త చిత్రాలు రావు. హాలు కంట్రాక్టుచేసిన సోమయ్య లక్షాధికారి. ఆయన హాలుమీద లాభంవొచ్చే జరగాలన్న నిర్బంధంలేదు గనక పిక్చర్ల విషయం పట్టించుకోడు. ఎప్పుడూ క్లబ్‌లలోనో, స్నేహితుల ఇళ్లల్లోనో కాలం గడుపుతూంటాడు.

మాధవరావూ, కాళిదాసూ, రఘుపతిరావూ, హాలు మేనేజరూ కాయనా, ప్రొప్రయిటర్ సోమయ్య లలా ఒక కుర్చీలో కూర్చుని సరదా తీరేట్టు ఏమేమిటో మాట్లాడుకుంటున్నారు. ఆ బృందంలో మాధవరావు వున్నాడూ అంటే, సందడి కేంలోటు! అతను ఎవర్నో ఒకర్ని ఏదో గేలిచేస్తూ చాలా ఉత్సాహంగా కనపడతాడు.

కాళిదాసు గోల్డు ఫ్లేక్ టిన్ మూతతీసి తలా ఓ సిగరెట్ ఇచ్చి "సోమయ్యగారు! ఇంకా ఈ హాలు కంట్రాక్టు ఎన్నాళ్లున్నది మీకు?" అని అడిగాడు.

సాయంకాలపు మృదువైన ఎండపొడ వాళ్ళమీద ప్రతిఫలిస్తోంది. ఎదురుగావున్న సినిమా స్టిల్సు అంటించిన బోర్డులోని బొమ్మలుగూడా ఎంత పాతవైనప్పటికీ ఎండ కాంతికి తళతళలాడుతున్నాయి. గోడకివున్న పెద్ద హిందీ సినిమా పోస్టర్‌లోని కథానాయకుడి విషాదపు జుట్టు విరబోసుకున్న పోజు మాధవరావుకి చిరాకు కలిగిస్తోంది.

సోమయ్య "ఇంకో రెండేళ్లు మనకిందనే వుంటుంది," అన్నాడు. ఆయన సిల్కులాల్చీ మోకాళ్లదాకా వేళ్లాడేట్టు వేసుకుని సన్నని మల్లు పంచె కట్టుకున్నాడు. మనిషి నడికారు. చాయన ఛాయగా- సన్నగా వుంటాడు.

మాధవరావు "రోజూ ఆ అరిగిపోయిన హిందీ రికార్డులు ఎలా వినగలుగుతారండి ?" అని అడిగాడు వాల్ పోస్టర్నుండి దృష్టి మరల్చి. ఆ రికార్డుల్ని గురించిన ఆలోచనతో అతని మొహం ఆముదం తాగిన వాడల్లే పెట్టాడు.

సోమయ్య నవ్వుతూ "సాధ్యమైనంతవరకు ఆ రికార్డులు పెట్టకముందే వెళ్ళిపోతానండి. నేనున్న రోజుల్లో ఏవైనా మంచి తెలుగు కీర్తనల రికార్డులు నాలుగున్నాయి. అవి పెట్టిస్తాను," అన్నాడు.

మాధవరావు "అదీకారణం మీ రింకా సన్యాసం పుచ్చుకోక పోవడానికి !" అని, కాళిదాసువంక తిరిగి "ఆ పోస్టర్ చూశారండి ? ఆ కథానాయకుడు ఏ పిక్చర్లో వున్నాడని తెలిసినా నేను మాత్రంచస్తే వెళ్ళను ఆ పిక్చర్ కి. వెధవ ! అసలు కథలోకి రావటమే గడ్డలు చింపుకుని మోహం అష్టవంకరలుగా పెట్టుకుని, జుట్టు చిందరవందర చేసుకుని వస్తాడు గొల్లున ఏడుస్తూ! ట్రాజడీ అంటే వాడూ, వాడంటేనే ట్రాజడీ వాడేగనుక కొంపదీసి నవ్వినట్టయితే, ఆపిక్చర్ వారం నడవదు ! అన్నాడు.

కాళిదాసు "నిజమే మాధవరావు! నేనూ చూస్తున్నాను ఈ సినిమాలు ! అందులోనూ హిందీవి కారుడ్రయివర్ లగాయతు జమీందార్ కొడుకువరకు కథానాయకుడైన కథలు ఎన్నో చూశాను. అన్నీ పాచిప్రేమలు ! వాటిని సమర్థించడానికి డమఢక్క పాటలు పన్నెండూ. ఆ కథానాయకులు ఎందుకో గాని గుండయిపోతుంటారు—కథానాయకి తప్పవేరే స్త్రీకి గతిలేనట్టు. చెత్త సినిమాలూ, చెత్త భావాలూను! వీటికంటే 'డీప్' వున్న విషయమే దొరకదా వీళ్ళకి అనుకుంటా ! మన సోమయ్యగారేమిటో అన్నీ ఇలాంటి సినిమాలు తెప్పిస్తారు," అన్నాడు.

సోమయ్య "వీటికే డిమాండ్ జాస్తండి. సమస్యా చిత్రాలు వారం నడవవు. అదే లౌవ్ట్రాజడీ ఐతే ఎంత పాతదయినా మూడు వారాలు వెళ్తుంది. అందుకని మేమెక్కువగా ఆలాంటి చిత్రాలు తెప్పిస్తూంటాం," అన్నాడు.

కాళిదాసు "ఈ హాలుగూడా సరైన కండిషన్‌లో వుండదను కుంటాను ?" అని ప్రశ్నించాడు పశ్చిమాన కుంకుతూన్న ఎండ వంక చూస్తూ. ఆకర్షణీయమైన ఆయన వర్ఛస్సు ఆ తేజస్సులో మరీ ఆకర్షణీయయంగా వున్నది.

దీనికి ఏదో జవాబు చెబుదామని ఆలోచిస్తూన్న సోమయ్య కంటే ముందే మాధవరావు అడ్డంవొచ్చి "మన సోమయ్యగారికి కోపం వస్తుందేమోగాని, మన హాలు గురించి జనం ఏమనుకుంటారో తెలుసా ? 'వినపడుదూ, కనపడుదూ' అని. వొట్టి డబ్బాహాలు. ఈ థియేటర్ గురించి ఎన్ని హాస్య కథలేనా చెప్పుకోవచ్చు !" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

సోమయ్య "సరదాగా వుండేవి నాలుగు చెప్పరాదూ ? వింటాను. నాకు కోపమేమిటి మధ్య" అన్నాడు.

రఘుపతిరావు "సీరియస్ ఫుకార్లుగూడా వొస్తున్నా యండి. ఆడవాళ్ళ బుక్కింగ్‌లో కూర్చుని టికెట్లు అమ్మే అత నెవరో కాస్తపడుచువాళ్ళు కంటికింపుగా వుంటే టిక్కెట్టు డబ్బులు తీసికొంటూ అరిచేతులు గీరటమూ, చేతులు వొత్తటమూ చేస్తున్నాట్ట ! ఏమిటీ ఘోరం ?" అని అడిగాడు.

హాలు మేనేజర్ "మాతో ఎవరూ అనలేదే ! అంత కక్కుర్తి ఏమిటి అయినానూ ! దానివల్ల ఏం వొరుగుతుంది ?" అని ప్రశ్నించాడు ఆశ్చర్యపడుతున్నట్టుగా.

"మీకు తెలియదండి. అక్కడికి అతని ఆత్మ కొంతయినా సంతృప్తి పడుతుందన్నమాట. మీరేం సిగ్గు పడకండి. చాలా ఊళ్ళల్లో థియేటర్ల బుకింగుల్లో జరిగేదే ఇది. ఒక్కొక్కసారి ఈ గీరడం—వగైరా తన్మయంలోపడి, అవతలి వ్యక్తి కరోడా అయి కాస్త నవ్విందా, రూపాయి చిల్లరకు పదేసి రూపాయల చిల్లరఇచ్చేసి చివరికి నెత్తిగొట్టుకునే వాళ్ళెందరో వున్నారు !" అన్నాడు మాధవరావు.

"ఆ బుకింగ్‌లో ఎవరు కూర్చుంటారేమిటి ?" అని ప్రశ్నించాడు కాళిదాసు మానేజర్‌ని ఉద్దేశించి.

"దానికని క్లర్కు నెవర్ని పెట్టలేదండి. సోమయ్యగారి చుట్టం ఒకాయన రెండుషోలకు నేనే టిక్కెట్లు అమ్ముతానని బలవంతానా ఆ ఉద్యోగం నెత్తిన వేసుకున్నాడు. అతను 'దుర్గా ఆటోమొబైల్సు' కంపెనీలో పనిచేస్తూ, సైడపనిగా ఇది ఒకటి వొప్పుకొని చేస్తున్నాడు – పదో పదిహేనో వస్తుందిగదా అని! ఈపాటికి వొచ్చే వుండాలి. ఏదైనా ఆలశ్యం అయిందేమో ఇంకా రాలేదు," అన్నాడు మేనేజర్.

కాళిదాసు నిదానంగా ఏమిటో ఊహిస్తూ "అతనిపేరు ?" అని ప్రశ్నించాడు.

"కాంతారావు !" అన్నాడు మేనేజర్.

"ఊహుఁ! అతన్ని ఆ మధ్య చూశానులే వాళ్ళ కంపెనిలో. ఆడవాళ్లని చూస్తే సరి, ఎండిన చెరుకుగెడల్లే టంగున బిగుస్తాడు. వెధవ పోజులన్నీ పెడతాడు."

వాళ్ల సంభాషణ జరుగుతూవుండగానే కాంతారావు రానే వచ్చాడు కాలు ఎత్తెత్తి వేసుకుంటూ. అతను బుకింగ్ లోకి వెళ్లిం తర్వాత అక్కడ కూర్చున్న వాళ్ళందరూ ఒకరు మొహాలొకరు చూసుకున్నారు. చివరికి మేనేజర్ "అతన్ని ఏమనాలో తోచకుండా వుందండి," అన్నాడు మాధవరావువైపు తిరిగి.

"ఏమీ అడగవద్దు. ఎవతోగట్టి అమ్మాయి పైటికిలాగి చెంప చెళ్లుమనిపిస్తుంది. వొదిలి పోతుంది!" అన్నాడు మాధవరావు.

"అంతే లెండి. వెధవ గోల. మనం ఇప్పుడు అతన్ని అడిగినా రుజూచెయ్యలేంగదా! పోనీండి," అన్నాడు ప్రొప్రయిటర్ రికార్డులు వేసే సమయం కావటంతో అందరూ లేచారు.

## 21

ఆవేళ కంపెనీకి మామూలుకంటే చాలా పెందలకడే వచ్చాడు హెడ్ క్లర్కు కైలాసం. దానికి కారణం వుంది. ఆయన ఇటీవల దస్కతులుపెట్టి పంపుతున్న పైల్సు కాయితాలలో సగానికి పైగా పార్వతి చేసిన పనిగానే వుంటున్నాయి. గుమాస్తా లందరూ ఎవరి పని వారు సక్రమంగా చేసుకు పొయ్యేటట్టయితే

ఆమె కింత పని వుండవల్సిన అవసరం వుండదు. యథార్థం ఆలో చిస్తే కైలాసం ఈ పాతిక ముప్పైఏళ్ళ కంపెనీ అనుభవం లోనూ, ఇంత వోపికగా పనిచేసే మగవాడెవడూ ఆయనకు కన్పించి వుండలేదు. ఇంతా చేస్తే ఆమెకి ఇరవై—ఇరవైఒక్క ఏళ్ళే వున్నాయి. ఆమె పరిస్థితులు! అవి విన్నకొద్దీ కైలాసం కెంతో జాలిగొల్పేవి. ఇంతకీ ఆమె నోరువిప్పి తననుగురించి తాను ఒక్క మాటా ఏనాడూ మొరపెట్టుకోనేలేదు. కైలాసానికి తెలిసిన వంతా కాళిదాసు చెప్పినది.

సహజంగా రోజూ పదకొండింటికి వొస్తూ వుండే కైలాసం వేళ ఎనిమిదింటికే ఆఫీసు కొచ్చాడు. ఆయన గుమాస్తాల టేబిలుస్మీద వుంటూవుండే ఫైలుస్నూ, లెక్కల పుస్తకాలనూ తెరిచి చూస్తూ పరిశీలించసాగాడు. తామే చేస్తేగాని వీల్లేని పను లను మినహాయించి, మిగతా చిల్లరమల్లర పనులనూ, లెడ్జర్‌లలోకి ఎక్కించవల్సిన లెక్కలనూ, మిగతా ముగ్గురు గుమాస్తాలూ, పార్వతి నెత్తిసే రుద్దుతున్నారనేది హెడ్‌గుమాస్తాకి తేటతెల్లంగా బోధపడింది. అది వాళ్ల నైజమే గూడానూ. కొత్తగా వొచ్చిన వారి నెత్తిన పాతవారు తమ పనులనుగూడా రుద్దడం ఆయన ఎరి గున్నదే. పార్వతికి పనిభారం చాలా ఎక్కువగా వున్నదని ఆయన గుర్తించాడు. ఆమె కొన్ని కాయితాలు ఇంటికి తీసుకెళ్లి తెల్లారి తెస్తూవుండడమూ, ఆఫీసు కొచ్చింది లగాయతు వొంచిన తలెత్తకుండా పనిచేస్తూనే వుండడమూ, మిగతా గుమాస్తాలు తమలో తాము గుసగుసలాడుతూవుండి గడియారం ముల్లువంకే చూస్తూ వుండడమూ ఆయన కనిపెడ్తూనే వున్నాడు. కాని, తాను పార్వతిని వెనకేసుకొచ్చి మాట్లాడ్డంగూడా కొంతవరకు ఇబ్బందిగానే పరిణ మిస్తుంది.

ఆమెకని కొంత పనిని ప్రత్యేకించడమూ సాధ్యంకాదు. ప్రతి పనినీ నలుగురూ తణిఖీచేసి పంపే ఏర్పాటున్న పెద్దపెద్ద ఆఫీసులలో అలాంటి పని పంపిణీ సాధ్యంకాదు. ఎవడి ధర్మం వాడు గుర్తించి, వ్యవహరిస్తే తప్ప—కొంచెం మానవత్వం ప్రదర్శించే

వాళ్లుంటే తప్ప-అమాయకుల కా పరిస్థితులలో పనిభారం ద్విగుణీ కృతం కావడం తప్పనిసరి.

కైలాసం తన పరిశీలన ముగించి వొచ్చి తన స్థానంలో తాను కూర్చున్నాడు ఆలోచిస్తూ. తాను కొత్తగా చేరిననాటి స్థితులూ ఇవే. అయినా ఇంత అన్యాయం లేదు. ఇద్దరు చెయ్యవలసిన పని ఒక్కర్తె చేయటం కష్టసాధ్యం. పైగా ఆమెకి ఇంటెడు చాకిరీ. కుంటిమొగుడు సేవ. పాపం, అక్కడా నోరెత్తకుండా పని చెయ్యాలి; ఇక్కడా నోరెత్తకుండా పని చెయ్యాలి. కైలాసానికి జాలితో పాటు ఆశ్చర్యంగూడా కలిగింది పార్వతిని గురించి తలుచుకున్నప్పుడు.

ఆమె కింత ఓపికనిచ్చిన ప్రోద్బలం ఏది? భర్తా లేక ఆమె పరిస్థితులా? దారిద్ర్యమా? లేక కొందరికి పుట్టుకతోటే అబ్బే ఓర్మి, సహనమా? కైలాసం ఇవన్నీ ఆమెలో వున్నాయి అనుకున్నాడు. లేక ఆమె పెంపకమే అలాంటిదేమో!

పార్వతి ఉద్యోగంలో చేరిన రెండు నెలలో ఇదివరలో పేరుకుని వుండిన పాతలెక్కలు, ఇన్‌కంటాక్సు వ్యవహారాల కాయి తాలపని సగానికిపైగా వొదిలించేసింది. అవన్నీ యాంత్రికంగా చేసే పనులే అని సుబ్బారావు దాన్నంతా ఒకనాడు తేలికగా కొట్టేశాడు గాని, నిజానికి అదేపనిని అతనికి అప్పగించి వున్నట్టయితే అది ఆర్నెల్లకు తేలినా తేలనట్టే నన్నసంగతి హెడ్‌క్లార్కుకు బాగా తెలుసు.

ఆ పనులకి తదేకదీక్షా, యంత్రంలాగా తప్పులుపోకుండా జాగ్రత్తగా చేసుకు పొయ్యే మొండితనం వుండాలి. ఇటువంటి పనులకు అమాయకులైనా కావాలి, లేదా బాధ్యత పూర్తిగా నెత్తిన వేసుకున్న వారైనా కావాలి.

పార్వతి మొదటిరకమో, రెండోరకమో తేల్చి చెప్పడం కష్టం. ఆమె తెలివి తేటలు లేని మొద్దు అని కొంతకాలం కైలాసం కూడా ఆమె మౌనప్రవృత్తి ననుసరించి అనుకొన్నాడు. ఆమె అమాయకురాలు, ఆమె సూక్ష్మగ్రాహి అని ఏర్పడ్డాకనూ, పనిలో ఆమె ఒక్కొక్క సందర్భంలో చూపిన చొరవనూ,

స్వతంత్రబుద్ధిని బట్టి ఆమె నివురుగప్పిన నిప్పు సుమా—అని గ్రహించాడు కైలాసం. ఆమె పట్ల గలిగిన ఈ విశ్వాసాల్ని యజమానికి వీలుదొరికినప్పుడల్లా చెప్పడాని కాయనేమీ వెనకాడలేదు. అయితే, ఆమె కతను చెయ్యగల సాయం ఏమిటి? ఊరికే సానుభూతి చూపించేవాళ్లు చాలా మంది వున్నారు. తానూ అంతేనా? అంతకు మించి తాను చెయ్యగలిగిందేమీలేదా? ఈ పని భారాన్ని ఆమె నించి తానిప్పుడే గనక తప్పించే చర్యలు తీసుకోనక పోయినట్టయితే తాను పనిమీద పొరుగూళ్లు వెళ్ళవల్సినప్పుడు, ఈ యువకాగ్రేసరులు హాయిగా ఆమె నెత్తిన మరికొంత పనిని నెట్టి, తాము తప్పుకోగలరు. అందులో సందేహంలేదు.

ఈ నాటకానికంతా పరోక్షంగా సుబ్బారావు చాలావరకు కారణం. అతను జల్సారాయుడు. పనిని తప్పించుకు తిరగాలనే ఈడుసే వున్న బ్రహ్మచారి. అతన్ని గనక పట్టుకుని కొంచెం మందలిస్తే మిగతా యిద్దరుగూడా దారికి వస్తారు. కైలాసం దానికి ఒక పద్ధతి నిర్ణయించుకున్నాడు. ఈ క్షుద్ర వెధవలకి ఆ అబల స్థితి గతులూ, ఆమెకున్న అపారమైన ఇంటి పని భారమూ, ఆ వ్యవహారాలు బొత్తిగా తెలియవు. తాను కొంచెం విప్పి చెబితే తెలుసుకోరా — అనే ఆశ కలిగిందాయనకి. ఇందులో పార్వతిని సంప్రదించవల్సిన అవసరమేమీలేదు. ఆమెకి తానేదో విధంగా సాయం చెయ్యాలన్న గాఢవాంఛ పిల్లలుగల కుటుంబీకుడూ, సహజంగానే మంచి స్వభావముగల కైలాసానికి కలిగింది.

కైలాసం గంట గంటన్నర ఊరికనే కూర్చోలేక పత్రిక చదువుతూ కాలం గడిపాడు. ఆఫీసుకి ఎవరు ముందొచ్చేదీ ఇవ్వాళ తేల్చుకోవాలనుకున్నాడాయన.

పదిగంటలకు పదిహేను నిమిషాలుందనగానే సుబ్బారావు సెంటువాసన గుబాళిస్తుండగా చాలా స్టయిల్‌గా నడిచివచ్చాడు ఆఫీసులోకి. హెడ్‌క్లార్కుకి ఇది ఎంతయినా ఆశ్చర్యం గొల్పింది. సుబ్బారావేనా అందరికంటే ముందు రావటం! గడియారమేమైనా తప్పుగా నడుస్తోందామోనని గూడా అనిపించిందాయనకు. అసలు కారణం ఆయన కెలా తెలుస్తుంది?

ఆయనను సుబ్బారావుగూడా ఓరగంటితో చూసి ఆశ్చర్య పడ్డాడు. హెడ్ క్లార్కు అందరికంటే ముందుగా ఆఫీసు కివ్వాళ రేంచెయ్యటమంటే అతని పరిభాషలో 'ఏదో కొంప మునిగిందన్న,' మాటే! సుబ్బారావుకే గాదు, అక్కడ పనిచేస్తున్న మిగతా ఇద్దరికీ గూడా హెడ్ క్లార్కంటే అర్థంలేని ఒక అవిశ్వాసం మనస్సులో నాటుకొని వున్నది. ఆయన తమమీద లేనిపోనివన్నీ యజమానితో చెబుతాడనీ, తమ జీతాలు యథాప్రకారంగా వుండటానికి ఆయనే కారణమనీ, అప్పుడప్పుడు యజమాని ఏవో సంజాయిషీలు అడగ డానికి, మందలిస్తూ వుండటానికి ఆయనే కారణమనీ వాళ్ల ఊహ. అంతేగాని, కంపెనీ సవ్యంగా నడవడానికి పనులు, సక్రమంగా జరిగి పోవాలన్న ఉద్దేశంతోటి తమ కప్పజెప్పబడిన బాధ్యతలను క్రమం తప్పకుండా నెరవేరుస్తూన్న సందర్భంలోనే హెడ్ క్లర్కు తాము చేసే తప్పుల్ని సవరించి, చాలా భాగం యజమానిదృష్టికి పోకుం డానే—గత్యంతరం లేకపోతే తప్ప—అలా వ్యవహరిస్తున్నాడని వాళ్లు చచ్చినా వొప్పుకోరు. వాళ్లకి కైలాసమంటే ఏదో అకారణమైన గుర్రు. ఈ గుర్రుతోటి ఆయన ముందేమీ చెప్పనైనా చెప్పకండా ఆఫీసుకి అకస్మాత్తుగా వేళకిముందే హాజరుగావటాన్ని జోడించి ఆలోచిస్తూన్న సుబ్బారావు కడుపులో, ఏదో తిప్పడం ప్రారంభిం చింది. అది అకారణమే ఐనా, ఏదో గుండెదడ సాగింది అతనిలో

దీనికి తోడు ఫైళ్ళు కదిలించినట్టుగా కన్పించాయి. సుబ్బా రావు ఎలాగో మనస్సును సరిపెట్టుకుంటూ తన టేబిల్ ముందు కూర్చుని పని ప్రారంభించబోతుండగా "సుబ్బారావు! ఒకసారి ఇలా వస్తావు?" అని కైలాసం పిలవడంతోటే సుబ్బారావుకి నిజం గానే 'ఏదో కొంప మునిగింది,' అని బలంగా తోచడమూ, అతను బరువెక్కిన గుండె దిటవు చేసుకుని, "వొస్తున్నానండి," అని బయల్దేరటమూ జరిగాయి.

హెడ్ క్లర్కు టేబిల్ వానుకుని నుల్చున్నాడతను. కైలాసం లోకి సూటిగా చూడ్డానికి అతనికి భయం, బిడియమూ. ఎదురుగా వున్న కిటికీలోకీ, శేదా గోడలమున్న వైర్లెస్ కంపెనీ కేలండర్ల వైపూ చూస్తున్నాడతను.

కైలాసం ఇతర గుమాస్తాలూ, పార్వతీ రాకముందే సుబ్బా రావుతో పార్వతి సంగతి హెచ్చరించాలని వుద్దేశించి అతన్ని పిలిచాడు. ఆయన కళ్లజోడుగుండా తీక్ష్ణంగా సుబ్బారావులోకి చూస్తూ "ఇదివరకులాగా కాకుండా ఫైల్సు నీటుగా వుంటున్నాయే సుబ్బారావు! ఇన్‌కంటాక్సు లెక్కలు పూర్తిచెయ్యడానికి గడువు దగ్గిరబడింది తెలుసా? మిగతా వర్కుగూడా చకచక పూర్తి చెయ్యాలి!" అని ఎత్తుకున్నాడు.

సుబ్బారావు నీళ్ళు నములుతూ "అలాగేనండి," అన్నాడు. ఇంతటితో వెళ్లమంటే బాగుణ్ణు అనిపిస్తోంది అతనికి. కొద్దిగా కాళ్లు వొణుకుతున్నాయేమో గూడాను.

"అలాగే ననటం తేలిక. ఇంకో నెల చేసినా ఈ పని అయ్యేట్టు నాకేం తోచటంలేదు సుబ్బారావు! ఎలా సమర్థిస్తామోగాని! అది సరేగాని, మన టైపిస్టు అమ్మాయి వుందే, ఆమె పనిగురించి నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడాయన ఊరికే అభిప్రాయం అడిగే వాడిలా సామాన్యంగా గొంతుపెట్టి.

సుబ్బారావు కీ ప్రశ్న కొరకరాని కొయ్యగా తయారైంది. ఏం చెప్పడం? నిజం చెప్పాల్సివస్తే ఆమె ఇద్దరి పనిచేస్తున్నదిప్పుడు. తాము చెయ్యవల్సి పనులనుగూడానేమో...ఆ విషయం పసిగట్టే ఈ ప్రశ్న అడుగుతున్నాడా యేం ముసలాడు? సామాన్యుడా మరి! ...లాంతకుడాయెను...సుబ్బారావు ఒకవైపు ఆ లోచిస్తూనే, నెంజుతూ నసుగుతూ, "బాగానే చేస్తున్నదండి..." అన్నాడు. ఇంకేమనాలో తోచలేదుగూడా అతనికి.

కైలాసం సుబ్బారావువంక కొంచెం తీవ్రంగాచూస్తూనే "మీరు ముగ్గురూకూడా ఆమెకి పని బాగానే నేర్పుతున్నారల్లె వుంది. కాదూ?" అన్నాడు ఏ భావమూ వ్యక్తంగాని గొంతు పెట్టి. సుబ్బారావు "ఏదో...మాకు తెలిసినంతవరకూ," అని నసి గాడు. సంభాషణ ఏదోగూడార్థాల్లోకి పోతున్నట్టుగా తోస్తోం దతని ప్రాణానికి.

"అదికాదోయ్ సుబ్బారావు! ఆఫీసువర్కులో సగానికి పైగా ఆమే చేస్తున్నట్టుగా నాకు కనిపిస్తోంది. అందుకడిగానులే.

ఇటుచూడు. నావంకచూడు మరి!" అని నిలదీసాడు కైలాస మతన్ని. సుబ్బారావు కిటికీలోంచి బైటకిచూడ్డం బలవంతాన మానుకొని హెడ్‌గుమాస్తా వైపు తిరిగాడు.

"ఆమె పరిస్థితులేమిటో నీకు తెలుసు ననుకుంటాను?" అని మొదలెట్టాడు కైలాసం, ముక్కుపొడుము డబ్బాలోంచి ఒక చిటికెడు ఎడమ అరచేతికి వేసుకుంటూ.

"నాకేమీ తెలియదండీ," అన్నాడు సుబ్బారావు సంశయాస్పదంగా.

"ఏమీ లేదు. పాపం, ఆమెభర్త ఫ్యాక్టరీలో చక్రం కిందపడి కాళ్లు విరగొట్టుకున్నాడు. ఈ భార్యతప్ప అతనికి వేరే దిక్కులేదు. ఈమెకి ఆ కుంటి భర్తే గతి. బొత్తిగా జరుగుబాటులేక ఆమె మన ఆఫీసులో చేరింది. ఆమెకి అటు ఇంటెడు చాకిరి. ఇటు ఆఫీసులో గూడా—తనపనేగాకుండా మీ అందరిపనులూ ఆమెనెత్తినే వేస్తే, ఎలాచెప్పు? న్యాయమా?" అని అడిగాడు కైలాసం పొడుం పీల్చడానికి వ్యవధికోసం ఆగి. ఆయన గొంతుకలో మందలింపూ, ఆలోచించండి అన్న హెచ్చరికభావమూ రెండూ మిళితమై వున్నాయి.

సుబ్బారావు చాలా శ్రద్ధగావిన్నాడు ఈ మాటల్ని. పార్వతిభర్త కుంటివాడా? లేవలేనివాడా? నిరుపయోగమైన వాడా? అందుచేత ఆమె పనిలోకివచ్చిందా?...అతను ఆలోచిస్తూనే, తనను తాను సమర్థించుకోవాలి గనక "ఆమెకి మా పనులు గూడా తెలుసుండాలనిలెండి...అయ్యో పాపం! ఇవ్వాళ్లనించి... ఆమెకి సాధ్యమైనంతవరకు పని తగ్గేట్టు చూస్తాంలెండి. ఈ వ్యవహారాలన్నీ మాకెలా తెలుస్తాయి? ...ఒక్కమాట అడగనా... కోప్పడకుండా వుంటారూ?" అన్నాడు అతను.

"అడగవోయ్?" అన్నాడు కైలాసం.

"ఆమె భర్తపేరు?" అని అడిగాడు సుబ్బారావు మేడ మెట్లమీద అలవాటువల్ల అడుగుల చప్పుడునుబట్టి, వచ్చేది పార్వతి అని గుర్తిస్తూ.

"ఏమోనోయ్, నాకూ సరిగ్గా తెలియదు. సాంబ... సాంబ
శివరావు అనుకొంటాను. నే నతన్ని చూడలేదులే. ఇక్కడికి వస్తా
వుంటారే కాళిదాసుగారు! ఆయనచెప్పగా విన్నాను," అన్నా
డాయన.

"సరేలెండి," అంటూ తనకుర్చీవైపుగా జరిగాడు సుబ్బా
రావు.

"నేనుచెప్పింది జ్ఞాపకం వుంచుకో" అన్నాడు కైలాసం.
ఈలోగా పార్వతి లోపలికివచ్చింది. రావటం హెడ్ క్లర్కుని
చూసి, తలవొంచి, నమస్కరించి, చిరునవ్వునవ్వి, తన టేబిల్ దగ్గి
రకి వెళ్లి కూర్చుంది. "మంచిది, మంచిది," అన్నట్టు తలవూపాడు
కైలాసం మందహాసంచేస్తూ.

సుబ్బారావు తలెత్తి ఆమెవంక చూశాడు. నీలంరంగు
వాయిల్ చీర కట్టింది. అదేరంగు రవిక తొడిగింది. నాలుగు ఆకు
పచ్చగాజులు కొత్తగా తొడిగించుకునివుంది ఆమె. నొసట కుంకుమ
బొట్టు ప్రకాశిస్తూంది. ఆదుర్దాగా నడిచిరావటంవల్ల గాబోలు
రొమ్ములు కొంచెం దడదడలాడుతున్న కదలిక స్వల్పంగా కనిపి
స్తోంది.

సుబ్బారావు ఆలోచనలు ఆమెవైపు సాగుతున్నాయి...
ార్వతి పరిస్థితుల వొత్తిడివల్ల ఉద్యోగంలో చేరిందని తన కిది
కే కొంతవరకు తెలుసును. కాని...సుబ్బారావుకి పార్వతి భర్త
ంటివాడని రూఢిగా తెలియడం ఇదే ప్రథమం. ఈ మామూలు
వార్త ఎందుకనో సుబ్బారావు చెవిన అమృతప్రాయంగా సోకింది.
అతని మనస్సెందుకో ఈ అల్పసంతోషంతోటి గంతులువేయసాగింది.

దీనికితోడుగాకాంతారావూ, సుబ్రహ్మణ్యమూగూడావొచ్చి
తమతమ కుర్చీల్లో కూర్చున్నారు; కాంతారావు తన ముందున్న
ఫైల్సు తిరగేసి చాలా సన్ననిగొంతుకలో "ఏమిటిరా సుబ్బారావు!
ఇవ్వాళ ముసలాడు పెందరాలే వచ్చాడు," అని ప్రశ్నించాడు.

సుబ్బారావు "తర్వాత చెబుతాలే," అన్నాడుగాని, అతని
వరకు ఇప్పుడే చెప్పెయ్యాలని వున్నది. సుబ్బారావు పార్వతి గురించి
తనలో తాను పెంచుకుంటున్న భావాల పరిణామాలకు ఈ వార్త

ఎంతో అనువుగా తోచి నీళ్లుపోసి పెంచినట్టయింది. భర్త కంటి కాడా? అదీ మొదట్నించి కాదు...మధ్య—ఈ మధ్యన్నమాట... ఒక యౌవ్వన స్త్రీ నాలుగైదు నెలల్నించీ నిరామయంగా వుంటుం దంటే సుబ్బారావు చదువుతున్న కాముక పత్రికల వర్ణనలను బట్టి ఆమె ఉద్రేకాలతో ఊగిపోతున్నదన్నమాటే. కాదూ?

ఆమె తలెత్తకుండా కూర్చున్నదంటే అది పని వొత్తిడివల్ల ఐవుంటుంది. ఆమె మాత్రం ఏం చేస్తుంది? డబ్బులు అవసరం...ఈ ఆలోచన రాగానే సుబ్బారావుకు ఇంకో పరమసత్యం గోచరించి నట్టయింది. ఉద్యోగం చేస్తేనేగాని, నెలల్లా కష్టపడితేనేగాని కంట బడని రూపాయలు ఇంకోవిధంగా సులభంగా లభిస్తే...ఎంత చక్కగా వొప్పుకోవచ్చు...కమ్మని ఆలోచన.

సుబ్బారావు తనలో తాను సంతృప్తిపడుతున్నాడు. ఆమెకి తాను సాయపడ్డట్టుగా వుండాలని అతని ప్లాను. దాంతో అటు హెడ్ క్లార్కు మంచితనాన్ని, ఇటు పార్వతి ప్రేమనీగూడా సంపాయించుకోవచ్చు. ప్రేమ అన్న శబ్దం మనస్సులో ఉద్భవించ గానే అతనివంటి యువకులకు తోచే దృశ్యాలు సామాన్యంగా శారీ రిక సంబంధాలే ఐవుంటాయి. అతని దృష్టి ఎంతసేపటికీ ఆ వైపే వెళ్తుంటుంది. అందువల్లనే అందుబాటులో వున్న స్త్రీనే గురిచు కుని అదేపనిగా గాలిమేడలు కట్టూవుంటాడు సుబ్బారావు. అయ్ని మైతే ఇంకో స్త్రీని ప్రేమించడానికి అభ్యంతరం లేకపోవటైన గూడా అందువల్లనేనేమో.

సుబ్బారావు, ఆవేళ మధ్యాహ్నం ఇంటర్ వెల్ లో కాంతా రావుకీ, సుబ్రమణ్యానికీ హెడ్ క్లార్కు ఆదేశాన్ని వినిపించాడు, వివరించాడు. శిరసావహించాలన్నాడు. తాను మనఃపూర్తిగా ఆ అమ్మాయికి తోడ్పడతానని చెప్పాడు. కాంతారావూ సుబ్ర హ్మణ్యమూ అతన్ని అనుసరిస్తామన్నారు. వేరే వాళ్ళు అనేదేముం టుంది? అందులో కష్టంగూడా లేదు. తమ పనులు తాము చేసు కోటం మినహాయించి అదనపు కష్టమేమున్నదందులో?

సుబ్బారావు ఆరోజే పార్వతి ఇంటికి వెళ్లే సమయానికి సిద్ధంగావుండి, ఆమెకి తెలియకుండా ఆమె ననుసరించాడు. సాయం

కాలపు చీకట్లు ఆవరిస్తున్న సమయానికి సుబ్బారావు మెల్లగా పార్వతికి ఫర్లాంగుదూరంలో అనుసరిస్తూ, ఆమె ఇల్లు ఏదో చూసుకుని, కొంచెం పైకిపోయిపదినిమిషాలు వీధిమలుపులో నిలబడి, దీపాలు పెట్టాక తిరిగి వొచ్చాడు.

అప్పటికి పార్వతి లోపలకి వెళ్లి వంట చేసుకుంటోంది. హాస్పిటల్ రోడ్డువీధి దీపాలున్నా చీకటిగానే వున్నది. పార్వతి ఇంటిముందు దీపం లేకపోవడంతో మరీ చీకటిగా వున్నది. ఇంటి వాకిలి దగ్గిరే సాంబశివరావు మంచంమీద పడివున్నాడు. సుబ్బారావు రెండునిమిషాలపాటు ఈ దృశ్యాన్నంతా నిదానంగా చూచుకొని బైలుదేరాడు. అతని మనస్సులో ఎక్కడలేని ఆనందమూ కలిగింది. తన కోర్కెలు త్వరగా, సులభంగా ఈడేరుతాయి అనే నిశ్చయాని కతను త్వరగా వొచ్చేశాడు.

## 22

కోటిలింగం షాపులో కూర్చున్నాడు సుబ్బారావు మర్నాటి ఉదయం. టెయిలర్ కోటిలింగమూ, అతని తమ్ముడూ, సుబ్బారావూ ముగ్గురే వున్నారక్కడ. ఉదయపు చలి ఇంకా పూర్తిగా వొదల నీ ఎండ కటకటాలనుండి కుట్టవల్సిన గుడ్డలమీదా, కుట్టి ~~ర్ముతూవున్న పరికిణీల, రవికలమీదపడి మనోజ్ఞంగా మెరు ~~ంది. సుబ్బారావు ఎండపొడలోనే కూర్చుని, "ఈ తడవగూడా ~~ఇధవ ఎస్-క్రాస్‌వర్డ్సు తప్పేసిందోయ్. అన్నీ పన్నెండు తప్పులూ, పదమూడు తప్పులున్నూ!" అన్నాడు బాధగా. జేబు లోంచి తిక్కిరిబిక్కిరిగా సిరా గీతలు పెట్టిన నకలు కాయితం తీసి బైట పడేశాడు. కోటిలింగం దాన్ని ఒకసారి చూసి "పదహారు తప్పులూ—పొరపాటు, రివర్సు ఆల్ కరెక్టు!" అన్నాడు మంటగా. క్రాస్‌వర్డ్సులో సుబ్బాలోవు ఐదు తగలేశాడంటే అందులో సగం కోటిలింగానిది మరి. "ఉండరా కోటిలింగం! ఈ తడవ మనం ఎస్-క్రాసువర్డ్సు మానేసి, వేరే ఏదైనా కంపెనీకి ట్రై చేస్తాను చూడు! మొదటి ప్రైజు మనదే," అన్నాడు ఉషారుగా.

ఇంతలోకే శివరామయ్య వొచ్చాడు చక్కగా ఉతికిన నీరు కావి పంచెకట్టు, లాంగ్‌క్లాత్ చొక్కా తొడుక్కుని, అతనూ

వొస్తూ వొస్తూనే మొదటిప్రైజు అన్నమాట విన్నాడు గాబోలు, "మీరు కట్టినదానికి ప్రైజు వచ్చిందా ఏమిటి! పదండి టీపార్టీ చేద్దురుగాని!" అంటూ కూర్చున్నాడు కటకటాల కానుకుని.

కోటిలింగం "వుండవోయ్ ముండమోపి డబ్బులుపోయి మేం ఏడుస్తూంటే నీదో సరసం మధ్య. మొగుడుపోయి ఏడుస్తూంటే గంకు మొగుడొచ్చి రాళ్ళేసినట్టు!" అని విసుక్కున్నాడు.

"ఈ కోపంలో చొక్కాగుడ్డ రవికగా కత్తిరించేసేవు- అపాయం! అదిసరేగాని సుబ్బారావు! నీవేదో ఈమధ్య క్షేమా: వంకాయలూ అని కలవరిస్తూ తిరుగుతూంటిషే, ఏమైందా వ్యవహారం?" అని శివరామయ్య సుబ్బారావువైపు మళ్ళాడు.

సుబ్బారావుకి సంతోషంగానేవుంది పదిరూపాయల క్రాస్ వర్డ్సులో పోవటంవల్ల. అయినా వెధవ పదిరూపాయల కోసం కోటిలింగ ఇలా అయిపోతున్నాడేమిటి?... అతనికి నంటగా వున్నది. సుబ్బారావు శివరామయ్య వైపుతిరిగి "ఏంటిరా వీడు! నా వంతు ఐదుపోయింది. నేనేమన్నా అనుకుంటున్నానా? తనవంతు ఐదు పోయింది. ఏం పోతే? ఇంకోతడవ దేన్లోనన్నా సెకండ ప్రైజువస్తే 'లంప్' రాదూ? కొట్టెయ్యడా?... వీడికి చెపుతేరా," అన్నాడు. ఇన్నై.

కోటిలింగం కోపంకొద్దీ రవిక కత్తిరిస్తున్నవాడల్లా వదిన్న ఎదురుగా బల్లమీదపడేసి "ఇప్పుడు పోయిన ఐదు తిరిగిరాదుగ... ఏంటో వేదాంతం చెబుతాడేంటి వీడు? మళ్లీ అందులోకి దిగి డబ్బు కట్టడానికి బుద్ధివుండాలి...సుబ్బారావు! ఇకముందు నువ్వేకట్టుకో నాయనా?" అనేశాడు విక్కచ్చిగా.

వెంటనే సుబ్బారావు జేబులోంచి 'తిరుపతి క్రాస్ వర్డ్స్' 393 వ బంపర్ ఆఫర్ కాయితం బైటికితీసి "ఇందులో మూడు లక్షల ముప్పైవేలు బహుమతి! అరుతప్పులున్నా వందకు తక్కువరాదు. కోటిలింగం! ఊరికే కోప్పడకు. నీ వంతూ నేనే వేసుకుని కడతాను. సరా! నీ పేరనే కడతాను. వొస్తే చెరిసగం—పోతే నాది! ఈ వెధవ డబ్బులకోసం మన మొగాలు ఆముదంతాగిన వాళ్ళలా పెట్టుక్కూచుంటామటోయ్!"...అన్నాడు సర్దుబాటుగా.

ఈ దెబ్బతో కోటిలింగం ప్రతిజ్ఞ చల్లారిపోయింది. "పోనీరా సుబ్బారావు! రాత్రింబగళ్ళూ కళ్ళు కాయలుకాసేట్టు మేల్కొని గుడ్డలుకుట్టి సంపాయించే డబ్బు అది. అందువల్ల ఉచితార్థంగా పోతే కాస్త మంటగానే వుంటుంది," అన్నాడు. మళ్లీ మాట మార్చడం కోసం "అబ్బబ్బ జనవరి నెలలో ఇంత చలేమిటిరా," అన్నాడు.

శివరామయ్య "చలికాలంలో చలేగా. పర్వాలేదుగాని, కోటిలింగం! కాఫీ తెప్పించవోయ్. గొంతులో కఫం కరగలేదు. వేడికాఫీ తాగితేగానీ వూపిరాడదు," అన్నాడు. సుబ్బారావు గూడా "రెండుకాఫీ తెప్పించరా ముగ్గురం సర్దుకుందాం," అన్నాడు.

ఐదు నిమిషాలకల్లా పొగలొచ్చే రెండు కాఫీ లొచ్చాయి. ముగ్గురూ పంచుకున్నారు. కొంత స్తిమితం చిక్కినమీదట సుబ్బారావు సిగరెట్టు వెలిగించి, ఒకనిమిషం ఏదో గాఢంగా ఆలోచించి, "కోటిలింగం! మా ఆఫీసులో పనిచేస్తోందే అమ్మాయి! దాని మొగుడు మనకి తెలిసినవాడేనోయ్," అన్నాడు ఉన్నట్టుండి.

"అలాగా!" అన్నాడు కోటిలింగం ఆసక్తిలేకుండా.

"అవునురా. సాంబశివరావు అని మాతో హైస్కూల్లో ఫోర్తుఫారందాకా ఒకే సెక్షన్‌లోనే చదివాడులే. వాడిది ఈవూరే. నీళ్ళ ముసలమ్మ మనవడు ఆ కేవాళ్ళంతా. ఆ ముసలమ్మ పెద్ద పెద్ద వాళ్ల ఇళ్ళకి కృష్ణనించి రోజువారిగా నీళ్లుమోసి తెచ్చి సంపాయించి వీణ్ణి పోషించిందిలే," అన్నాడు.

శివరామయ్య "చిన్నప్పుడు అమ్మమ్మ సంపాయిస్తే ఖతి కాదు. ఇప్పుడు భార్య పోషిస్తూంటే బతుకుతున్నా డన్నమాట. అదృష్టవంతుడే!" అన్నాడు.

"ఏం చేస్తాడు మరి? ఫ్యాక్టరీలో చక్రం కిందబడి కాలు విరగ్గొట్టుకున్నాడు. ఆ రోజునించీ గడిచే వుపాయం తోచక భార్యని ఉద్యోగం చెయ్యడానికి తోలాడు. లేవలేడు...అన్నీ మంచం మీదే. ఆ భార్య సాయంలేనిదే క్షణం బతకలేడు. ఆమె ఇంకా మంచిదిగాబట్టి, వాడితోనే వున్నది. అదైనా ఎన్నాళ్లులే.

ఏగైనా మంచి ఛాన్సు తగిలితే నిశ్చయంగా లేచిపోతుంది" అన్నాడు సుబ్బారావు, తన అభిప్రాయాల ప్రకారమే ఆలోచిస్తూ.

శివరామయ్య "అట్లా ఎందు కనుకోవాలిరా? ఆమె సాధ్వి అయి అతన్నే అంటి పెట్టుకుని ఉంటుందనే ఎందు కనుకోరాదు?" అన్నాడు సహజంగా.

"ఇది కలికాలంగా వెధవా! బాగా సంపాయిస్తూ వుండి, అందంగా ఆరోగ్యంగా గూడా వుంటేనే మగవాడి ఆకర్షణ నిలుస్తుంది. లేకపోతే భార్యలు కాపరాలు చెయ్యరు! నే నేదో మాట వరస కంటున్నాననుకోకు. ఎన్నో వందల పుస్తకాలున్నాయి ఈ విషయం మీద," అన్నాడు సుబ్బారావు.

"కలికాలమా—పాడా! ఇప్పటికి చాలామంది నీవు చదివే దౌర్భాగ్యపు పుస్తకాలు రాసే కృత్రిమ మనస్తత్వ వేత్తల అంచనాలనుదాటి నిశ్చయంగా బతికే సాధ్వీమణులున్నారు సుబ్బారావు! నువ్వు కళ్ళుతెరిచి చూడ్డానికి నిరాకరిస్తే చెప్పలేనుగాని, నిప్పు అన్న తర్వాత—అది కృతయుగంలోనూ నిప్పే, కలియుగంలోనూ నిప్పే. దాని పవిత్రతకు ఎన్నటికీ లోటురాదురా," అన్నాడు శివరామయ్య.

ఈ మాటలు విని చురుకుతగిలిన కోటిలింగం, "అందుకనే గామాలు బజార్లకి బజార్లు వేశ్యలను మించిన అమ్మాయిలు తయారైనారు! దానికేమంటావు?" అన్నాడు నిలదీసినట్టుగా.

"దానికెవరూ ఏమీ అనలేరు. కృతయుగంనుంచీ వున్నవాళ్లే వాళ్ళు. ఈనాడు కొత్తగా వొచ్చారంటావా ఏమిటి?" అన్నాడు శివరామయ్య.

"ఎక్కువైనారంటాను" అన్నాడు టెయిలర్.

"జనాభామాత్రం పెరగలేదు? దారిద్ర్యం పెరగలేదు? వేశ్యావృత్తి స్వీకరించడానికి ఎన్ని అవాంతర పరిస్థితులున్నాయి ఇక్కడ! అవన్నీ తెలియాలంటే నువ్వు సెక్సు పుస్తకాలు చదవడం కన్న మన దేశ ఆర్థిక స్థితిగతులగురించి చదవడం మంచిది. విషయాలు చప్పున బోధపడతాయి," అన్నాడు శివరామయ్య సీరియస్‌గా.

ఇదే సుబ్బారావుకి కావల్సిన ఆలోచన.

అతను సంభాషణ అందుకుని "అదే నేనూ అంటున్నాను. మా టైపిస్టు గర్ల్, పాపం ముప్ఫైరోజులూ చాకిరీచేసే అరవై రూపాయలు సంపాయిస్తూంది. ఆ అరవై ఇంటి ఖర్చులకే సరి పోతాయా? ఆమె లిప్‌స్టిక్కే సరిపోతాయా, మొగుడి మందులకే సరి పోతాయా? ఇటు డబ్బు సౌకర్యమూ లేదామెకి. అటు శరీర సౌఖ్యమూ లేదు. ఏం చేస్తుంది? అదీ నా ఐడియా. ఆమె ఒక్కొక్కప్పుడు ఎదురుగా కూచున్న మమ్మల్ని చూస్తోవుంటే మా కనిపిస్తుంది, ఆమెలోని బాధల తీవ్రత ఏమిటోనని," అన్నాడు.

"నీ మొహం! పని భారంతో, నువ్వైనా వొత్తిడి ఎక్కువైనప్పుడు తోచక తలెత్తి ఎదుట ఏంవుంటే దాన్నే చూస్తావు. నీ మొహం ఏవో ఆలోచనలతో వుంటుందనుకో. అదల్లా నీ వంకర దృష్టికి తప్పుడర్థాలు కల్పిస్తే ఆమె ఏంచేస్తుంది?" అన్నాడు శివరామయ్య.

"నేనైనా ఏమంటున్నానురా? ఆమె ఏదో బాధపడు తున్నది అని. ఆడది సాహసించలేదుగా? మొగవాడే సాహసించి ఊతం ఇస్తేనేగాని ఆమెగూడా సరే అనదు......ఇప్పుడామె పరిస్థితులు ఆ అంచు మీదనే వున్నాయి. నిజానికి నా వంటివాడు, 'ఊఁ...' అనాలిగాని, ఆమె సరే అనకపోతే చెవి తెగ్గో యించుకుంటాను. అటు ఆర్థికంగానూ సర్దుబాటు కలుగుతుంది. ఇటు..." అని కన్నుగీటి ఆపేశాడు సుబ్బారావు.

శివరామయ్యా, కోటిలింగమూ ఊరుకున్నారు.

సుబ్బారావు సిగరెట్ తిరిగీ వెలిగించి "అయినా నేను చెప్పేదంతా ఇవ్వాళో, రేపో జరుగుతుందని అనటంలేదు. ఇంకా కొంత కాలం ఆమెని స్టడీ చెయ్యాలి..." అన్నాడు.

"ఏమో నాయనా, మరీ పెచ్చుమీరి పోతున్నావు. మీవాళ్లు నీకో పెళ్లి అని చేసిపారేసినట్టయితే ఇంత లజ్జ విడిచి ప్రవర్తించే వాడివికాదు. ఏమో ఏరోజుకారోజు పీపుకి చేటు కలుగకుండా చూసుకుని ఇల్లు చేరుతావో లేదో అని నాకు దిగులు," అన్నాడు శివరామయ్య సానుభూతిగా గొంతుపెట్టి.

"చాల్లేవోయ్ నీ ఉపన్యాసం. మన అంచనాలు ఎప్పుడూ తప్పవు," అన్నాడు సుబ్బారావు కాలర్ సరిచేసుకుంటూ.

"నువ్వు బాగుండాలనే మా కోరిక" అన్నాడు శివరామయ్య.

"అంతేగామరి !" అన్నాడు కోటిలింగంకూడా.

"ఆ... అవునుమరి," అన్నాడుసుబ్బారావు.

## 23

సాంబశివరావు కాలు కింద మోపనివ్వడానికిగాని బాధ పెట్టడం లేదిప్పుడు. పైగా మనస్సుకి డబ్బు దిగులసలేలేదు. ఎలాగో నెలకి అరవై తెస్తోంది పార్వతి. రెండుపూటలా సుష్టుగా అన్నం పెడుతోంది. ఏలోటూ లేకండా జరుగుతోంది. కనక అతను తన ఆలోచనలన్నిటినీ ఇతరత్రా వినియోగించగలుగుతున్నాడు. ఆమె అనురాగంతో అతన్ని సమీపించినప్పుడల్లా అతని వొళ్లు వేడెక్కిపోతూవుంటుంది. బొత్తిగా సహనం కోల్పోయాడతను. దీని పనితనం చూసి డబ్బిస్తున్నారు ఆఫీసులో ! అసలు దీని కేం వొచ్చని ? ఆడపిల్లల ఎస్. ఎస్. ఎల్. సి. చదువుల ప్రమాణం తనకు తెలిదా? ఏమిటో, ఆ ఆడపిల్లల జాలి మొగం చూసి, వాళ్ళ కళ్లల్లో దిగులు చూడలేకా పరీక్షాధికారులు మార్కులు వేసి పాస్ చేసేస్తూ వుంటారు. నిజానికి ఆడపిల్లలకు పన్నెండు మార్కులుగూడా రావు చదివితే నేనేనా ? అటువంటిది వీళ్ళు ఆఫీసుల్లో పని చెయ్యగలిగేమిటి ? చాకలిపద్దులు రాస్తేనే పది తప్పులు పడతాయే, ఆఫీసుల్లో ఇంగ్లీషు ఉత్తరాలు రాసి టైపులు చేస్తారా ?...

సాంబశివరావు తన భార్యకి ఏమీ తెలియదనే అనుకున్నాడు. ఒకవేళ తెలిసినా అది ఎంతో వుండదని సమర్థించుకున్నాడు. తనభార్య అందం, కులుకూ చూసిన్నీ తన లేవలేని స్థితికి జాలిపడిన్నీ కాళిదాసు మాట తీసెయ్యలేకనూ జీతం ఇస్తున్నారు కంపెనీవాళ్లు అనే నిర్ధారణ కొచ్చాడతను. ఈ ఆలోచనలను అతనే గనక నోటవిప్పి భార్యతో అనేస్తే పార్వతి తగినట్టుగా సమాధానం చెప్పివుండేదేమో గాని, సాంబశివరావు పైకేమీ మాట్లాడ్డం మానేసాడు. తన ఆలోచనలను కడుపులోనే పెట్టుకుని పైకి చిరచిరలాడుతూ భార్య

పైన విరుచుకు పడేవాడు. ఆమెని తిట్టడానికీ, విమర్శించడానికీ కారణంకోసం వెతికేవాడు ఎప్పుడూ.

భార్య కాక మరో మూడో మనిషి అతనితో మాట్లాడ్డానికి దొరికితే తన మనస్సును నిరంతరం వేధిస్తున్న భావసాంచల్యాన్నంతట్నీ వెళ్ళబోసుకుందామని ఉందతనికి. దాన్నే భార్యతోనే ఎందుకనగూడదో అతనికి తోచదు. అనలేదు. తనవన్నీ అనుమానాలే అని అతనికి తెలుసును. అవి రుజువైతే భార్యని నిలదీయవచ్చును గాని-కానప్పుడు ఆమెని ఆధారం లేకండా నిలదియ్యడం కష్టం కదా?

సాంబశివరావు కక్ష పెట్టుకున్న మనస్సుకు ఒకరోజు పదినిమిషాలు పార్వతి ఆలశ్యంగా వొస్తే మండిపొయ్యేది. పార్వతి ఉంటే అతనికి బాగా తోడుబడి అయ్యేది. ఏదో కోపమో తాపమో మాట్లాడ్డానికి ఒక మనిషి ఉంటుందికదా! ఆమె లేకపోతే తోచదు.

పార్వతి, రోజూ ఆఫీసునించి ఇంటికి వొచ్చేప్పుడు భర్తకో-లేక ఇంటి సామగ్రో ఏదో తెస్తూనే వుండేది. రోజూ ఏదో ఒకటి లోటుగదా! ఈ పనివల్ల ఆమెకి అప్పుడప్పుడు కొంత ఆలశ్యం అయ్యేది. ఆరోజు ఆమెకీ, సాంబశివరావుకీ యుద్ధమే. అయితే, పార్వతి ఏమాత్రం ఎదురుతిరిగి మాట్లాడక పోవడంవల్ల సాంబశివరావు నోరు నొప్పెట్టేదాకా తిట్టి తానంతట తానే ఊరుకునేవాడు. చివరికి, ఎందు కాలశ్యమైందో కనుక్కునేవాడు. గొణుగుడుగా ఏదో అని వూరుకునేవాడు.

జనవరినెలలో ఒక శనివారంపూట పార్వతి, మర్నాడు ఆదివారం గనక కొట్లుండవనే దృష్టితోటి బజారువెళ్ళి ఒక అద్దం, దువ్వెన, కందిపప్పు, తిరగమోత సామాన్లూ, ఒక పూలచెండూ కొనుక్కుని వచ్చింది. చిల్లరకొట్ల దగ్గిరా, ఫ్యాన్సీ కొట్లో జనం తొక్కిడి జాస్తిగా వుండడంవల్ల ఆమె ఎంత ఆదుర్దాపడ్డా గంట ఆలశ్యం అయింది. ఆమె ఇల్లు చేరుకునేసరికి గంట ఏడు కావస్తోంది.

సాంబశివరావు ఆమెని గడపలో చూడ్డమే అగ్గిలా ఐపోయి "నేనొకణ్ణి బతికున్నానన్న జ్ఞాపకమన్నా వుందటే ముండా?"

అని లేచాడు. మెల్లగా మంచంమీద సర్దుకుని కూచుని, "పెచ్చు మీరి పోతున్నావేం ఇప్పు డెంతయిందో తెలుసా? అర్ధరాత్రి దాకా నీకేం పన్లుంటాయే అక్కడా?" అని ప్రారంభించాడు.

పార్వతి చేతిలోని సామానులు భర్తకి చూపించి చాలా నమ్రతగా "రేపు ఆదివారం కదండి, అన్ని కొట్ల దగ్గిరా ఒకటే జనం రద్దీ. ఎంతకీ తెమలలేదు..." అన్నది.

ఆమె చేతిలోని సామాన్లవంక చూసిన సాంబశివరావుకి, మొదట పూల పొట్లం తామరాకులో వుండడంతో కన్పించలేదు. అదేదో తనకు భార్య తెచ్చిన ఫలహారం అనుకున్నాడతను. కాని, పార్వతి సామాన్లు అక్కడపెట్టి లోపలికిపోయి లాంతరు వెలిగించి పట్టుకొచ్చింది. తర్వాత అద్దం, దువ్వెన అతనికి చూపించింది. ఆమె పూల పొట్లంతీసి ఊడదీస్తూవుంటే, "అదేమిటే?" అన్నాడు—ఆమె ఎంతకీ తనకివ్వదేమా అన్న ఆలోచనతో సహనం కోల్పోయిన సాంబశివరావు.

"చామంతిపూలండి..." అంది పార్వతి హీనస్వరంతో.

సాంబశివరావుకి చర్రున మంటెక్కిపోయింది అది పూల పొట్లం కావడంతోటి. 'లంజ! తాను ఇలా మంచంపాలై శక్తిలేక అఘోరిస్తూవుంటే ఇది పూలు సింగారించుకుని కులకడాలా? తన అనుమానాలు నిజమే! ఎవరికోసం ఈ అలంకారాలు!' "గోజ్జ పూలెందుకే దౌర్భాగ్యపు ముండా! నోరు రుచిచెడి నేనిక్కడ చచ్చిపోతున్నానుకదా, నాకేదైనా తెచ్చిపెట్టాలని తోచదేం నీకు?" అన్నాడతను కోపంగా, అతని మసకబారిన తీవ్రమైన కళ్ళలో నిప్పులు కురుస్తున్నాయి.

"రేపు ఇంట్లోనే పకోడీలు చేద్దామనుకొని ఇవ్వాళ ఏమీ తేలేదండి...పూలు చాలా బాగున్నాయని ఒక అణాకి కొనుక్కున్నాను," అని గొణిగింది ఆమె భయంతో.

"కొంటావు కొంటావు! కొనవుటే, ఎవరికోసమే నీ కులుకు? దేనికోసం?..." అన్నాడు కడుపుమంట భరించలేని అశక్త భర్త.

"రామ రామ! ఏమిటండి ఆ మాటలు!...మీ కోసం కాదుటండీ...?"అన్నదా అబల. కళ్ళనీళ్ళు తిరుగుతున్నాయి ఆమెకి.

"ఆ పొట్లాం ఇలా తే!" అన్నాడు సాంబశివరావు. ఇంకా మంట మండుతూనే వుంది ఆ కళ్ళల్లో. బ్రహ్మాండమైన ఈర్ష్యా జ్వాలలు కక్కుతోంది అతని మలినమైన హృదయంనించి. పార్వతి వొణుకుతూ పొట్లం అతనికిచ్చింది. పొట్లం అందించిన కుడిచెయ్యి పట్టుకుని ఆమెని దగ్గిరకి లాక్కుని, జుట్టు పట్టుకుని వొంచి వీపుమీద దబదబ నాలుగు గుద్దులు గుద్దాడు సాంబశివరావు. అప్పటికీ తగ్గ లేదు ఆగ్రహం. ఆమెని వొదిలేసి పూలు చేత్తో కచ్చకొద్దీ నలిచి వేసి ఇంట్లో ఒక మూలగా విసరికొట్టాడు.

పార్వతి వెక్కుతూ, ఏడుస్తూ కిందవుంచిన పొట్లాలు పట్టుకుని లోపలికి పోయింది. ఆవేళ ఆమెకిక అన్నం సయించలేదు. పెట్టెలోంచి తల్లిదండ్రుల ఫోటో బైటికిదీసి చూస్తూ మనసారా ఏడ్చింది. పడుకునిగూడా కుమిలిపోయింది.

సాంబశివరావు అన్నంతిని ఆ తర్వాత ఒక్క మాటగూడా మాట్లాడకుండా తన భార్య ప్రవర్తనల్ని గురించి ఆలోచిస్తూ పడుకున్నాడు.

పార్వతి మొదటిసారిగా ఆవేళ భర్త తనెందుకిలా ద్వేషిస్తున్నాడా అని ఆలోచించ సాగింది నిర్మలమైన మనస్సుతో. ఆమెకేమీ తోచలేదు. అది అతని స్వభావలోపమనే అనుకుందామె చివరికి.

## 24

ఆఫీసులో ఇప్పుడు పనులవొత్తిడి తగ్గింది పార్వతికి. ఎవరి పనులు వాళ్ళే చేసుకు పోతున్నారు ముగ్గురు గుమాస్తాలున్నా. ఆమె పనల్లా టైప్ చేయాల్సిన కాయితాలు టైపు చెయ్యడమే. నిన్నటిదాకా ఆమెకి ఇతర గుమాస్తాల్ని గమనించే తీరిక వుండేది కాదు. ఇప్పుడామె కొద్దిగా సుబ్బారావునూ, కాంతారావునూ గమనిస్తూంది.

కాంతారావును ఆమె చూసినప్పుడల్లా కులకదంతోటి అతన్ని చూడ్డమే మానేసింది అసహ్యంవేసి. సుబ్బారావు ఆమెలోకి సూటిగా ఎన్నడూ చూడలేక పోతున్నాడు. ఆమెను పరోక్షంగా చూడ్డానికే అలవాటు పడిపోయాడతను. అన్నీ తనలో తనే అను

కుంటాడు. ఆమెతోటి స్నేహం కుదిరిపోయినట్టే ఊహించుకుని అల్లాడిపోతున్నాడు. తన ఊహాలూ కార్యకరూపం దాల్చడానికి తనే మొదట తెగించాలి అనే నిర్ధారణ కొచ్చేవున్నాడు గనక, దానికైన రిహార్సల్సు అనేకసార్లు తనలోతాను వేసుకుంటూన్నాడు. వాటినన్నిట్నీ తన స్నేహితులకు జరిగినట్టే చెప్పి, కొంత సంతృప్తి అనుభవిస్తున్నాడు.

పార్వతి నిర్మలంగా వ్యవహరిస్తోంది. తనకు కావల్సిన కాయితాల్ని ఇతర గుమాస్తాలని అడిగి తీసుకునేటప్పుడూ, అనేకమైన ఆఫీసు పనులలో వాళ్ల సహాకారం అవసరమైనప్పుడూ ఆమె ఖచ్చితంగా వాళ్ళని పిల్చి అడుగుతూవుంటుంది. ఆమె కెక్కువగా సుబ్బారావుతోటే పని. మాటిమాటికీ సుబ్బారావు ఆమెని సమీపించి: "ఆ మద్రాసు లెటర్ టైప్ చేశారూ?" "ఈ గుడివాడ బిల్లు లెడ్జర్‌లో జమకట్టి వుందేమో చూడండి," అని అడుగుతాడు. ఆమె తలఎత్తి ప్రసన్నంగా, "ఆ! టైప్ చేశానండి" అనో, "బిల్లు జమవేసే వుందండి," అనో అంటే దాంతోటే గొప్ప సంతృప్తి పడతాడతను.

ఆఫీసు కార్యక్రమంలో స్త్రీ ఉద్యోగి పని ఇరకాటంలో పడుతూవుండడం సహజమని ఆమెకీ అర్థమౌతూనే వున్నది. మగ గుమాస్తాల్లాగా ఆమె తన మనసారా అనుకున్నవి అనుకున్నట్టు పైకి అనెయ్యటానికి వీల్లేకుండావుంది. లజ్జ, భీతి అడ్డుపడుతూ వుంటాయి. అదిన్నీ గాక, మగవాళ్లు స్వేచ్ఛగా ఏది బడితే అది మాట్లాడుకునే అవకాశం కలిగివున్నారు. సుబ్బారావూ, కాంతారావూ మాట్లాడు కుంటున్నట్లుగా తనెలా ఎవరితో మాట్లాడగలదు.

ఆఫీసులో అందరూ తనమీద సానుభూతి చూపిస్తున్నారు. తలాకరకంగానే ఐనప్పటికీ జాలిగానే తను ఈ నాటికీ భావించు కుంటూంది. తనంతటతాను ఉద్యోగపు వ్యవహారాల్ని తప్ప అన్యథా తనను బాధిస్తూన్న ఏ ఇతర సమస్యల్ని గురించిగానీ మిగతా గుమాస్తాలతో మాట్లాడ్డానికి వీలుండడంలేదుగదా! అదే ఆడ్వోవుద్యోగు లైతే? కాని ఈ వాదన నిరర్థకం. తాను ఏదో లజ్జతో వాళ్లతో మాట్లాడలేక పోతున్నదికాని, ఇదివరకు తన స్థానంలో వుండిపోయిన

లీల పీళ్ళతో సమానంగానే వుండి వాగుతూనే ఉండేది కాదా? ఆమెఐనా హృదయపూర్వంగా మాట్లాడేదో కాదో? ఎవరెరుగును?

గుమాస్తాలకు తనమీదవున్న ప్రత్యేకాభిప్రాయాల్ని గుర్తించకుండానే ఉండిపోవడానికి పార్వతి సాత్వికమైన కపటమెరుగని స్వభావం చాలావరకూ కారణమనుకోవాలి. లేదా ఆమెకున్నటువంటి తీరని సంసార తాపత్రయాల ఆలోచనలతో ఇంక దేన్ని గురించి గూడా ఆలోచించలేక పోయిందేమో?

తన బాధల గురించి తాను సీతమ్మతో చెప్పుకుని ఏడవగలదు. మళ్ళీ వేదవతితోనూగూడా అంత మనసిచ్చి మాట్లాడలేదు. ఏవో తెలియని గోడలు అడ్డం వున్నట్టుగా వుంది—ఇద్దరికీ మధ్య. తన స్థాయినిబట్టే తను మాట్లాడుతుంది. ఎదుటివారి స్థాయి గూడా తన స్థాయి అయినప్పుడే తాను హృదయం విప్పి ఎదైనా చెప్పుకోగలదు మరి.

భర్త చూద్దామా—తనను నోరు తెరువనివ్వడు. ఎప్పుడూ రుసరుసలాడుతూ, తాను కొంచెం సంతోషంగా వుండడమే భరించలేడు. తను పూలు పెట్టుకుంటేనే ఆయనకి కోపం. కొంచెం శుభ్రంగా అలంకరించుకుని ఆఫీసుకి బయల్దేరుతూంటే ఆయన కళ్లు కోపంలో మండిపోతుంటాయి. ఏమిటో...తనకన్నీ చిత్రంగానూ, ఒక్కొక్కప్పుడు అయోమయంగానూ వుంటాయి. తన భర్తకి తాను చేసే ఏ పనులు తప్పుగా తోస్తాయో తనకీనాటికీ అంతుపట్టనే లేదు. ఆయన ఆరోగ్యంగా వున్నప్పుడూ ఇంతే. ఇప్పుడూ ఇంతే.

అనాడు ఆయన సంపాయిస్తూ వుండి తనమీద అధికారం చలాయించాడనుకుంటే ఈనాడు? ఏమైనా భర్త. తన బాధలకి, భర్త కోపానికి ఆమె అందరు సామాన్య స్త్రీలకి మల్లెనే కారణాలు వెతకడం దాదాపు మానేసింది. ఎప్పుడూ తప్పులు వెతుకుతూ నౌకర్లని రంపపు కోత పెట్టే యజమానికీ, ఇటువంటి భర్తలకీ ఒక్కటే లేదా. యజమానిని ఆ నౌకర్లు ఏ నిమిషాన్నయినా వొదిలెయ్యగలరు. భర్తని భార్య అనేక కారణాలకోసం వొదిలెయ్యలేదు.

పార్వతికి ఇంత చాకిరీ, ఇంత ఆవేదనా, బాధ్యతల మధ్యా ఒక్క సుఖానుభవం వుండనే వుండింది. ఆమెకి, తానూ ఏదో కష్ట

కాలంలో ఇంత సంపాయించి భర్తకు పెట్టగలుగుతున్నందుకు గొప్ప సంతోషంగా వుండేది. ఏ వస్తువునో ఇంటికోసమో, భర్తకోసమో కొనుక్కుపోతున్నా ఆమె మనస్సు ఆనందంతో నిండిపొయ్యేది. తాను ఖర్చుపెట్టే ప్రతి కానీ, తాను పనిచేసి సంపాయించి తన భర్త కోసం, సంసారం కోసం అనే ఆత్మసంతృప్తి ఆమెకి పరిపూర్ణంగా వుండేది. తానంతట తానుగా, ఇంక ఏ ఇతర వొత్తిడీ లేకపోతే మాత్రం ఈ పని మానుకోదు. ఏం అవసరం? మానుకుంటే మరో మార్గమేది? తన భర్త మంచంనించి లేచి తిరిగి ఏదో పనిలోచేరడం, ఇప్పటిలో సాధ్యమౌతుందని తనకేమీ తోచడం లేదు. అది మంచికి రానీ చెడుకి రానీ, తాను నలుగురు మగవారిలోనూ పడ్డది. తన పని తాను చూసుకుంటూ వుంటే వేదవతి అన్నట్టు మగవాళ్ళేం పులులా సింహాలా, తననేమైనా అనటానికి!

కాని ఆమె ఉద్దేశాలు ఏమిటో ఎవరికి కావాలి! కైలాసం ఆమెను జాలి దలిచాడు. సుబ్బారావు ఆమెను కామించాడు. మిగతా ఇద్దరూ ఏదో అర్థంగాని ప్రేరణలతో మెదలకుండా ఉండి పొయ్యారు.

ఇలా సాగిపోతున్న ఒకరోజు, పార్వతి ఆఫీసునించి ఇంటికి పోదామని ఆలోచిస్తూ వుండగానే ప్రొప్రయిటర్ దగ్గిరనించి ఓ కట్ట కాయితాలు టైపుచెయ్యమని సుబ్బారావుద్వారా ఆమెకి వచ్చాయి. అప్పటికి ఐదు దాటింది. "ఈ కాయితాలు పూర్తిచేసి మిమ్మల్ని ఇంటికి వెళ్ళమన్నారు. వీటిని ఈ పూట ఆర్.ఎం.ఎస్‌లో పోస్టు చెయ్యాలట!" అన్నాడు సుబ్బారావు.

లోలోపల దిగులుగా వున్నా "అలాగేనండి," అంది ఆ యువతి. ఎప్పటకీ మాయని చిరునవ్వు ఛాయ ఆమె మొహంలో మెరుస్తోంది. సుబ్బారావు సాయంత్రపు వెలుగులో అతనికంటికి దేవతలా కన్పిస్తూన్న పార్వతి వంక ఓరచూపు చూస్తూ, "నాకూ పనివుందండి," అన్నాడు, వెళ్ళి తన సీట్‌లో తాను కూర్చుంటూ.

పార్వతి ఒక్కొక్క తావూ నిదానంగా టైపుచెయ్యసాగింది. ఆ కాయితాలన్నీ ప్రొప్రయిటర్ తిక్కరిబిక్కిరి దస్తూరీలో ఘోరంగా వున్నాయి. వాటిని ఎంత ఓపికతోనైనా చదివి టైప్

చెయ్యాలి. లేకపోతే అన్నీ తప్పులు పడతాయి. ఆమె ఏకాగ్ర చిత్తంతో టైపు చేసుకుపోతూ వుంది.

ఆవేళ కైలాసం ఆఫీసుకు రాలేదు. ప్రొప్రయిటర్ వెళ్లిపోయాడు. కాంతారావూ, సుబ్రహ్మణ్యంకూడా ఐదున్నరకే వెళ్ళారు.

గోడగడియారం టిక్కుటిక్కు శబ్దమూ, పార్వతి టైప్ చేస్తూన్న మెషిన్ శబ్దమూ తప్ప ఆఫీసు అంతా నిశ్శబ్దంగా వుంది. ఆమె కెదురుగా సుబ్బారావు కూర్చొని లెక్కల పుస్తకాలు తిరగేస్తూ ఏమిటో రాస్తున్నాడు.

సాయంత్రం రాత్రిగా మారుతోంది. మధ్యమధ్య ఒక నిమిషం అర నిమిషం కాయితాలలో ఏదైనా అర్థం కానప్పుడు పార్వతి తలెత్తి ఎదురుగావున్న కిటికీనుంచి కన్పిస్తూన్న రక్తార్ణవ దిగంతరేఖ వైపు చూస్తూంది. అప్పటికి పశ్చిమదిశ ఎరుపునించి గాఢమైన నీలిమలోకి మారిపోయింది. ఒకటీ రెండు దూది పింజలవంటి మబ్బు తునకలు మాత్రం ఎర్రగా అవుపిస్తున్నాయి. పార్వతి తిరిగీ తన పనిలో లీనమైపోయింది. గోడగడియారం 6½ కొట్టింది.

చీకట్లు ఆవరించాయి. ఆఫీసులో ఎలక్ట్రిక్ దీపాలు వెలిగాయి. మేడమెట్ల చివర గూర్ఖా కూర్చుని వున్నాడు గుడ్లు మిటకరిస్తూ. సుబ్బారావు లెక్కలుమానేసి పార్వతివైపు అదే పనిగా చూస్తున్నాడు.

పార్వతిని ఎలాగైనా పలకరించాలని అతని సంకల్పం. ఇంకో గంటసేపైనా పని తెమలదే, భర్త ఏమంటాడో అని పార్వతికి భయం. ఉభయులూ మౌనంగా పనిచేసుకుంటున్నారు. పక్కనే ఉన్న కాఫీహోటల్ రేడియోనించి 'నిరంతరభక్తి—సదా జాగృతి' అనే ఆనందభైరవి పాట విన్పిస్తోంది.

గడియారపు టిక్ టిక్—టైపుమెషిన్ టకటక శబ్దాలు నిరంతరంగా వినవస్తున్నాయి.

ఒక కాయితంలో వాక్యాలు పార్వతిని తికమకపెట్టాయి. ఎంతకీ అర్థం కాలేదు. ఆమె ఐదారునిమిషాలు ఆలోచించి తోచక, "సుబ్బారావుగారూ!" అన్నది తలెత్తి.

సుబ్బారావు ఉలిక్కిపడి, "పిలిచారా?" అన్నాడు లేవ బోతూ.

"నేనే వస్తున్నాను లెండి. ఈ పేపరు కాస్త చదివిపెట్టండి. బొత్తిగా అయోమయంగా వుంది," అంది పార్వతి, లేస్తూ.

"మీరెందుకండి రావడం? నేనే వస్తున్నానుగా!" అంటూ సుబ్బారావు ఆమె దగ్గరకే వచ్చాడు. ఆమె ఇచ్చిన కాయితం తీసు కున్నాడు. పార్వతి అతనివైపు 'చదవండి' అన్నట్టుగా చూసింది.

సుబ్బారావుకి ప్రొప్రయిటర్ దస్తూరీ బాగా అలవాటు కావడంతో గబగబ చదువుకుపోయాడు. పార్వతి అతన్ని అనుస రిస్తూ, టైప్ చేస్తూ, "మీకు బాగా అలవాటు వారి దస్తూరి! నాకింకా కొత్త," అంది.

ఆమె మైకం కొల్పే కళ్లల్లోకి చాలా బెదురుగా చూస్తూ సుబ్బారావు "ఆరేళ్ళసర్వీను గదండీ!" అని కొంచెం ఆగి, "మీ వారు మా క్లాసుమేట్ అండీ! మొన్నే తెలిసింది! ఎప్పుడో ఇంటికి వద్దా మనుకుంటున్నాను. తీరటంలేదు," అన్నాడు.

పార్వతి "అలాగా! రాలేకపొయ్యారా!" అని మాత్రం అంది.

సుబ్బారావు కాయితం టేబిల్ మీదపడేసి, "మీ వారికి కాలు కాస్త కులాసాగానే వుందా ఇప్పుడు?" అని ప్రశ్నించాడు, సంభాషణకి అవకాశం చిక్కిందిగదా అని లోలోన సంతోషిస్తూ.

"అదే నయం. ఇంకా లేచి తిరిగేస్థితికి రాలేదండి," అన్నది పార్వతి ముక్తసరిగా.

"పాపం. ఆయనకి కులాసా చిక్కితే మీకీ బాధలు తప్పు తాయి," అన్నాడు సుబ్బారావు, సానుభూతిగా గొంతుపెట్టి.

"బాధ ఏమిటి లెండి. పనిచేసి సంపాయించడం బాధ అను కుంటే ఎలా?" అన్నది పార్వతి, ఇంకో కాపుతీసుకొని. సుబ్బారావు చదివితే తాను తొందరగా టైపు చేసుకోవచ్చు అనిపించిందామెకి.

"ఈ కాయితం కూడా కాస్త చదివి పెడతారూ?" అని అడిగిందామె.

"అలాగే," అంటూ అతను, ఆమె ఇస్తూన్న కాయితం అందుకున్నాడు. కావాలని ఆమెవేళ్లు తగిలేలాగా తీసుకున్నాడు. అతనికి వొళ్లు జలదరించింది. పార్వతి దీన్ని అసలే గమనించలేదు. ఏమీ అనుకోలేదు. సుబ్బారావు తలవంచుకుని టైపుచేస్తూన్న పార్వతివైపు ఒకక్షణం, కాయితంవైపు ఒకక్షణం చూస్తూ చదువుతున్నాడు. అతనిలోని కాముకప్రవృత్తి నాలుకలుసాచి దహించనారంభించింది. రెండు నెలలపైనించీ ఊహిస్తూ సమయంకోసం ఎదురుచూస్తున్న అతనిలో దుష్టప్రవృత్తులు విలయతాండవం చేస్తున్నాయి. ఈ సామాన్యురాలైన ముగ్ధసుందరని తానిప్వోళ అడ్డగించి అడిగేస్తే ఏమౌతుంది? శతవిధాల నొప్పుకోవచ్చు! తాను ఆమె భర్తకంటే ఏ విధంగా చూసినా గొప్పవాడు. అలవాటుకొద్దీ ఈ మాట అనుకోగానే సుబ్బారావు ఎడంచెయ్యి దానంతట అదే కాలర్‌ని పైకి లాగింది; ఒకసారి క్రాపుగూడా సర్దుకున్నాడతను. 'ఫర్వాలేదు!' అనుకున్నాడు. మగవాడే చొరవతీసుకోపోతే—ఆడది కదలదని కొత్తగావొచ్చిన సెక్సుపుస్తకం నొకదాంట్లో ఉదహరించారు. 'ఆడదానికి సిగ్గునైజం; మొగవాడు సిగ్గువిడిచెయ్యాల'ని గాబోలు ఆ గ్రంథకర్త అభిప్రాయం. ఏది ఏమైనా ఈ ఉపదేశం సుబ్బారావు మనస్సుకి బాగా పట్టిపోయింది.

సుబ్బారావు కాయితం చదువుతూనే ఆలోచిస్తున్నాడు. ఆమె అందాన్ని తాగుతున్నాడు కళ్లతో. ఆమె నుదుటిమీదా, చెంపలమీదా పడి మెరుస్తూన్న విద్యుద్దీపపు కాంతీ, నల్లగా నిగనిగలాడే జుట్టుమీద పాకుతున్న నీడలూ, వెలుగూ; ఊపిరితీస్తున్న ప్రతిసారి గర్వంగా వుబికి అణిగిపోతూ అతనికి సమ్మెటపోట్లులా పరిణమిస్తున్న ఆమె బిగువైన వక్షస్థలపు కదలికా; అర్థనిమీలితంగా టైపుచేస్తున్న కాయితంమీదే లగ్నమైవున్న రెండు అందమైన కళ్లూ సుబ్బారావుకి పిచ్చెత్తిస్తున్నాయి. కాని ఈ మోహావేశం పక్కనే ప్రతివ్యక్తి హృదయంలోనూ వుండే సద్బుద్ధి అతన్ని హెచ్చరిస్తూనేవుంది—'ఇది తగదురా,' అని. అయితే ఏం? దుర్బుద్ధిని

నిగ్రహించడం కష్టం గాని సద్బుద్ధిని అణిచెయ్యడం ఎంత తేలిక ! ఈ సద్బుద్ధిని సుబ్బారావు సహజంగానే పిరికితనంకింద జమకట్టి తన మామూలు ప్రవృత్తిలో పడ్డాడు.

పార్వతి మరొక్క అరగంటకి కాయితాల్ని ఎలాగైతేనేం, సుబ్బారావు తోడ్పాటుతోనే పూర్తిచేసింది. ఆమె కవరొకటితీసి అడ్రసుకూడా వ్రైపుచేసి, ఆ కాయితాల్నీ, కవరునీ సుబ్బారావు చేతికిచ్చి "ఇక నేను వెళ్ళవొచ్చా ?" అంది లేచి నిలబడి.

సుబ్బారావు ఆ కాయితాలు అందుకుని చుట్టూచూశాడు! ఎవరూ లేరక్కడ. తనచర్యలకక్కడ గోడకు వేళ్లాడుతున్న కేలెండర్లోని పార్వతీ పరమేశ్వరులబొమ్మా, గజలక్ష్మీచిత్రమూ, ప్రకాశాన్ని అనుక్షణం ప్రసాదిస్తూన్న విద్యుద్దీపాలూ, దిక్కుల్ని ఆవరించి భయంగొల్పుతూన్న వెలుపటి-చీకటిమాత్రమే సాక్ష్యాలు. వీటిని ధైర్యవంతులెవరూ ఈ కలికాలంలో లక్ష్యంచెయ్యరు !

సుబ్బారావు "నేనూ వస్తానుగా! దీనికి స్టాంపులు అతికించ నివ్వండి," అని ఆమెతో అన్నాడు. పార్వతి ఏమీ వికల్పంగా అనుకోలేదు గనక, "సరే రండి," అని తన టేబిల్ నానుకుని నిల బడింది. ఆమె అంతరాంతరంలో భర్త జ్ఞాపకం వేధిస్తూ వుండడం వల్ల గాబోలు, మొహం కొంచెం ఆదుర్దాగా వాడిపోయి వుంది. సుబ్బారావు స్టాంపుబిళ్ళలు డ్రాయర్ నించి తీసి నిదానంగా ఎందుకో ఆలశ్యంచెయ్యాలని అనుకుంటూ అతికించాడు. దాని కోసమైనాగాని, అతడు వ్యవధిని ఎక్కువగా వాంఛిస్తున్నాడు. ధైర్యాన్నికూడ తీసుకుంటున్నాడు గాబోలు.

కవరు ఎడంచేత్తో పుచ్చుకుని, అతను పార్వతిని సమీ పించాడు. ఆమె నడవసాగింది-దీన్ని గుర్తించనట్టే. ఆమెగనక మరొక్కనిమిషం నిలబడి చూసివున్నట్టయితే, అతనికళ్ళల్లో ద్యోతి స్తూన్న కామాగ్నిజ్వాలని గుర్తించేవుండేది. ఆమె రెండడుగులు వేసిందోలేదో, సుబ్బారావు గబగబనడిచి, ఆమె నధిగమించి కిందికి వెళ్లేమెట్లకి ఐదారుగజాలలో ఆమెకి ఎదురుగానిలబడ్డాడు అడ్డంగా.

పార్వతి ఎగాదిగా అతన్నిచూసింది. ఆమెకి మొదట ఇదేమి అర్థంకాలేదు. మరునిమిషం ఆమె ప్రయత్నంతో నిమిత్తంలేకండా,

ఆమె అంతట ఆమే అర్థంచేసుకోవాల్సిన అవసరం లేకుండానే సుబ్బారావు, "పార్వతి! పార్వతి!" అన్నాడు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వేగంగా వొదులుతూ. పార్వతిని 'ప్రమాదం! ప్రమాదం!' అని అంతర్గత వివేకం హెచ్చరించింది.

"ఏమిటిదంతా?" అంది ఆమె. ఇందాకట్నించీ ఆమె గొంతుకలో ఉన్న మృదుత్వం మాయమై కాఠిన్యం ప్రవేశించింది; "అడ్డులేవండి. నేను వెళ్లాలి!" అని ఆమె చెయ్యి చూపించింది లగమని. కాని, సుబ్బారావు కృతనిశ్చయుడై వున్నాడు సెక్స్ గ్రంథకర్త ఏమన్నాడు? స్త్రీ మొదట నిరాకరిస్తుంది మనం దాన్ని లెక్కచెయ్యకుండా ముందడుగు వెయ్యాలనిగదా "నన్నింకా ఎందుకు గుర్తించవు పార్వతీ! నీ అందానికి నేను దాసుణ్నయి..." అని ఇంకేదో అనబోతున్నాడు.

అతను ఆమె కళ్లలోకి చూస్తూ మాట్లాడుతున్నవాడల్లా ఆగిపోయాడు. ఆమె కళ్లనించి విస్ఫులింగాలు రాలుతున్నాయా అనిపించిందతనికి. ఆమె నిర్మలమైన కళ్లు రెండూ ఎర్రబారాయి. ఆపాదమస్తకం ఒక తీవ్రత ఆవహించిందామెను.

"లే! ముందు! ఊం! మర్యాదగా దారి వొదులు!" అన్నదామె ఆజ్ఞాపిస్తున్నట్టు.

ఎంతయినా సిగ్గూ, శరమూ వొదిలేసిన మగధీరుడు గనక సుబ్బారావు తన జంకును తీవ్రప్రయత్నంతోటి అణచేసుకుని, "లేదు. లేదు పార్వతి! నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో..." అని మాత్రం అన్నాడు. ఆమెని సమీపించాడు. ఉన్నట్లుండి ఆమె చెయ్యి పట్టుకోడానికి చెయ్యి జాచాడు.

పార్వతి చప్పునలాగి వొక్క చెంపదెబ్బ ఇచ్చింది అతన్ని ఉద్రేకంతోటి. ఆ దెబ్బతోటి, సుబ్బారావుకి ఎప్పుడు జారిపోదామా అని అసలే లూజ్‌గావున్న కాస్త ధైర్యమూ చప్పున దిగజారిపోయింది. ఇంకా పెద్దగా అరుస్తుందేమో అనే భయంతోటి, వెంటనే పక్కకి తొలిగాడతను. నిలువెల్లా వొణుకుతున్నాడు. దెబ్బ తగిలిన చెంప కొద్దిగా మంటపెడుతోందేమో; తడుముకున్నాడు.

పార్వతి చకచక మెట్లవైపు నడిచి వెళ్ళిపోతోంది.

సుబ్బారావుకి ఈ గందరగోళంలో ఒక విషయం జ్ఞాపకం వొచ్చి చమట పోసింది భయంతోటి. అతను తిరిగి, ఆమెవైపు పరిగెత్తాడు. సరిగ్గా మొదటి మెట్టుమీద ఆమెని ఆపాడు. "అమ్మా! బుద్ధితక్కువై ఏమేమో అన్నాను మిమ్మల్ని. క్షమించండి. ఇంకెప్పుడూ ఏమీ అనను. హెడ్ క్లార్కుతో, ప్రొప్రయిటర్‌తో ఏమీ చెప్పకండి! నా నోట్లో దుమ్ము పడుతుందమ్మా!" అన్నాడు చాలా బలహీనుడై.

మెట్లమీద వెలుగులేదు. హాల్లోనించి పడుతూన్న వెలుగులో అతని జాలిగొలిపే ముఖంచూసి పార్వతి కోపం తగ్గించుకుంది. 'తక్కువ్రి వెధవ. వీడితో మనకేమిటి? ఇంకోతడవ ఇలా చచ్చినా చెయ్యడు,' అనుకుంటూ, "అలాగే!" అంది ఆమె, 'పక్కకి పో,' అన్నట్టు చూసి.

సుబ్బారావు గుండె దిటవు చేసుకున్నాడు. "క్షమించాను అనండి. దారి వొదులుతా," అన్నాడు. పార్వతికి మంటగా వుంది. తొందరగానూ వుంది. "క్షమించాను. దారి కడ్డం లేవవయ్యా!" అంది ఆమె ఆగ్రహంతోటీ, విసుగుతోటీనూ.

సుబ్బారావు గబగబ మెట్లుదిగి రోడ్డుమీదికి వొచ్చేశాడు. పార్వతిగూడా అతని వెనకాలే కిందికి దిగి, తన ఇంటి వైపుగా నడవసాగింది. ఆమె వెళ్ళిపోవడం చూస్తూ నిల్చున్న సుబ్బారావు గూర్ఖాని సమీపించి, "తలుపు జాగ్రత్తగా వేసుకో," అని చెప్పి స్టేషను వైపుగా వెళ్ళాడు. అతని మనస్సు ఒకటి రెండు నిమిషాల పాటు ఏదీ ఆలోచించలేని సూన్యస్థితిలో పడింది. మరు నిమిషమే అంతా ఒకసారి సమీక్షించుకొన్నాడతను నడుస్తూ.

పార్వతి తొందరగ తొందరగా జనసంకీర్ణమైన గాంధీనగరం రోడ్డుగుండా నడిచి; పార్కునీ, బీడీకొట్లముందు వేళ్లాడుతున్న అందమైన ముఖచిత్రాలు గల వారి మాసపత్రికల్నీ, ఎదురుగా వొచ్చే మనుష్యుల్నీ చాలా పరధ్యానంగా చూస్తూ నడుస్తూంది. 'వీడికిదేం దుర్బుద్ధి! ఎంతకాలంనించి ఆలోచిస్తున్నాడో వెధవ?' తను చెంప దెబ్బ కొట్టినప్పుడు అతని మొఖం జ్ఞాపకంవొచ్చి నవ్వుకుందామె.

'ఇక జన్మకి తన జోలికి రాడు వెధవ...ఛీ...ఛీ...' అనుకుంటూనే ఆమె ఆలశ్యంగా వెళ్తోన్నందుకు భయపడసాగింది. భర్త జ్ఞాపకం రాగానే ఆమె సుబ్బారావును మరిచి చకచక నడవసాగింది. గుర్రపు బండ్ల స్టాండు దాటి ఆస్పత్రి రోడ్డును ప్రవేశించటంతోటే ఆమెకి గుండె దడ ప్రారంభమైంది. 'ఆయన ఎప్పుడో పదిగంటలకి తిన్న అన్నం...ఆకలితోటి మహోగ్రుడై ఉంటాడివ్వాళ...ఏం సమాధానం చెప్పినా వినిపించుకోడు. తనూ ఆయనలాగే అంత ఆకలితోటే వున్నానని కూడా ఆలోచించడు. ఇప్పుడు వెళ్ళి అత్తెసరు పెట్టి వండి పెట్టిందాకా ఆగగలడా? అల్లాడిపోతాడు. ఇవ్వాళ... ఇవ్వాళ...' ఆమె ఆపైన ఏమవుతుందో ఊహించటానికైనా భయపడుతోంది. ఆమె కాళిదాసు ఇంటిని సమీపిస్తూండగా వాళ్ళింటి రేడియోలోంచి, 'మనసా ఎటులోర్తునే,' అన్న కమ్మని త్యాగరాయకృతి చెవికింపుగా సోకింది. 'సత్యవతి ఎంత అదృష్టవంతురాలు! అందమైన మొగుడు...ఎంతో ప్రేమగా చూస్తాడామెను. కాళిదాసువంటివాడు కాగూడదా తన భర్త కనీసం గుణాలలోనైనా! తనకెంత సుఖం, శాంతీ లభిస్తాయి...కల... ఎండమావులు! కొందరికి ఏ పూర్వ పుణ్యాలవల్లనో అనుకూల దాంపత్యం లభిస్తుంది గాబోలు!' అనుకుంటూ ఆమె, తలవొంచి చూరు తగలకుండా ఇంట్లో అడుగుపెట్టింది. నుక్కి మంచం మీద దీపమైనా వెలిగించని కటిక చీకట్లో కూర్చున్నాడు సాంబశివరావు.

ఆమె లోపలికి పోదామనుకుంటూండగానే "ఏమే, ఇప్పటికైనా ఇల్లు గుర్తుకొచ్చిందీ!" అంటున్నవాడల్లా, అలికిడినిబట్టి ఆమె మంచందగ్గరే నిలబడి వుందని గుర్తించి, ఉద్రేకం పట్టలేకా, ఆకలిమంటా, అనుమానాలమంటా జ్వాలలై రేగుతూవుంటే భరించలేక తన స్థితి తానే మరిచిపోయి, చప్పునలేచి, పార్వతి జుట్టు పట్టుకుని ఆమె మొహంమీద విచక్షణ లేకుండా బాదసాగాడు అతను. అయితే, రెండు మూడు దెబ్బలే కొట్టగలిగాడతను. ఈలోగా శరీరభారం కుడికాలుమీద బాగా మోపు ఐయ్యేసరికల్లా, ప్లాస్టర్ కట్లతోటి బిగిసివున్న తొడ ఎముక తిరిగి కలుక్కుమంది. దుర్భరమైన బాధ అరంభమైందతనికి. "అమ్మో, నాయనా!" అని పెద్దగా

అరుస్తూ తిరిగి అతను కుక్కిమంచంమీద వెల్లికిలా పడిపోయాడు.

అతని దెబ్బలకి పార్వతి కంగారుపడి పోయింది. తననుకొట్టి 'అమ్మో అమ్మో !' అని అరుస్తాడేమిటీయనా—అనే భయంతో ఆ చీకట్లో ఏమైందో ఏమో అని అదురుకొని, "ఏమిటండి? ఏమిటండి?" అని కేకలేస్తూండగానే, సాంబశివరావు "చావవే లంజా, దీపం వెలిగించవే! నా కాలు విరిగిందే... నే నిక బతకనే!" అంటూ గోల చెయ్యసాగాడు.

తత్తరపాటుతో పార్వతి మొహంమీది దెబ్బల్నిసైతం మరిచిపోయి, తడుములాడుతూ వెళ్లి దీపం వెలిగించింది. క్షణ క్షణానికీ సాంబశివరావు కేకలు ఎక్కువైనాయి. పార్వతి లాంతర్ తీసుకొచ్చి "ఏమిటండి? ఏమిటండి?" అని కంగారైపోతూ ప్రశ్నించింది.

సాంబశివరావు బాధతో మెలికిరిగిపోతున్నాడు. "అయ్యో! కాలు మళ్లీ విరిగిందే...అయ్యో! డాక్టర్ని పిలవవే!" అని తార స్థాయిలో అరుస్తున్నాడతను. పార్వతికి భర్త కాలుకు నిజంగా ఏమైందో అర్థంగాక, దీపం దగ్గరగా తెచ్చి చూసింది. అప్పటికే కాలు తొడదగ్గర ఎర్రబారిపోయి వాచిపోయింది. నిమిష నిమి షానికీ వాపు ఎక్కువౌతూ వుంది. పార్వతి "కాళిదాసుగారింటికి వెళ్లి డాక్టర్కి ఫోన్ చేసి వస్తానండి," అని బైటికి పరుగెత్తింది.

ఆమె డాక్టర్ సూర్యనారాయణరావుకి ఫోన్ చేసింది. వేదవతి "మళ్లీ ఏదో విషమించిందే!" అన్నది సానుభూతిగా. పది నిమిషాల్లో డాక్టర్ కారువచ్చి పార్వతి ఇంటిముందు ఆగింది.

డాక్టర్ పార్వతివంక కొంచెం జాలిగా చూస్తూ "ఇప్పుడు కాలు బెణికి పోవటానికేం కారణం?" అంటూ సాంబశివ రావును పరీక్షించాడు. సాంబశివరావు కాలు షందాకటికంటే బాగా వాచిపోయి వుంది. జ్వరంగూడా తగుల్తోంది. బాధను ఓర్వలేక అరుస్తున్నాడు.

డాక్టర్ ఒక తాత్కాలిక బాధా నివారణౌషధాన్ని ఇంజె క్షన్ ఇచ్చి, పార్వతితోటి "ఒక్క పాతిక రూపాయలు అవుతాయి ...విరిగి తొడకి ప్లాస్టర్ కట్టు కట్టాలి," అన్నాడు.

ఇంతలో సాంబశివరావును చూద్దామని వేదవతి చెప్పగా విన్న కాళిదాసు వచ్చాడు. ఆయన వెనక మాధవరావుగూడా వున్నాడు.

పార్వతికి తల తిరిగినట్టుంది. "నెలజీతం ఐపోయి నాలుగైదు రోజులైంది ఈశ్వరా!" అనుకుంటూ, "అలాగే ఇస్తానండి. కట్టు కట్టండి," అంది ఆమె.

కాళిదాసు సాంబశివరావును ఏదో పలకరిస్తూనే జేబులో చెయ్యిపెట్టి తడిమాడు. ఎప్పుడూ డబ్బులుంటూనే వుంటాయి గాబట్టి కాయితాలు తగిలాయి. ఆయన అప్పటికేమీ అనకండా ఊరుకుని, "ఏమమ్మా పార్వతి, మరి నీజీతం ఇంకో పది రోజులకిగాని రాదు గాబోలు," అన్నాడు.

పార్వతి "అవునండి," అంది. ఇంతలో కంపౌండరూ, డాక్టరూ కలిసి సాంబశివరావు కాలు ఒక పద్ధతిలో పెట్టి, ప్లాస్టర్ కట్టు కట్టడానికి సన్నాహాలు చేస్తున్నారు. పార్వతి లోపలికిపోయి పెట్టెతెరిచి చూసింది. చిల్లరడబ్బులుమాత్రం వెక్కిరించినట్టు కాసిని కనపడ్డాయి.

ఈసమయంలోనే కాళిదాసు డాక్టర్‌తో మాట్లాడుతూ "ఈ ప్లాస్టర్ చికిత్స కెంత అవుతుందండి?" అని ప్రశ్నించాడు.

డాక్టర్ "పాతిక రూపాయలండి. నెలకొకసారి కట్టుకడుతూ వుండాలి," అన్నాడు.

పార్వతి వొచ్చి నిలబడింది ఓ పక్కగా. నెలజీతం రాగానే ఇచ్చేద్దామని ఆమె ఉద్దేశం. ఆ మాట డాక్టర్‌తోటి అందామనుకుంటూండగానే, కాళిదాసు ఆమె వైఖరిని కనిపెట్టినట్టుగా తన జేబులోంచి పాతికరూపాయలు తీసి డాక్టర్ కిచ్చాడు. "నీకు జీతం వొచ్చాక పంపించు," అన్నాడు పార్వతివైపు తిరిగి. మాధవరావు కాళిదాసు సమయస్ఫూర్తికి మెచ్చుకున్నట్టు "బాగుంది," అన్నాడు.

పార్వతికి ఒక భారం తగ్గినట్టు ఐపోగానే దీర్ఘనిశ్వాసం విడిచింది. సాంబశివరావు మగతనుండు మహిమవల్ల గాఢ నిద్రలో పడిపోయాడు. ఆ రాత్రల్లా పార్వతికి భర్తకొట్టిన దెబ్బలతో మొహం కందిపోయి చాలా బాధపెట్టింది.

## 25

కోటిలింగం షాపులో కటకటాలకి ఆనుకొని కూర్చున్నాడు శివరామయ్య. కోటిలింగం గాను ఒకటి కత్తిరిస్తున్నాడు. సాయంకాలం ఐదు దాటింది. సుబ్బారావు వొచ్చే వేళ అయింది. కోటిలింగానికి సుబ్బారావు రాకపోతే తోచదు. సుబ్బారావుకీ కోటిలింగం షాపుకి వెళ్ళకపోతే తోచదు. శివరామయ్య బీడి వెలిగించి పొగ ఊదుతూ "సుబ్బారావు నిన్న అసలే రాలేదు. ఇవ్వాళా ఇంతవరకూ రాలేదు. మనం సినిమా కెళ్లేదెప్పుడురా మరి?" అన్నాడు మారుతూన్న ఎండపొడవంక చూస్తూ.

కోటిలింగం "వాడి కెన్నిపనులు !" అన్నాడు. "ఇవ్వాళ వాడు రాకపోయినా నువ్వూ, నేనూ, నా తమ్ముడూ ముగ్గురు కలిసి వెళ్దాం!" అని కూడా కలిపాడు.

దీపాలు పెట్టేముందుగా, చీకట్లింకా ఆవరించకముందే నిదానంగా నడిచి వొచ్చాడు సుబ్బారావు. అతని మొహం మామూలుగా లేక చిటచిటలాడుతోంది. ఎప్పుడూ ఈలలేస్తూ నవనవలాడే సుబ్బారావు వాడిపోయి వున్నాడు.

శివరామయ్య "ఏమిటోయ్ సుబ్బారావు! నిన్న నే సినిమా కెళ్దాం అన్నావు. ఎగ్గొట్టేశావు. ఇవ్వాళకూడా వొస్తావో రావో అనుకుంటున్నాం. ఏమిటి? మొహం అలా పెట్టావు జూదంలో ఓడి పోయినవాడిలా?" అన్నాడు.

"ఈ వారం కూడా తన్నేసిందేమో?" అన్నాడు ఎన్నడూ మాట్లాడి ఎరగని కోటిలింగం తమ్ముడు. శివరామయ్యా, కోటిలింగం గొల్లున నవ్వారు.

సుబ్బారావు మొహం చిన్నబుచ్చుకుని "ఏమిటా నవ్వు? ఎందుకొస్తుంది అంత నవ్వు?" అని ప్రశ్నించాడు మంటగా. దీనికి శివరామయ్యే జవాబిస్తూ "నవ్వలేనివాడు మానవుడే గాదు. నువ్వూ నవ్వరాదుటోయ్ మా తోటి! నవ్వలేకపోతే ఏం కారణమో చెప్పు!" అన్నాడు తన పక్కనే ఖాళీ చూపించి సుబ్బారావును కూర్చొబెట్టుకుని. సుబ్బారావు అతనిపక్కనే కూర్చుని ఐదారు నిమిషాలు పరధ్యానంలో పడినట్టు మౌనంగా వూరుకున్నాడు. ఎప్పుడూ వస

పోసిన పిట్టలాగా వాగుతూవుండే సుబ్బారావు మాట్లాడకపోవడం అతని మిత్రులకి ఎంతయినా ఆశ్చర్యం కలిగించింది. సుబ్బారావు తత్వం బాగా ఎరుగున్న శివరామయ్య 'అబ్బాయి ఎందులోనో మైనెస్ మార్కులు సంపాయించిన పోజు ఇది,' అని వూహిస్తూ, "ఏమిటిరా మాట్లాడవూ? ఈ దెబ్బ క్రాస్‌వర్డ్సులో తిన్నావా, లేక..." అని అంటూ వుండగానే, సుబ్బారావు, "ఆమెనన్ను... తిరస్కరించిందోయ్! భలె కిలాడీ!" అన్నాడు చాలా భావస్ఫూర్తిగా.

"ఆమె? ఆమంటే ఎవరూ?" అని అడిగాడు శివరామయ్య, సుబ్బారావు ప్రణయం సంగతి మర్చిపోయి. దీనికి సమాధానం చెప్పే రీతిగా కోటిలింగం "అప్పుడే మర్చిపోయావూ? వాళ్ల ఆఫీసులో పనిచేస్తూందే టైపిస్టు అమ్మాయి—అది అనుకో," అని అందించాడు.

సుబ్బారావు పెద్దగా నిశ్వాసవిడుస్తూ "సర్గా అంతే. ఏం జరిగిందంటే—" అని ప్రారంభిస్తూ వుంటే, శివరామయ్య "నిప్పు గాదూ? కాలి వుంటుంది!" అని పూర్తిచేసి నవ్వాడు.

"నిప్పా-మన్నా! అంతా వేషం! అంతా బెట్టూ!" అన్నాడు సుబ్బారావు ఆవేదనతో.

"ఏం జరిగిందో చెప్పరాదుట్రా! సినిమా వేళ దాటింది... అసలు నడుస్తూ మాట్లాడుకుందాం—లే!" అంటూ లేచాడు శివరామయ్య.

అందరూ లేచారు. వాళ్లు ఏలూరు రోడ్డులోవున్న విజయా టాకీసువైపుగా పోతూ మాట్లాడుకోసాగారు, రోడ్డుపక్క పేవ్‌మెంట్ మీద వెళ్తూ. సుబ్బారావు "నిన్న రాత్రి ఆఫీసులో ఒంటరిగా చిక్కింది పిట్ట. అడగదల్చుకున్నవి నాలుగూ అడిగాను..." సుబ్బారావు జరిగిందాన్ని ఊహిస్తూ, ఉద్రేకంతో టి ఊగిపోతూ, "తానేదో పెద్ద పతివ్రతల్లే పోజుపెట్టి, నానా మాటలూ అంది," అన్నాడు.

"అన్నదీ? ఏమేం అన్నదో కాస్త వినిపించు. ఆమె ఎటువంటిదో నేను చెబుతాను," అన్నాడు కోటిలింగం.

"ఏమంటుందేమిటి? అనవసరంగా మాట్లాడితే పళ్లు రాలిపోవు? 'పోవయ్యా! దారి కడ్డులే! ఏమిటామాటలు?' అన్నది

గుడ్లురుముతూ. అది ఆఫీసు! ఎవరైనా వొస్తారేమో అని దాని భయం. అదీ కారణం. లేకపోతే..."

"నిజమే మరి! ఆడది కదూ? పదిమంది మనిలేచోట సిగ్గు పడదూ? నువ్వు మగరాయుడు వాయె, సిగ్గు విడిచేశావు! నీకేం!" అన్నాడు శివరామయ్య.

"ఏడిశావు! నేనే భిడియపడి, ఎవరైనా వొస్తారేమోనని పరువుకి చచ్చి వొదిలేశాను దాన్ని. ఇప్పుడు మాత్రం ఏమైందిలే? దాన్ని తేలికగా వొదిలేస్తానా? దాన్ని ఆఫీసులించి గెంటించకపోతే నేను సుబ్బారావునే గాదు!" అన్నాడు అతను మీసందువ్వి.

"అంత ప్రమాదం ఏం వొచ్చిందిరా వెధవా? నువ్వు ఏదో పిచ్చిగా వాగితే ఆమె కాదన్నది. అంతేనా? దానికింత రగడ ఎందుకు?" అన్నాడు శివరామయ్య మందలింపుగా.

"అంతేనా? కాదు. కాదు. ఇంతకాలం నన్ను ఊరించి-ఊరించి, చివరికి కాదంటుందీ?..." అని పళ్లు పటపట కొరికాడు సుబ్బారావు పగతోటి.

"ఇహ నీ యిష్టం నాయనా! నువ్వు ఏ గంగలో దిగిపోతే నాకేమిటి?" అని సర్దుకున్నాడు శివరామయ్య, దుష్ప్రవర్తనకి పరిహారమే లేదన్నట్టుగా.

సుబ్బారావు విజయటాకీసు ఎదురుగా వున్న గోడ్డుమలుపు వైపు చూసినవాడల్లా "ఒరే కోటిలింగం! అదిగోనోయ్, మా టైపిస్టు గరల్!" అంటూ మెల్లగా చెయ్యి అటువైపుగా చాచి మరీ చూపించాడు. పార్వతి డాక్టర్ సూర్యనారాయణ అనుపత్రికి వెళ్లి, భర్తకి మందు తెస్తోంది తల వొంచుకుని. ఇన్నాళ్లనించీ వర్ణిస్తున్నాడే ఈ సుబ్బారావు; ఆ అప్సరస ఎలా వుంటుందో చూద్దామన్న కుతూహలం శివరామయ్యకీ, కోటిలింగానికీ కూడా కలిగి, ఆమెవైపు తిరిగి కాస్త ఆసక్తితోటి చూశారు.

పశ్చిమాకాశపు తుది ఎరుపుకాంతి ఆమెమీద లేల్తిగా ప్రసరిస్తోంది. జుట్టు కొంచెం చెదిరివుంది. పనిచేసి వొచ్చిన అలుపూ, దిగులూ ఆమె నావరించి వున్నాయి.

శివరామయ్య ఆమెను సదుద్దేశంతోటే చూశాడు. సుబ్బా రావును విదిలించేసిందంటేనూ, తనపని తాను చూసుకుపోతోంద అంటేనూ, భర్త కష్టంలో భాగం పంచుకుంటోందంటేనూ ఆమె ఎంత మంచిదై వుండాలో--అని అంచనా వేసుకుని చూశాడతను. పైకి ఏమీ అనకుండా వూరుకున్నాడు. కొంత జాలిపడ్డాడు కూడా.

కోటిలింగ అలా ఆలోచించలేదు 'ఏమిటూ విశేషం? సుబ్బారావును ఆకర్షించేంత, సౌందర్య ఏమీ కనపడలేదే ఈమెలో!' అనుకొని "ఏమిటిరా సుబ్బారావు! దీనికోసం ఇన్నాళ్ళూ చచ్చి పోయావు? సన్నగా, శవంలా వేళ్లాడి పడిపోతూవుంది కాదుట్రా ఈ బొమ్మ! ఏం గొప్పతనం వుందిలెద్దూ!" అని పెదవి విరిచాడు.

ఆమె తనను కొట్టినా, ఆమె రూపవతికాదన్నా, తను మోహించిన స్త్రీలో గొప్పతనంలేదన్నా సుబ్బారావు చచ్చినా వొప్పకోడు. అతని ఆశని, అభిరుచిని ఈ విమర్శ నీచం అని అవ హేళన చెయ్యడంకదా మరి!

పార్వతి వాళ్ల దృష్టిపథంనించి దాటిపొయ్యేవరకూ మిగతా వాళ్ళు మానేసినా, సుబ్బారావుమాత్రం చూస్తూనే వుండిపోయాడు. తర్వాత నోరుతెరిచి "ఆమె కేమిటిరా! ఆమె అందాన్ని—అర్థం చేసుకోగల రసికత్వంగూడా వుండాలి!" అన్నాడు తీవ్రంగానూ, బాధగానూ గొంతుపట్టి. ఆమె తిరస్కరించివేసినా ఆమెమీది ఆ అపారమైన వ్యామోహం పొగలా కమ్ముకుని ఊపిరాడనియ్యటం లేదా బ్రహ్మచారిని.

శివరామయ్య "రండోయ్ వెధవకబుర్లు! అదిగో 'క్యూ' చూడు! ఊరికే హనుమంతుడితోకలా పెరిగిపోతోంది!" అన్నాడు. నిజంగానే క్యూ వరస చాలా పొడుగ్గా సాగిపోతోంది. మిత్రు లందరూ చటుక్కున సంభాషణ విరమించి, క్యూ లోకెళ్ళి నుల్చు న్నారు. సుబ్బారావు పరధ్యానంగా సినిమాహాలుమీద కట్టిన బానర్ మీది కథానాయిక రూపచిత్రాన్ని పార్వతితో పోల్చి చూసుకుని కుమిలిపోతున్నాడు.

## 26

సాంబశివరావుకి కాలు తీసగొట్టిన మర్నాడు ఉదయం 8 గంటలకే పార్వతి డాక్టర్ సూర్యనారాయణరావు దగ్గిరకి పరిగెత్తింది—ఆయన తప్పకుండా రమ్మని చెప్పివుండడంవల్ల. ఆయన ఆమెను కూర్చోబెట్టి, మందుకలిపిస్తూ "ఇలాగే ఆయనకు తాత్కాలిక వైద్యం ఎన్నాళ్ళు చేయిస్తావమ్మా? నేను ఆనాడే చెప్పాను, ఇది మరీ ముదిరితే మనసాధ్యం కాదని!" అన్నాడు.

"ఏం చెయ్యమన్నారు మరి?" అంది ఆ అబల దీనంగా.

యదార్థానికి డాక్టర్ సూర్యనారాయణతో కాళిదాసు మాట్లాడి, ప్లాస్టర్ చికిత్సకుతప్ప ఇంక దేనికీ ఫీజు అడగకుండా చేశాడు. అదీన్నీ గాక పార్వతి సంగతి డాక్టర్‌కీ తెలుసు. "ఏం చెయ్యగలవు? ఈ క్షణాన అతన్ని మద్రాసు తీసుకుపోయి, కాలు తీయించుకొంటే నీకు... పసుపు కుంకుమమైనా దక్కుతుందమ్మా!" అని కుండ బద్దలుకొట్టినట్లుచెప్పాడాయన.

పార్వతి "ఏమంటున్నారు?" అంటూ అడిగి, పైకే యేడ్చేసింది. డాక్టర్ ఆమెను ఓదారుస్తూ, "అదేమీ ప్రమాదం అనుకొని ఖంగారుపడకు. ఇంకో ఐదారు మాసాలలోగా ఆయన్ని మద్రాసు తీసుకెళ్ళాలి. ఏమంటావా, మీ ఆయనకి వొంట్లో రక్తం క్రమంగా సెప్టిక్ అయిపోతోంది. నువ్వేమాటా ఆయనతో చెప్పకుండా ఈ నాలుగైదు నెలలపాటు ఎలాగో తాత్కాలిక చికిత్స చేయిస్తూ, మద్రాసు వెళ్ళే ఉపాయంచూడు. ఇక్కడ ఆయన కాలు ఈ పద్ధతిలో తియ్యడానికి ఎవరూ ధైర్యంగా పూనుకోరు," అన్నాడాయన.

"మద్రాసు వెళ్ళాలంటే—" అని ఆగిపోయింది పార్వతి.

"ఎక్కువేం కాదు. అక్కడే నాలుగు నెలలయినా ఉండాల్సి వస్తుంది. ఐదారు వందలయితే తేలికగా సరిపోతాయి!" అన్నాడు డాక్టర్.

"ఈ విషయాలు మా వారితోటి చెప్పి, ఇద్దరమూ ఆలోచించుకోవాలండి," అన్నది పార్వతి పైకి. లోలోపల పీకుతోంది,

'ఐదారువందలు ! లేదా, తాను భర్తను శాశ్వతంగా పోగొట్టుకోడం అన్నమాట!!...అమ్మో ! ఎంతమాట...'

"పనికిరాదమ్మా ! మీవారితో ఆమాట ఎప్పుడూ చెప్ప రాదు. ఆయన చాలా బలహీనస్థితిలో వున్నారు. రక్తప్రసరణ వేగంగా జరుగుతున్న ఈ స్థితిలో, ఆయన్ని భయపెట్టేమాటలు ఆయ నకి అపాయం కలగజేస్తాయి. జాగ్రత ! నీమటుకు నువ్వు ఆలో చించుకో. మనసు ధృఢంచేసుకో. ఎవరైనా సాయం అడుగు. ఏంకేమైనాచెయ్యి. ఆయనకిమాత్రం నే చెప్పిన సంగతులు చెప్పకు!" అని డాక్టర్ గట్టిగా హెచ్చరించాడు.

ఆమె వుక్కిరిబిక్కిరి ఐపోతోంది. ఎటూ తోచదు. 'ఐదారు వందలు ! ఎలా పోగుచెయ్యడం ! అదైనా ఐదారు నెల్లో ! ఈ వ్యవధి దాటితే—'ఇంతకంటే ఆమె ఎక్కువ ఆలోచించలేదు.

ఆమె తోచీతోచని స్థితిలో మౌనంగా వుండిపోయింది కాసేపు. తర్వాత తేరుకుని, "మరి ఈలోగా మంచి మందివ్వండి" అనింది. ఆమె అంతర్గతంలో భర్తపట్ల బ్రహ్మాండమైన ఆపేక్ష రూపొందుతోంది. ఎంతబాధని భరిస్తున్నాడాయన !

డాక్టర్ ఆమె మొహంలోని మార్పుల్ని క్రమంగా పరిశీలిస్తూ వస్తున్నవాడల్లా "నువ్వో ఇట్లా దిగులు పెట్టుకుంటే రోగి మరీ నీరసించి పోతాడమ్మాయి ! నేనూ జాగ్రతగానే మందిస్తాను. సరా !" అనేసి, మందుకలిపి ఆమెకిచ్చాడు. "వెళ్లి రా. ఈ మందు ఈ పూటకే. మళ్ళీ సాయంత్రం రా. రెండుపూటలూవొచ్చి తీసుకెళ్తూ వుండు," అన్నాడాయన.

పార్వతి తిరిగి గబగబ ఇల్లు చేరుకుంది. సాంబశివరావు ఆలోచిస్తూ మంచంమీద పడుకొని కప్పువంక చూస్తున్నాడు. అతన్ని దగ్గిరగా వుండీ చూసినకొద్దీ పార్వతికి ప్రేమ అతిశయిస్తూంది. ఆమె అతి ఆప్యాయంతో అతని పక్కనే కూర్చుని, "ఈ మందు కాస్త తాగండి" అంది. అతని నోట్లో మందుపోసిన తర్వాత అతని కళ్లల్లోకి లాలనగాచూసింది. "ఏమండీ ! గడ్డం చేయించుకుంటూరా!" అడిగింది.

"ఊఁ..." అని గొణుకుతూ సాంబశివరావు ఆమెకేసి

చూశాడు. 'ఆమెను నిష్కారణంగా కొట్టినందుకే నిన్న తనకా శిక్ష విధించాడు దేవుడు' అనిపించిందతనికి. అయినా అతనికి భార్య మీద ఏదో అనుమానం. ఈ సేవ అంతా తనని వంచించటానికేనని అతని ఉద్దేశం...

"నేను వెళ్లి అన్నం వండుతాను...వెళ్లనా?" అంది పార్వతి లేస్తూ.

"మంగలివాణ్ణి పిలచి మరీ వెళ్లు," అన్నాడతను, ఎందుకో భార్యని సూటిగా చూడలేక మొహం పక్కకి తిప్పుకొని.

పార్వతి బాధవల్ల అలా పొర్లుతున్నాడు భర్త అనుకుంటూ బైటికి వెళ్లింది. తర్వాత వంటచేసి భోజనాలు అయ్యాక తొందర తొందరగా ఆఫీసుకి వెళ్లింది. ఆవేళ పది నిమిషాలు ఆలశ్యంగానే వెళ్లవల్సివచ్చింది.

ఆమె తన టేబిల్ దగ్గిరికి వెళ్లి కూర్చుంది. కైలాసం ఆమెవైపు జాలిగా చూశాడు. సుబ్బారావు చూపుకి అర్థం చెప్పడం కష్టసాధ్యం. కోపం, ద్వేషం, మత్సరం కలబోసిన చూపు అది. పార్వతి అలవాటు చొప్పున అందర్నీ ఒకసారి చూసింది. తర్వాత టేబిల్ మీది ఫైల్సు సర్దుతుంటే—'ఆహ్వానం' అనే ఎర్ర అక్షరాల కార్డు కనపడింది. తీసి చూసింది.

నా తృతీయ పుత్రిక నాల్గవ జన్మదినోత్సవ సందర్భంలో............నా స్వగృహమున జరుగు విందునకు తాము తప్పక విచ్చేయవల్సిందిగా ఆహ్వానిస్తున్నాను. ఏతత్ సందర్భమున జరుగు పాటకచేరిని కూడా విని ఆనందించగలరని భావిస్తున్నాను.

విందు : రా॥ 7 గంటలకు.
పాటకచేరి : రా॥ 9 గంటలకు.

ఇట్లు
మిత్రుడు,
మంత్రమూర్తి
దుర్గా ఆటోమొబైల్సు,
విజయవాడ.

పైన తారీకూ, పాటకచేరి వివరాలు వున్నాయి. రేపే! భర్త కిలావున్న ఈ తరుణంలో తాను మాత్రం విందులకీ, పాట కచేరీలకీ వెళ్ళడం? తానేదో చెప్పి తప్పుకోవాలి... అనుకుం దామె.

కాని, పదకొండింటికి వస్తూనే మంత్రమూర్తి మామూలుగా గబగబ లోపలికి వెళ్ళిపోకుండా నిదానంగా ఒక్కొక్క క్లర్కుదగ్గరే ఆగి నుల్చుని "రేపటి విందాహ్వానం అందిందనుకుంటాను కైలాసం గారూ! తప్పకండా రావాలి సుమా!" అన్నాడు. "ఏం సుబ్బా రావు! నువ్వూ రావాలి. నువ్వు రాకపోతే విందు కళ కట్టదు!" అన్నాడు. కాంతారావునూ, సుబ్రహ్మణ్యాన్నీ అలాగే పలకరించా డాయన. పార్వతి చూడగా, ఆయన స్వేచ్ఛగా గుమాస్తాలతో మాట్లాడ్డం ఇది తొలిసారి.

అయినా ఆయన మాటలు హుందాగా, ఆజ్ఞాపిస్తూన్నట్టే ధ్వనించాయి. ఆయన తాపీగా వెనక్కి తిరిగి, పార్వతి టేబిల్ దగ్గరకొచ్చాడు. ఆమె ఏదో కాయితంవంక చూస్తున్నట్టుగా కూచుంది. యజమాని అంటే భయం.

"అమ్మాయి! ఆహ్వానం అందిందా?" అని ప్రశ్నించాడు మృదువుగా.

"అందిందండి," అన్నది పార్వతి.

"రేపు ఆఫీసు ఉండదు...నువ్వు తప్పకుండా రావా లమ్మాయి. మీవార్నికూడా తీసుకురా...బండిపంపిస్తాను," అంటూ జవాబుకు ఎదురుచూడకుండా లోపల కెళ్ళిపోయా డాయన. ఆయన ఎదట నిలబడే వున్నప్పటికీ పార్వతి ఏమీ చెప్పలేకపోయింది.

అందరూ విందుకీ, పాటకచేరీకి గావటం ఖాయం ఐంది.

పార్వతికి ఇంకో అనుమానం పట్టుకుంది–భర్త ఎలా బయల్దేర తాడా అని. ఆ రోజు రాత్రి భర్తతోటి యాజమాని స్వయంగా ఆహ్వానించారని చెప్తూ ఆహ్వాన పత్రిక చూపించింది.

"నా కాలు ఎలావుందో చూస్తూ నన్ను రమ్మంటూ వేమిటి బుద్ధిలేకుండానూ?" అన్నాడు సాంబశివరావు. "ఒక్క అడుగైనా వెయ్యలేనుగదా? నీకు తెలీదూ? నీకు తప్పదంటే నువ్వెళ్ళు!" అనేశాడు.

ఇక ఎంత బతిమాలినా వినదనుకొని పార్వతి గూడా వూరుకుంది.

## 27

మర్నాడు మధ్యాన్నానికే నలుపురంగు ప్లిమత్ కారు వొచ్చి కాళిదాసు ఇంటిముందు ఆగింది. అపుడు సమయం షుమారు మూడవుతుంది. మంత్రమూర్తి అందులోంచి దిగి కాళిదాసు ఇంట్లోకి వెళ్ళాడు. ఆయన వస్తాడని ముందే తెలుసుగాబట్టి, కాళిదాసు ముందులో గదిలో కూర్చున్నవాడల్లా కారుహారన్ వినిపించగానే ఎదురు వొచ్చి లోపలికి తీసుకెళ్ళాడు. ప్రశాంతంగావున్న మధ్యహాల్లో సోఫాల్లో గా కూర్చున్నా రిద్దరూ.

"మీ ఇంటికిరావటమంటే నాకు చాలా ఇష్టం కాళిదాసు! ఏదో ఆశ్రమానికి వొచ్చినట్టనిపిస్తుంది," అని మంత్రమూర్తి అనగా—

"అవునులెండి. సందడేమీ వుండదుగదూ? ఏమిటో మూర్తిగారు! నాకు నిశ్శబ్దతంటే ఎక్కువ ఆసక్తి," అన్నాడు కాళిదాసు చిరునవ్వుతో.

మంత్రమూర్తి "ఇంకో ఆరునెల్లకల్లా ఆ నిశ్శబ్దతకు భంగం కలుగుతుందని అనుకుంటాను?" అంటూ వుండగానే, వేదవతి మూడు కాఫీ కప్పులూ పట్టుకొచ్చింది. మంత్రమూర్తి అన్న మాటలు చెవిని సోకగానే ఆమె కొంచెం సిగ్గుపడిన మాట నిజమే. ఐనా సర్దుకుని "రండి, రండి, మీరే స్వయంగా రావాలా ఏం? కారు పంపిస్తే చాలదూ! "అంటూ ఆమెకూడా కొంచెం దూరంలోవున్న మరొక పేము కుర్చీలో కూచుంది, కాఫీ చప్పరిస్తూ.

"చిట్టి కాళిదాసు పుట్టి, ఈ ఇంట్లో అల్లరి ప్రారంభిస్తేగాని ఈ ప్రశాంతతకు వాంఛనీయమైన భంగం కలగదు మరి! అన్నట్టు కాళిదాసూ! మైలు పోండి. వేళయింది. మధ్యాన్నం టిఫెన్ కూడా అక్కడే ఏర్పాటుచేశాను. అందరూ వొచ్చే వుంటారు. పదండి," అన్నాడాయన కాఫీ రెండు గుక్కల్లో తాగేసి.

"ఏమండి! పార్వతినిగూడా మనతోపాటే తీసుకెళ్తే సరిపోదూ!" అన్నది వేదవతి భర్తతో.

"అవును," అని మాత్రం అన్నాడు కాళిదాసు.

"మరి కాళిదాసూ, ఆమె భర్తకూడా వస్తాడేమో? ఇంకో సారి కారు పంపిస్తే ఇద్దరూ వస్తారుగదూ?" అన్నాడు మంత్రమూర్తి.

"అదీ నిజమే. మనం ముందు వెళ్దాం రండి," అంటూ లేచాడు కాళిదాసు.

కాస్సేపయ్యాక ముగ్గురూ కారుమీద బయిలుదేరారు.

బందర్ రోడ్డు చివర విశాలమైన ఖాళీప్రదేశం మధ్య వున్నది మంత్రమూర్తి బంగళా. బ్రహ్మాండమైన ఇల్లు. అది పూర్వీకులు కట్టించిన భవనం. మంత్రమూర్తి చేసిన మార్పల్లా బంగళాచుట్టూ రమ్యమైన పూలతోట వేయించటం.

కారు బంగళాగేటుగుండా లోపలికెళ్ళి ఆగింది. ముగ్గురూ దిగాక మంత్రమూర్తి "వాసూ, నువ్వు కారు తీసుకెళ్ళి మన పైపిన్టు అమ్మాయిని తీసుకురా. తొందరగా రావాలి!" అని ఆజ్ఞాపిస్తూ లోపలికి దారితీశాడు.

దాదాపు అరవైమంది అతిథులున్నారక్కడ. కొందరు అటూ ఇటూ బంగళా అన్ని మూలల్లోనూ తిరుగుతున్నారు. పిల్లలు గంతులేస్తూ సంతోషంగా ఇల్లెగిరి పోయేట్టుగా గోలచేస్తున్నారు.

మగవాళ్ళందరూ పెద్దహాలు పక్కనేవున్న ఇంకో విశాలమైన గదిలో కూర్చున్నారు. మంత్రమూర్తి వ్యక్తిగతాభిరుచు లన్నీ ఈ గదిగోడలకున్న దంతపుబొమ్మల తీరులోనూ, అక్కడక్కడ చిత్రకళా ప్రదర్శనాల్లో అభిలాషకొద్దీ కొనుక్కొచ్చి విలువగల ఫ్రేములలో బిగించి, గోడలకు వ్రేలాడదీసిన తైలవర్ణ, నీటిరంగుల చిత్రాల మూలంగా ద్యోతకమౌతున్నాయి. మొత్తం మీద కిందపరచిన సిరిచాపలూ, జంఖానాలు అన్నీ చిత్ర విచిత్ర వర్ణాలతోనిండి, ఆ అతిథులకు గది మరింత ఆహ్లాదం గొల్పుతోంది.

కాళిదాసు లోపలికి అడుగు పెట్టగానే, అంతకు ముందునించీ అక్కడి కోలాహలానికి కారకుడైవున్న మాధవరావు "నాకు చిత్ర కళ అంటే అంత అభిరుచి లేదోయ్!" అంటూ ఎదురొచ్చాడు.

కాళిదాసు మాధవరావులచుట్టూ పదిమంది స్నేహితులు పోగైనారు. కాళిదాసు "బొమ్మలంటే ఏమిటో ఓ న మా లు తెలియని నేనే అదిగో, ఆ గోడకున్న ఒక తైలవర్ణ చిత్రంవైపు చూస్తూ, ముగ్ధుణ్ణవుతాను. ఎన్నిసార్లు చూసినా ఆ లోతూ గాంభీర్యం, మనస్సును వొదలవు !" అన్నాడు.

అందరూ ఆయన చూపించిన చిత్రం వంక చూశారు. బావురుమంటున్న మైదానం. సంధ్యాకాలపు ఎర్రని సూర్యకాంతి ఆ మైదానమంతటా ప్రసరిస్తోంది. ఆ మైదానం మధ్య ఒక్క ఈత చెట్టు అచల్లటిగాలి వేగాన్ని సూచిస్తున్నట్లుగా ఆకులు; ఒక వైపుగా వాలివున్నాయి. ఈత చెట్టుకింద అలిసిపోయి, ఆ తుదిఘట్టంలోవున్న ఒక ముసలివాడు కూర్చున్నాడు.

అందరూ కాళిదాసు అంతగా భావోద్రేకంలో పడక పోయినా 'బాగుందంటే బాగుందన్నారు'. మాధవరావు మాత్రం పెదవివిరిచి, "నేనీమధ్య ఓ పత్రికలో చూశాను. మొహం చిన్నదీ ముక్కు పెద్దదీ వేశాడు. కింద పేరు 'వాసనానుభవం,' అని వ్రాశాడు ! ఏమిటోయ్ ! చిత్రికళకూడా అదోరకం మాయ... దాన్ని విమర్శించలేము" అన్నాడు.

అందరూ నవ్వారు.

దీనికి సమాధానం చెప్పే ధోరణిలో మంత్రమూర్తి "మాయ అన్నమాటగూడా నిజమే. చిత్రకారుడు ఏ రసాను భూతిలో ఉండి బొమ్మ గీశాడో దాన్ని ప్రధానంగా తీసుకుని చూస్తేగాని మన మనస్సులుగూడా ఆ రసానుభూతిలో పడిపోవు. అదే మాయ అనుకుంటాను," అన్నాడు.

బైట కారాగిన చప్పుడైంది. పార్వతి మాత్రం జంకుతూ కారుదిగి లోపలికొచ్చింది. ఆ మొత్తం అతిథుల్లోనూ ఆమె అంత స్తులో వారెవరూ లేరక్కడ. ప్లీడర్ల భార్యలూ, డాక్టర్ల భార్యలూ పెద్దపెద్ద వ్యాపారసంస్థల యజమానుల భార్యలూ స్త్రీ అతిథులలో వున్నారు. పోనీ పరిచయమైనా ఒక్క వేదవతితప్ప మరెవరూ లేరు.

గొప్ప సిల్కు చీరెలు, కళ్లు మిరుమిట్లు గొల్పే ఆభరణాలు, పార్వతిని జంకుగొనేట్టు చెయ్యటంలో ఆశ్చర్యంలేదు. సన్నేని ఉతికిన తేలిక నీలంరంగు వాయిలుచీరె, అదే రంగు రవిక తొడుక్కుని ఒక్కటే ముదురు పసుపురంగు బంతిపువ్వు వాలుజడపైన దోపుకుని, చేతులకు సాదా ఆకుపచ్చ గాజులు తొడుక్కుని, మెళ్లో మంగళసూత్రం తప్ప మరేమీలేని పార్వతి అక్కడి ధనికసమాజంలో విద్యుద్దీపాలముందు ప్రమిదలా కనపడుతోంది. అయితే, ఆమె మనస్సులోని నైర్మల్యం, ప్రమిదలాగే విశుద్ధంగా ఆమె వర్ఛస్సు లోని మానవత్వపు కళ అతిస్పష్టంగా ప్రతిఫలిస్తోంది.

ఆమె లోపలికి పోకుండానే బయట వరండాలో నిలబడింది. చుట్టూ చూస్తోంది. అంతటా లక్ష్మి తాండవమే! ఎంతడబ్బు! ఈ వరండాలో ఉన్న వస్తువుల ఖరీదులో సగం వుంటే తన భర్త ప్రాణం ఈ క్షణాన్నే కాపాడుకోవచ్చు...కాని... పిచ్చి ఆలోచన.

ఇంతలోనే వేదవతి ఆమె కోసం బైటికి వచ్చింది, "ఓహో వచ్చావు? మీ వారూ వచ్చారా?" అన్నది. పార్వతికి కొంచెం బెరుకు తగ్గినట్టయింది. "వారు రాలేదండీ...కాలు బొత్తిగా కింద మోపనీయడంలేదు. డాక్టర్ చెప్పారు గూడానూ..." అంటూ వేదవతితోపాటు లోపలికెళ్లింది.

లోపలి హాలూ, గదులూ ఆమెకి మరీ దిగ్భ్రమ గల్గించాయి. వేదవతి పార్వతి విస్మయాన్ని గుర్తించినట్టే "ఇదివరకెప్పుడూ ఇక్కడికి రాలేదేమిటి నువ్వు? అన్నీ చూపిస్తానురా. ఈ ఇల్లు కట్టి 60–70 ఏళ్ళవుతుంది..." అంటూ ఏమేమిటో చెప్పుకుపోయింది.

స్త్రీలలో కలవరం—గుసగుసలూ బైలుదేరాయి.

"మంత్రిగారి ఆఫీసులో పని చేస్తుంది ఈ పిల్ల," అన్నది ఒక ప్రౌఢ కంఠస్వరం.

"ఏం పాడ్యేకాలమో తల్లీ! ఇంత చిన్నది. నలుగురు మగవాళ్ళల్లోకి తగుదునమ్మా అని వెళ్లి పనిచెయ్యడం!" అని మూతి విరిచింది ఒక ముసలమ్మ.

ఇంకో యువతి "ఇదొక విడ్డూరం అనుకుంటున్నారా అమ్మమ్మగారు! ఎంతోమంది మనదేశపు స్త్రీలే సైన్యాల్లోచేరి పని చేస్తున్నారు! తప్పేముంది? కష్టంచేసి పొట్ట పోసుకుంటున్నారు. అంతేనా?" అంది ఆ ముసలమ్మతో.

ముసలమ్మ మూతివిరిచి "తప్పేమీ లేదనుకుంటే, ఏదైనా చెయ్యొచ్చు..." అంది ఏదో సమాధానంగా.

పార్వతి చెవిలో ఇటువంటి సంభాషణలు పడుతూనే వున్నాయి. ఆమె విననట్టే వేదవతితో మాట్లాడుతూ తిరుగుతోంది. మూడుంబావుకల్లా విందు ఆరంభమైంది. మంత్రిమూర్తి వచ్చిన ప్రతిఅతిథినీ పరామర్శించసాగాడు. స్త్రీలూ, మగవారూ అంతా పెద్ద హాల్లో కలిసే కూర్చున్నారు. పార్వతి ఈ కూర్చోడంలో, వేదవతికి దూరంగా ఎవరో అపరిచితురాలి పక్కన కూర్చోవల్సి వచ్చింది. ఆ అపరిచితురాలి సంతానం పదకొండుమందీ వరసగా పక్కనే కూర్చున్నారు.

పార్వతి ఆమెనిచూసి ఆశ్చర్య పడ్డది. ఏమిటిలా వుంది ఆమె అనుకుంది. సన్నగా పొట్టి బొమికల పోగై వుందామె. మొహం చప్పగావుంది. కళ్ళు రెండూ చమురులేని దీపంలా కళాకాంతులులేకి నిర్జీవంగా వున్నాయి. రక్తంచచ్చి తెల్లగా పాలిపోయి వుందామె... వేదవతికి ఆమెని చూపించి, "ఎవరండి వారు?" అని మెల్లగా అడిగింది పార్వతి.

"వకీలు వరహాలరావుగారి భార్య. ఏం అట్లా అడుగుతున్నావు?" అంది వేదవతి. ఇద్దరూ ఫలహారాలైనాక గదిలో ఓ పక్క సోఫాలో కూర్చున్నారు.

"ఏమీలేదు... పాపం, ఆమెని చూస్తే జాలివేస్తోంది... ఏమిటలావున్నారు వారు? ఏదైనా జబ్బా?" అని కనుక్కుందామె, స్త్రీకి సహజమైన ఆసక్తి, కరుణలతోటి.

"జబ్బూలేదూ, పాడూలేదూ. నాకంటే ఎనిమిదేళ్ళో, పదేళ్ళో పెద్ద. నాకు బాగా తెలుసు. నాకు ఇంకా నైఆగు వెళ్ళి ఇరవై ఏడు ఏళ్ళు వొస్తాయి వొచ్చే ఫాల్గున మాసానికి. ఏటా కాన్పయితే ఎలా చెప్పు! రక్తమాంసాలు దక్కుతాయా శరీరానికి! ఏమోలే ఎవరి

భాగ్యం వారిదీ! ఆమెకి పదకొండుమంది పిల్లలు. నేననుకుంటాను గదా, దేనికైనా ఒక హద్దుండాలనేమోనని! పాపం వరహాలరావు గారు భాగ్యని ఇంజెక్షనలతో ఏరోజు కారోజు బ్రతికించుకుంటూ వుంటారు," అంది.

"ఆమెకి ముప్పై ఐదేళ్లయినా వున్నాయి! నలభై పైన వుంటా యనుకొన్నాను నేనూ!" అని మరింత ఆశ్చర్యపడ్డది పార్వతి.

"శరీరం కాపాడుకోవాలమ్మా. మన పెద్దలుగూడా ఏమన్నారు? 'శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం' అని కాదా? సంతాన నిరోధాన్ని ఏవో కారణాలకోసం కాకపోయినా, ఆరో గ్యం కోసమైనా ఇష్టపూర్వంగా ఎవరికి వారే అమలు పెట్టుకుంటే మంచిదని నా ఊహ..." అంది వేదవతి.

పార్వతి తన అభిప్రాయం ఏమాత్రం వెలిబుచ్చలేదు. "అవునండి!" అని మాత్రం వూరుకుంది. స్త్రీలు ఇలాగా తలా ఒక మూల నలుగురూ, ఐదుగురూ చేరి కబుర్లు చెప్పుకుంటూ వున్నారు.

మరొక పక్క పురుషులూ అలాగే కబుర్లాడుకుంటున్నారు. మాధవరావు తన సహజ హాస్యధోరణిలో అందర్నీ నవ్విస్తూ తిరుగు తున్నాడు. లోపలిగదిలో మంత్రిమూర్తి, కైలాసం కొంచెం పక్కకి తప్పుకుని ఏదో విషయం మాట్లాడుకుంటున్నారు.

కైలాసం "మీ అక్కగారుగూడా వెళ్లిపోయినట్టున్నారు. ఇప్పుడంతా వంట వార పెత్తనమే గదండి!" అని అడిగాడు. ఆయన ఒక్కడు, మంత్రిమూర్తి సిబ్బందిలోకల్లా ధైర్యంగా అన్ని విషయాలూ మంత్రిమూర్తితో చర్చించగలడు.

మంత్రిమూర్తి "పెద్దబ్బాయి దిగులు లేదనుకోండి. వాడు హాయిగా హైస్కూలుకి వెళ్తున్నాడు. మిగతా ముగ్గురిదే సమస్య. మా అక్కయ్య ఎన్నాళ్ళుంటుం దిక్కడ—దాని సంసారాన్ని ఢిల్లీలో వొదిలిపెట్టి? అయినా, నేనేం దిగులుపడటంలేదు. ఎలాగో నేనే వాళ్ళని పెంచి పెద్ద చేసేస్తాను — ఇంకో పదేళ్లు వోర్చుకుంటే..." అన్నాడాయన అదో ధోరణిలో.

కైలాసం పిల్లల ప్రసక్తి తెస్తే, యజమానికి బాధగా వుంటుందని తెలిసినా ఇవ్వాళ ఆ విషయం తేక తప్పలేదు. "ఏది ఏమైనా మగవాళ్ళం పిల్లల్ని ఆడవాళ్ళంత సున్నితంగా పెంచలేమండి," అన్నాడు.

ఈ ప్రశ్న భార్య పోయిన కొత్తలోనే కలిగినా, తిరిగి వివాహము చేసుకోటానికి తీవ్రంగా నిరాకరించి తానే పిల్లల్ని సమర్థించుకొన్తూన్న మంత్రమూర్తి "ఈ మాటలకేం పోనివ్వండి. ఎలాగో ఒకలాగ వాళ్ళే పెరుగుతారు. పిల్లలు నలుగురూ తోటలో తెగ ఆగడం చేస్తున్నారు ఇవ్వాళ—ఈ సందడిలో ఎవరూ ఏమీ అనరు గదా అని! సుశీలను కాస్త లాక్కొచ్చి నీళ్లుపోసి కొత్త గుడ్డలు తొడిగే ఏర్పాటు చెయ్యాలి. తోటలో కొత్తగా వేసిన పూల మొక్కలు పాడుచేస్తారేమో! మన వాళ్ళకి తోడు ఇంకా పాతిక మంది చేరారుగదా!" అన్నాడు మంత్రమూర్తి. ఆయనకి తన పిల్లల మీద ఎంతటి వాత్సల్యమో, తన తోటలో ప్రతి మొక్కమీదా అంతటి ప్రేమ. స్వయంగా ప్రతిమొక్క సంగతి విచారించి తెలుసుకొనందే ఆయనకి నిద్రపట్టదు.

కైలాసం ఆ కుటుంబానికి హెడ్ గుమాస్తాగానూ, ఆప్తుడుగానూ పాతికేళ్ళనించీ పరిచయుడు. "ఇదిగో వెళ్లి లాక్కొస్తాను. పిల్లలు గాదండి? ఏదో సరదా! మన కట్టుదిట్టాలన్నిట్నీ వాళ్ళు మన సమక్షంలోనే పాటించడం అంతంత మాత్రం. పరోక్షంలోనా!" అనుకుంటూ చరచరా తోటలోకెళ్ళాడు.

గంట నాలుగు కొట్టింది—మ్యూజిక్ హాల్లోని గోడగడియారం సంగీత స్వరాలలో మేళవించి. తోటంతా పచ్చగా రకరకాల పూల మొక్కలతో, క్రోటన్సులతో చాలా ఆకర్షణీయంగా వుంది. జనవరి నెల ఎండ పొడలో సుఖంగా కేరింతలు కొడ్తూ ఆడుకుంటున్నారు అతిథుల పిల్లలూ, మంత్రమూర్తి పిల్లలున్నూ.

మంత్రమూర్తికి నలుగురు పిల్లలు. పెద్దవాడికి పన్నెండేళ్లు, రెండోవాడికి ఎనిమిదేళ్లు, మూడవ అమ్మాయికి ఆరేళ్లు. నాలుగో అబ్బాయికి నాలుగేళ్ళు. చివరి కుర్రాడ్ని ప్రసవించి తల్లి కళ్లుమూసింది. ఆ రోజునించీ మంత్రమూర్తి నర్సుల సాయంతోటీ, బంధువుల సాయం

తోటీ పిల్లల్ని పెంచుకొంటున్నాడు. కొడుకులందరూ తండ్రిపోలికల్లో వున్నా, కూతురు ప్రతిచేష్టా, పోలికా ఆయన భార్య ప్రతిబింబమే కావడంతోటి తండ్రికి కూతురు సుశీలఅంటే అపరిమితమైన వాత్సల్యం.

తోటలో పిల్లలు పదేసిమంది ఓ గుంపుగాచేరి ఏమిటో ఆటలాడుకొంటున్నారు. వాళ్ళందరికీ నాయకుడల్లే మంత్రమూర్తి పెద్ద బ్బాయి ఆడిస్తున్నాడు.

కైలాసం "అమ్మా! సుశీలా! ఇటు రా! నీళ్ళు పోసుకుని కొత్త గుడ్డలు కట్టుకోవద్దూ?" అని పిల్చాడు.

ఆటల రంధిలో వున్న సుశీల "నేను రాను పొండి!" అనేసి తన ఆటలో నిమగ్నురాలైంది. ఇక కైలాసం పిల్లలందర్నీ గదమాయించక తప్పలేదు. ఆయన సుశీలను చేయిబట్టుకుని తీసుకొస్తూ, "అమ్మాయి! చదువుకుంటున్నావా బాగా," అని అడిగాడు.

"ఓ!" అంది అమ్మాయి. తల్లిలాగా ఎర్రనీ ఎరుపు, ఆ పిల్ల నవ్వితే ఆ అందం, చూసేవాళ్ళ హృదయాలించి అంతలో తొలగిపోదు. మిగతా ముగ్గురు అబ్బాయిల ఉంగరాల జుట్టూ, ఠీవియైన నడకా, కోల మొహాలూ, నీలి కళ్ళూ, అడుగడుగునా వాళ్ళ నాన్ననే జ్ఞప్తికి తెస్తాయి.

కైలాసం పిల్లలుగలవాడూ, పిల్లల్ని ఎలా లాలించి మంచి మాటలుచెప్పి దారికి తీసుకురావాలో తెలిసినవాడు. ఆయన వాళ్లు నలుగురికీన్నీ మంచి మాటలుచెబుతూ లోపలికి తీసుకెళ్లి, పనిమనిషి కప్పచెప్పి నీళ్ళు పోయించి, కొత్త గుడ్డలు తొడిగి హాల్లోకి పంపించాడు.

హాల్లో మిగతా పిల్లలు అట్టే అల్లరిచెయ్యకుండా మాధవరావు సినీరికార్డులు వేస్తూవుంటే వింటూ కూర్చున్నారు. పార్వతి వేదవతితోటి "ఏమండి, మా యజమానిగారి పిల్లల్ని నేనింతవరకూ చూడలేదు!" అంది.

వేదవతి, మంత్రమూర్తి దగ్గరగా నుల్చునివున్న పెద్దబ్బాయినీ, కైలాసం పక్కన నుంచుని ఆయన్ని ప్రశ్నలతోటి వేధిస్తున్న అమ్మాయి సుశీలనూ, వాళ్లెవరికీ అందకుండా తామిద్దరే విడిగా

కూర్చుని ఆడుకుంటున్న చిన్నబ్బాయినీ, చంటి అబ్బాయినీ వరసగా చూపించింది.

"పిల్లలు బంతులల్లె వున్నారు. పాపం, తల్లి లేదటగా!" అన్నది పార్వతి.

"అవును. పాపం. అదే లోటు వాళ్లకి. అయితే, ఏం? వాళ్ల నాన్నే వాళ్ళకి తల్లీ, తండ్రీ అన్నీ ఐ పోషిస్తున్నారు. వాళ్లకేం లోటు లేదనుకో..." అంటూ తర్వాత మెల్లగా గొంతు తగ్గించి, "నువ్వేనన్నా చెప్పు, అసలు ఆడవాళ్ల పెంపకమే వేరు! ఆ పెద్ద పిల్లాడు వొట్టి మరుసు. రెండో కుర్రాడూ, మూడో కుర్రాడూ అలాగే తయారౌతున్నారనుకుంటాను. మగవాళ్ళు సగం గారాబం చేసీ, సగం తమ పనుల్లో వాళ్లని యథేచ్ఛగా వొదిలీ—పాడుచేస్తారు," అన్నది వేదవతి.

ఈ సంభాషణ ఇక్కడ సాగుతున్నప్పుడే కాళిదాసూ, మాధవరావూ, మంత్రిమూర్తీ బైట వరండాలో ఇంకా పదిమంది అతిథులతో కలిసి కూర్చుని సిగరెట్లు తాగుతూ మాట్లాడుకుంటున్నారు.

మాధవరావు "ఏమండి కాళిదాసుగారూ! ఇక్కడ వోటింగ్ తియ్యండి. ఎంతమంది క్రాస్‌వర్డ్స్ ఆడుతున్నారో, ఎంతమంది ఆడటం లేదో?" అన్నాడు తమాషాగా.

"నీకు అవంటే ఎందుకంత కక్ష?" అడిగాడు కాళిదాసు.

"ఎటువంటి జూదం అన్నా చీదరించుకునే వాళ్లని, అమాయకుల్నీ గూడా లాగేస్తున్నాయి యీ క్లబ్బులు! అబ్బబ్బ ఆశ ఎంత చెడ్డదోయ్!" అన్నాడు మాధవరావు.

"ఐతే నీవు క్రాస్‌వర్డ్స్ కట్టడం లేదు గనక, ఆశ లేనివాడివన్న మాటే!" అన్నాడొక స్నేహితుడు. ఆయన ప్లీడరు.

"ఆశలేనివాళ్లని అర్థమంటే సత్యారావుగారూ! తమరూ క్రాస్‌వర్డ్స్ భర్తీ చేస్తేనన్నమాట!" అని అందుకున్నాడు మాధవరావు.

"ఏమోనోయ్ మాధవరావు! ఒకవేళ ఎప్పుడైనా ఒక ఛాన్సు రాకూడదా? నాకే దెబ్బతో లక్షాధికారి! ఎవరో ఒకరికి బహుమానం వస్తూనే వుందిగా?" అన్నాడొక ముసలిప్లీడరు.

"అయ్యో రామచంద్రా! రామకోటీశ్వరరావుగారూ! మీరూ ఆడుతున్నారా! మోక్షమే సాధనమనుకుని సదా భగవద్గీత పఠనం చేసే ధృఢచిత్తుల్ని సైతం క్షుద్రపు ఆశల్లోకి లాగేస్తోందే ఈ క్రాస్ వర్డ్స్ పిచ్చి!" అన్నాడు మాధవరావు.

ఇలాగా మాధవరావు మాట్లాడుతూనే, ఎవరెవరు క్రాస్ వర్డ్స్ కట్టేని సూక్ష్మంగా లెక్కకట్టి చివరికి "ఇక్కడవున్న మనలోనే సగటున నూటికి సగం మంది ఆడుతున్నారు. ఇంకేమిటి? తెలిసినవాళ్ళమే ఇలా ఐతే, ఇక తెలియని అజ్ఞానుల సంగతేమిటి?" అన్నాడు మాధవరావు.

"ఏమిటోయ్ నీ కంఠ శోష — ఏదో ఉద్ధరించేవాడికి మల్లే? దేశంలో గుర్రప్పందాలు తీసేయించు; క్లబ్బుల్లో చీట్లపేకలు మాన్పించు చేతయితే," అన్నాడు కాళిదాసు.

మాధవరావు ఆ ప్రసక్తి మారుస్తూ "పసిపిల్లలకి పుట్టినరోజు పండగలు చేసుకుంటూంటారు ఏదో సరదా కొద్దీనూ! పెద్దపెద్ద సినీస్టార్సు ఇరవై ఆరో పుట్టినరోజూ, నలభై యేడో పుట్టినరోజూ అని పండగలు చేసే వివరాలు పత్రికల్లో చూస్తే నవ్వొంగదండి. వాళ్ళ వయస్సెంతో ఈవిధంగా ప్రకటన చెయ్యడమే వాళ్ళ ఆశయమనుకుంటా. ఒక బొంబాయి నటి అరేళ్ళుగా ఇరవై రెండో పుట్టిన దినోత్సవమే చేసుకున్న వివరం ఆ మధ్య పత్రికల్లో పడ్డది. చాలా ఆశ్చర్యం వేసింది!" అన్నాడు.

"నీ వన్నీ అతిశయోక్తులు!" అన్నాడు మంత్రమూర్తి.

"అతిశయోక్తిలో అంతర్భూతమైవున్న నిజం ప్రధానం!" అన్నాడు మాధవరావు.

"ఎప్పటికీ వయస్సెంతో బైటకి చెప్పని మనస్తత్వానికి నిరూపణ గాబోలు!" అన్నాడు జూనియర్ ప్లీడరొకాయన నవ్వుతూ.

మరో అరగంట గడిచాక కైలాసాన్ని వంట అదీ సరిగ్గా జరుగుతుందో లేదో చూడమని పురమాయించిన సందర్భంలోనే "ఏదండి మన టైపిస్టు అమ్మాయి! కనపడనేలేదే?" అని అడిగాడు మంత్రిమూర్తి.

"వంట గదిలోనే వుండమన్నాను నేనే. మీతో ఒక్కమాట చెప్పాలని వుందండీ," అని కైలాసం ప్రారంభించి పార్వతికి ఇటీవల సంప్రాప్తించిన అవాంతరాలన్నిటినీ వివరిస్తూ "ఆమె నిన్న నే చెప్పి ఏడ్చిందికాలో. నెలజీతంలో ప్లాస్టర్ చికిత్సకి పాతిక ఐపోతున్నాయట. సంసారం గడవడం చాలా కష్టంగావుందట. మీరే దైనా దారిచూపాలి ఆమెకి!" అన్నాడు జాలిని ఎదటివాళ్ళలోనూ దీప్తించేట్టు చేసే గొంతుపెట్టి.

"దానికి మనమేం చెయ్యగలం? మీరూ ఆలోచించండి. ఆఫీసుపనికి ఆమె కింతకంటే ఎక్కువజీతం ఇవ్వటానికి కారణం కన పడదు! పెద్ద మొత్తంగా సర్దటానికి నాకు వీలులేదు ఈ పరిస్థితుల్లో!" అన్నాడు యజమాని.

"ఇక్కడ పిల్లలకి చదువూ అదీ చెప్పటానికి ఎవరైనా కావాలని ఒకసారి నాతో మీరు అన్నారుగా," అని అందించాడు కైలాసం.

"ఆలోచిద్దాంలెండి. మీరు లోపలికిపోయి విందుఏర్పాట్లు పూర్తిచెయ్యండి," అని ఆజ్ఞాపించి, మంత్రమూర్తి అక్కడ్నించి తప్పుకున్నాడు.

ఇంత సేపట్నించీ మగ అతిథులలో ఒకమూలగా పీటన్నంత వరకూ యజమానిని తప్పుకు తిరుగుతూన్న సుబ్బారావూ, కాంతారావూ, సుబ్రహ్మణ్యమూ ఏమిటో మాట్లాడుతూన్నా సుబ్బారావుని ఓ భయం తినేస్తూంది. అతను పార్వతిచేత పరాభవింపబడిన మర్నాడుదయం కాంతారావు యథేచ్ఛగా గొంతు బాగా తగ్గించి, "ఏమిటిరా సుబ్బారావు! నీవంక కైలాసం అట్లా కొరకొరచూస్తున్నాడు?" అన్నాడు. కైలాసం యేదైనా విషయం జ్ఞాపకంవస్తే అలా చూడ్డం పరిపాటి. ఇది మిగతా క్లర్కులకూ తెలుసు. అయినా, ఆవేళ హెడ్ క్లర్కు సుబ్బారావువైపు చూడ్డంతోటి కొంచెం న్యూనత అనిపించి కాంతారావు ఆ మాట అన్నాడు.

సుబ్బారావుకి గుండె ఝల్లుమంది. పార్వతిగాని హెడ్ క్లర్కుతోటి నిన్న జరిగినవ్యవహారం చెప్పి చచ్చిందేమో! ఇంకేముంది! హెడ్ క్లర్కు సాయంత్రం ఆఫీసువేళ అయినాక పిల్చి

మందలించి... అంతకంటే ఎక్కువగా ఊహించలేక పోయినాడతను. ఆ వేళ అట్లాంటిదేమీ జరగలేదు. మర్నాడల్లా ఇలాంటి పిలుపు కోసం, చివాట్లకోసం, ఉద్వాసనకోసం ఎదురుచూస్తూ కూర్చు న్నాడు. హెడ్ క్లర్కుదాకా పోయినవిషయం ప్రొప్రయిటర్ కీ తెలిసే వుంటుందని ఊహించుకున్న అతని నేరంచేసిన మనస్సు, అనుమానంతోటీ, భయంతోటీ తహతహలాడి పోయింది. ఆ వేళ ప్రొప్రయిటరు మామూలుగా పిల్చి కాయితాలిచ్చిన ప్రతిసారీ అల్లాడిపోయాడు. గదినించి బైటికివొచ్చేవరకూ అతనిప్రాణాలు అరచేతిలో పెట్టుకుని వ్యవహరించాడు.

విందుకి రమ్మని ఆహ్వానించడానికోసం, యజమాని వొచ్చి నప్పుడుగూడా సుబ్బారావు లోలోపల వొణికిపోయాడు. తర్వాత కాస్త తమాయించుకొన్నాడు. 'ఇది తక్షణప్రమాదం కాదేమో!' అన్న నిర్ణయానికి వచ్చాడు. అయినా తప్పుచేసివున్నాడు గనక ఏ క్షణాన తననెత్తిన పిడుగు పడుతుందోనని భయపడుతూనే వున్నాడు.

విందునాడూ అంతే జరిగింది. అనుక్షణం భయంతోటి సంచ రిస్తున్నాడు. కాంతారావు, సుబ్రహ్మణ్యంలలాగా స్వేచ్ఛగా పిచ్చా పాటీ మాట్లాడలేక పోతున్నాడు. అయితే, ఈ భయాన్నిమించి, ఈ మానాన్నిమించి అతని చూపులుమాత్రం, అక్కడి ఆడవాళ్ళల్లో పార్వతి ఎక్కడవుందాఅని వెతుకుతున్నాయి. పార్వతి నుల్చొని వేదవతితోటి మాట్లాడుతూన్నా, నిదానంగా కూర్చుని ఆలో చిస్తూన్నా, అటూ ఇటూ తిరుగుతున్నా అతనిచూపులు దొంగ తనంగా ఆమెమీదనే కేంద్రీకృతమై వున్నాయి.

ఆమె ప్రతి కదలికా ఆ కాముకుడి అసంతృప్తి వాంఛల్ని విప రీతంగా రెచ్చగొట్టి, మరు నిమిషమే ద్వేషంగా మారిపోతోంది.

"ఈ పీడని ఆఫీసునించి వొదిలిస్తేగాని మనం బతకలేం," అన్న నిశ్చయానికి అతను క్రమంగా వచ్చేస్తున్నాడు. ఆమె తన కెదురుగా కూర్చుని పనిచేస్తూవుంటే తనలో జరిగే అనుక్షణ దహ నాన్ని భరించడం అసాధ్యం.

సుబ్బారావు ఈ ఆలోచనల్లో వుంటూనే యజమానీ, కైలాసం రెండు మూడుసార్లు విడిగా కలుసుకుని మాట్లాడ్డం చూసి నప్పుడల్లా సహజంగానే వొణికిపోయాడతను.

విందు ఐపోగానే పార్వతి వేదవతికిన్నీ, కైలాసానికిన్నీ చెప్పేసి ఇంటికి వెళ్లిపోయింది. ఆమె వెళ్లిపోయిన తర్వాతగాని, సుబ్బారావు మామూలుస్థితికి రాలేకపోయాడు. ఆ తర్వాత అతను పాటకచ్చేరీనిగూడా విన్నాడు. అనుభవించాడు.

## 28

మధ్యాహ్నం మూడుగంటలవుతోంది. ఆదివారం అవటం వల్ల బజార్లన్నీ ప్రజాబాహుళ్యంతో నిండివున్నాయి. సుబ్బారావు ఆలోచిస్తూ, సత్యనారాయణపురంవైపు వెళ్తున్నాడు. అతని ఆలోచనల్లా ఒక్కటే—ఎలాగైనా పార్వతికి ఆఫీసునుంచి ఉద్వాసన చెప్పించాలని. దానికి తాను ఏంచెయ్యాలో అతడు నిర్ణయించుకో లేక పోతున్నాడు. హెడ్‌క్లార్కుగాక, తాను ముస్సరూ ఏక మైతే పార్వతిలో లక్షతప్పులు వెతికి పట్టుకోవచ్చు. అయితే, ఈ విషయం కాంతారావుతోనూ, సుబ్రహ్మణ్యంతోనూ సంప్రదించడం ఎలా? దానికి వేరే మార్గం ఆలోచించాలి. సుబ్బారావు పాట కచేరీకి వెళ్లి వొచ్చిన రాత్రల్లా ఆలోచించి, ఒక పన్నాగం పన్నాడు. అంతా తనలోనే అనుకున్నాడు. దాన్ని క్రియారూపంలో పెట్టటానికి ఐదురోజులు తర్వాత ఆదివారంగాని కుదరలేదు.

లీలారామేశ్‌కి పూర్వం ఆ ఆఫీసులోనే పనిచేస్తూవుండిన ఒక ఆవిడ జ్ఞాపకం వొచ్చిందతనికి. ఆమె సరిగ్గా పనిచెయ్యక పోతే తీసివేశారు పనిలోంచి. ఆమె అప్పట్నించి అక్కడక్కడా తాత్కాలికంగా నౌకరుచేస్తూ ఇబ్బందిగా కాలంగడుపుతోంది. ఆమె అప్పుడప్పుడు సుబ్బారావుకీ, కాంతారావుకీ కనపడి, తనకు మళ్లీ ఉద్యోగం ఇప్పించమని కోరింది కూడా. ఇప్పుడు ఆమె జ్ఞాపకం వొచ్చింది సుబ్బారావుకి.

ఆమెని ప్రోత్సహించి కాంతారావు దగ్గిరకి పంపిస్తే, ఆమెకీపని ఇప్పించాలనే ఉద్దేశాన్ని అతనికి గాఢంగా కలిగిస్తే ఇక తనపని పరోక్షంగా నెరవేరినట్టే.

సుబ్బారావు సత్యనారాయణపురంలో ఓ పక్కగావున్న ఒక సందులోకెళ్లి ఒక పెంకుటింటి ముందు ఆగి, "మేరీ!" అని కేకేశాడు. మేరీ బైటకి వొచ్చింది. ఆమెకి 23, 24 ఏళ్లుంటాయి. గిరజాల్లాగా జుట్టు కత్తిరించుకుంది. నల్లని నలుపుఛాయ. మాసిన తెల్లగౌను వేసుకుంది. మెళ్ళో శిలువగూడా మెరుగు తగ్గి మెరవటం లేదు.

"ఓ... మీరా సుబ్బారావుగారు! రండి!" అంది ఆమె. సుబ్బారావుకి లోపలికెళ్ళడం ఇష్టంలేక "రండి, అలా వెళ్దాం. మీతో ఒక సంగతి మాట్లాడాలి..." అన్నాడు. మేరీకికూడా ఇష్టంలేదు అతన్ని లోపలికి పిలవడం—ఎంచేతంటే తన దారిద్ర్యం బైటపడిపోవడం ఆమె కిష్టంలేదు.

"వస్తున్నా వుండండి." అని ఆమె లోపలికెళ్లి తలదువ్వుకుని, పౌడరు కొంచెం మొహానికి రాసుకుని వొచ్చింది ఐదారు నిమిషాలకి.

"ఇప్పుడేం చేస్తున్నారు?" అని అడిగాడు సుబ్బారావు నడుస్తూ.

"ఏమీ లేదండి. మా ఇంటివారు తెచ్చే రాళ్ళతోటి సరిపుచ్చుకుంటున్నాము. చాలా ఇబ్బందిగా వుందండి! ఏం విషయం—ఇటొచ్చారు?" అన్నది ఆమె ఆశతోటి.

"ఏదో విశేషంవుంటేనే వచ్చాననుకోండి! మా ఆఫీసులో ఇప్పుడు పనిచేస్తున్న అమ్మాయి పని మాకెవరికీ నచ్చడం లేదండి. ప్రొప్రయిటర్‌గారు ఇంకా పైకనలేదనుకోండి. ఎప్పుడో అంటాడులెండి. ఆమె ఈ ఉద్యోగాని కిదే కొత్త. తొందర పని, నిదానం పని తేడా తెలీదు. ప్రొగ్రెసు మందమతి. అందులోనూ ఆమెకి పర్సనల్ బర్డెన్సు—సంసార తాపత్రయం జాస్తి. ఇక్కడిపనులే చేస్తుందా, ఇంటి ఆలోచనలే చేస్తుందా?... ఆమెకి త్వరలోనే చీట్ ఇచ్చి పంపించాలి... దానికి మీరొక్క పని చెయ్యాలి! మీరు అనుభవజ్ఞులు. మా ఆఫీసు అనుభవంకూడా బాగావుంది మీకు. మీరు ఈపళంగా వెళ్లి కాంతారావును పట్టుకున్నారా, ఆ ఉద్యోగం మీదే. నేనే చేసేవాణ్ణి. కాని, అతను నాకంటే సీనియర్. అతని

ద్వారా చెప్పిస్తే హెడ్ క్లార్కు కూడా వింటాడు!" అన్నాడు సుబ్బారావు.

"దానికేం? అలాగే. మరి కాంతారావుగారెక్కడ దొరుకుతారు సార్?" అని ప్రశ్నించింది మేరీ.

"ఐదున్నర, ఆరింటికి థియేటర్ కి వెళ్లండి. అతనక్కడ నేల టిక్కెట్ల బుకింగ్ లో వుంటాడు. కొత్తగా పార్టు టైమ్ వర్కు చేస్తున్నాడు లెండి!" అన్నాడు సుబ్బారావు.

"చాలా మంచివార్త చెప్పారండి సుబ్బారావుగారు! థాంక్స్!" అన్నది మేరి.

"అయితే, నేనింటికి వెళ్తాను," అంటూ సుబ్బారావు వెనక్కి తిరిగాడు, కోటిలింగం పావువైపుగా వెళ్తూ.

"ఈ పాచిక పారితే, మేరీకి ఉద్యోగం ఇప్పించాలనే ఉద్దేశం కాంతారావుకి కలిగితే చాలు. తర్వాత సంగతి ఆలోచించుకోవచ్చు," అనుకున్నాడు.

మేరీ మరొక్క గంటకల్లా సినిమా హాలుకి బయల్దేరింది. ఇందాకటి గౌను మార్చి, సాదా చీర కట్టుకొని బయల్దేరింది. ఆమెది కూడా పెద్ద సంసారమే. ఇద్దరు పిల్లలూ, తన చెల్లెలూ, అత్తా మామా అంతా కలిసి ఏడుగురున్నారు ఇంట్లో. జరుగుబాటు చాలా కష్టంగా వుంది. వెనక తను ఆఫీసులో పని సరిగ్గా చెయ్యలేకపోయిందంటే కారణం, ఈ సంసార తాపత్రయమే. అప్పుడు భర్త నిరుద్యోగి.

ఆమె సినిమాహాలు చేరేసరికి కాంతారావు ఇంకా రాలేదు. ఒకవేళ వచ్చినా 'బుకింగ్' క్లోజ్ చేశాక గాని బైటికిరాడు. ఆమె థియేటర్ లో స్త్రీల బుకింగ్ వైపు వెళ్లి కూర్చుంది. ఒక్క అరగంటకల్లా ప్రవాహంలా ప్రేక్షకులు రాసాగారు.

కాంతారావు మరొక్క పది నిమిషాలకల్లా వడివడిగా నడుస్తూ, స్త్రీల బుకింగ్ గదిలో కెళ్ళాడు. అతను తలొంచుకుని నడిచిపోవడంవల్ల అక్కడ అరుగుమీద కూర్చున్న మేరీని గమనించలేదు. మేరీగూడా అతను తన పని పూర్తిచేసుకుని బైటికొచ్చాక మాట్లాడుదాం అని వూరుకుంది.

బుకింగ్ మొదలెట్టారు ఆరుగంటలకి. దీపాలు వెలిగించారు. బుకింగ్‌లో కూర్చున్న కాంతారావు టిక్కెట్లు అడిగే ప్రతి స్త్రీ చేతిని చూస్తూ, వయస్సునీ, అందాన్నీ నిర్ణయించుకుంటున్నాడు. కాయకష్టంచేసే మొరటు చేతులూ, సున్నితమైన చేతులూ, స్పృశిస్తేనే మాసిపోతుందేమో ననేటువంటి పువ్వులాంటి వేళ్లుగల అందమైన చేతులూ, పసి చేతులూ, నరాలు బైటపడి వాడిక చేతులూ, రకరకాల చేతులు—ఒకటీ, రెండూ, నాలుగూ అని టిక్కెట్లు అడిగి తీసుకుపోతున్నాయి. రకరకాల నాణ్యాలు డ్రాయర్ సొరుగులో పడిపోతున్నాయి. కాంతారావు ఒక్కొక్క చేతినే చూడ్డం, మురిసిపోవడం, టిక్కెట్లు చించి చిల్లర లెక్క పెట్టి ఇవ్వడం సాగిస్తున్నాడు. ఒక్కొక్క ఉంగరాలున్న చెయ్యినీ, చేతి రంగుకి సరిగ్గా సరిపొయ్యే రంగు రంగుల గాజులు తొడుక్కున్న చెయ్యినీ చూసినప్పుడు కాంతారావుకి వళ్ళు గగుర్పొడిచేది.

ఆవేళ చాలామంది ఆడవాళ్లు వొచ్చారేమో, బుకింగ్ అర గంటదాకా సాగింది.

ఈలోగా బైట స్త్రీల క్యూలో టిక్కెట్ తీసుకొంటున్న మొదటి అమ్మాయి, "ఓరి నీ జిమ్మడా! నీకు చెల్లెళ్ళు లేరుట్రా! నీకు పెళ్ళాం లేదుట్రా!" అని అరవడం ప్రారంభించింది.

"ఏమిటమ్మా! ఏమిటమ్మా!" అంటూ క్యూలోని మిగతా వాళ్ళందరూ, ఆమెచుట్టూ మూగారు. గుసగుసలూ, కేకలూ ఎక్కువైనాయి.

"చూడండి. వీడు నాశనంగానూ!" అంటూ ఒక యువతి అరవసాగింది.

"ఏం చేశాడు? ఎవరూ?" అని చుట్టూవున్న వారందరూ ఆత్రుతతో ప్రశ్నించారు. గేట్ల దగ్గరవుండే వాళ్ళందరూ, మేనేజరూ, ప్రొప్రయిటరూ, ఇదివరకు లోపలికి వెళ్లిన ప్రేక్షకులతోసహా అందరూ ఈ కేకలకు అక్కడికి వొచ్చేశారు. మరోక్షణంలో అక్కడ పెద్ద గుంపు పోగయింది.

"వాణ్ణి బైటికి రమ్మనండి..." అంది ఓ స్త్రీ కంఠం.

ప్రొప్రయిటర్ గుంపు బైట నిలబడి "ఊరుకోండమ్మా, ఏం జరిగిందో నాకు చెప్పండి," అన్నాడు ప్రాధేయపూర్వకంగా. ఏదైనా దొంగతనం జరిగిందేమోనని అందరూ ఊహించుకున్నారు. మేరీ కూడానూ.

మొదట అరచిన అమ్మాయే, ఉద్రేకంతోటి ప్రొప్రయిటర్ దగ్గిర కొచ్చింది గుంపును చీల్చుకుని.

"ఏమిటయ్యా పెద్దగా వొచ్చావు అడగడానికి. ఆ బుకింగ్ లోవున్నవాడ్ని ఇలా బైటికి రమ్మను. టిక్కట్టిమ్మని చెయ్యి పెడితే, చెయ్యిపిసికి...ఇలా చేస్తాడా. తీసుకురా వాణ్ణి చెప్పు తీసుకు తంతాను!" అంటున్నదామె.

గుంపు అంతా గోలచేస్తున్నారు. ఆ క్షణాన కాంతారావును బైటికి పిలిపిస్తే, ఆడవాళ్ళే అతన్ని హూనం చేసే స్థితిలో వున్నారు.

యజమాని "బుద్ధితక్కువై అలా చేసివుంటాడమ్మా. అతన్ని మేం మందలిస్తాం తల్లీ! అసలు ఇప్పుడే పనిలోంచి తీసేస్తాను. పరా!...మీరంతా లోపలి కెళ్ళండమ్మా!" అంటూ చెయ్యెత్తి దండంపెట్టాడు. కాస్సేపటికి ఎలాగో గుంపులోని సంచలనం తగ్గింది. పోతే, తలా ఒక మాట మాట్లాడుకుంటూ వెళ్ళిపోతున్నారు. ఆ యువతికూడా, ఇంత పెద్దవాడు చేతులెత్తి దండంపెట్టినప్పుడు మరీ అరవడం బాగోదనుకుని లోపలి కెళ్ళింది. ఆ తర్వాత సినిమా మొదలెట్టేవాకా కూడా ఈ సంభాషణ థియేటర్ లో, ముఖ్యంగా ఆడవాళ్ళల్లో సాగుతూనే వుంది. "అసలు సినిమాలకి రావటమే తప్పు," అంది ఒక కంఠం. "ఇటువంటి పన్లు అన్నిచోట్లా జరుగుతున్నాయా!" అని ఇంకో కంఠం సమర్థించింది. "వాణ్ణి ఒకసారి బైటికి తీసుకురమ్మను! నాలుగు చీవాట్లు మొహాన పెడ్తే, ఇతర్లకి బుద్ధి వస్తుంది," అని మరో కంఠం సలహా ఇచ్చింది.

ఇంతలో తెరమీదికి నారదుడు ప్రవేశించి పాట లంకించుకునే సరికల్లా సద్దు మణిగింది. అందరూ హాల్లోకి వెళ్ళిపోయాక మేనేజరు బుకింగ్ ఆఫీసులోకెళ్ళి కాంతారావు దగ్గిర క్యాషు తీసుకుని "ఇంక నేను నిన్ను చివాట్లు పెట్టడం అనవసరం! పో

సాయసా పో! ఇంకెక్కడా ఇటువంటి పనులు చెయ్యకు," అన్నాడు.

కాంతారావు మొహం నల్లగా మాడిపోయింది. యజమాని అసలేం మాట్లాడనేలేదు. కాంతారావు తలొంచుకుని చకచక బైటికి వచ్చేశాడు. ఇందాకణ్ణించీ అక్కడే నిలబడివున్న మేరీ, 'ఇదంతా తనకెందుకులే,' అన్నట్టుగా అతన్ని వెంబడించింది పది గజాలు, ఏమీ మాట్లాడకుండా.

హాలుదాటి పది పదిహేనుగజాలు పోయాకగాని కాంతారావు కూడా సరిగ్గా ఊపిరితీసుకోలేక పోయినాడు. మేరీ "ఏమండీ, కాంతారావుగారూ!" అని పిల్చింది దగ్గిరకొచ్చి.

రోడ్డు దీపాల, కొట్ల దీపాల వెలుగు రోడ్డుమీద పడి మెరుస్తూన్నాయి. కాంతారావు పరాభవపు బాధతో పరధ్యానంగా వున్నవాడల్లా పరిచయమైన గొంతే గనక "ఓ...మీరా! ఏమిటి ఇటొచ్చారు?" అన్నాడు.

అతనికి సమాధానంగా మేరీ, సుబ్బారావు తన దగ్గిర కొచ్చిందగ్గిరనుంచి జరిగిన సంభాషణ యావత్తూ చెప్పి, "ఏదో మీరు తల్చుకుంటేనే ఈ పని అవుతుందండి," అన్నది ప్రాధేయపూర్వకంగా.

కాంతారావు ఆమెతోపాటు నడుస్తూనే ఆలోచిస్తున్నాడు. ఈమెకి సాయంచేస్తే, ఆమె తనను గురించి ఎంతో గొప్పగానే అనుకుంటుంది. కాని—అటు ఆమె! మళ్ళీ కాంతారావు కెందుకో అనుమానం తట్టింది. 'ఈ ఆడవాళ్ళతో ఏంచేసినా చిక్కే...మన కెందుకులే...వెధవ గోల' అనుకుని, "నాదేం వుంది మేరీ! అంతా కైలాసంగారే ఆఫీసులో సూత్రధారి. మీరు వెళ్లి ఆయన్నే అడగండి. రికమెండ్ చేసే బాధ్యత నాది!" అన్నాడు.

మేరీ ఇంకేం మాట్లాడలేక వెళ్లిపోయింది. కైలాసాన్ని అడగడం నిరర్థకం అని ఆమెకూడా తెలుసు. కారణం, తనలో తప్పులు చూపించి, తీసేయించిది అతనే అని ఆమె అభిప్రాయం. కాంతారావు సరాసరి ఇంటికి వెళ్లిపోయాడు.

## 29

పార్వతికి ఇప్పుడు భర్త దిగులూ, అప్పుల దిగుల్లూ ఎక్కువైనాయి. పాలబాకీ, పెరుగుబాకీ, గొంతులమీదికి వచ్చాయి. ఆవేళ జీతం వొస్తుంది అరవై! ఎన్నిసార్లు లెక్కబెట్టినా అరవైయ్యే! ఆవేళ కాళిదాసు డాక్టర్ కిచ్చిన పాతిక—వారికిచ్చెయ్యాలి. మిగిలేది దేనికి సరిపోతుంది? పాలకి నాలుగూ, పెరుగుకి నాలుగూ ఇచ్చేస్తే, చిల్లరకొట్లో ఇవ్వాల్సిన పది రూపాయలూ పోనూ మళ్ళీ వాళ్ళవద్ద బాకీ పెట్టవచ్చు. అయినా చాలా ఇబ్బంది ఈ నెల! మళ్ళీ ఇరవైఆరో తారీఖు ప్లాస్టర్ చికిత్సకు పాతిక ఏ మార్గాన సమకూర్చడం? ఈ మారు ఎవరు సహాయంచేస్తారు? ఎవరైనా పాతిక ఇచ్చి తనను రక్షించినా, ఆర్నెల్ల తర్వాతనైనా తనకు మద్రాసు ప్రయాణం తప్పదుగదా! దానికి డబ్బు ఎట్లా? వెళ్లకపోతే భర్త గతేమిటి? ఇలాగ ఆమెకి జీతాలిచ్చే 6 వ తేదీ ఉదయం ఆఫీసుకు చేరేవరకూ ఇదే ఆలోచన. ఎన్నిటికని సమాధానాలు చెప్పుకోగలదు! చీటికి మాటికి చీదరించుకునే భర్తతోటి ఇంత ఆవేదనలోనూ, చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తూ గావాలి.

"కాఫీ స్ట్రాంగ్ గా పెట్టమంటే ఏమిటిలా తగలేశావు—పాలవాసన వేసుకుంటూనూ?" అన్నాడు సాంబశివరావు పొద్దున్నే.

అతనికేం తెలుసు, కాఫీ పొడి ఐపోయింది. తేవడానికి డబ్బులు లేవు. చిల్లరకొట్టువాణ్ణి ఇంకా అప్పు ఇవ్వమని అడిగితే "ఈ పైకం ఇచ్చి మళ్లీ పట్టుకెళ్లండి," అనేశాడు! ఉన్న పొడి కాస్తా భర్త కాఫీకే వేసి, తాను నీళ్లటి పాలే తాగి వూరుకుంది పార్వతి.

"పొడి ఐపోయిందండి," అన్నది, అతను తాగిన గ్లాసు తీసుకెడుతూ.

"మళ్ళా ఎందుకు తేలేదు? ఐపోయిన సంగతి తెలీదూ?" అని కసిరాడు భర్త.

మాట్లాడకుండా ఆమె లోపలి కెళ్లింది. ఇదివరకు భర్త ఏమన్నా అంటే కొంచెం వినుక్కుంటూ వుండేది ఆమె. ఇప్పుడా వినుగుపోయింది. 'బాధకొద్దీ అట్లా చిరచిరలాడుతున్నారు!

ఎవరైనా అంతే,' అనుకుంటుందామె. భర్తపట్ల జాలి, కరుణ పెరుగుతుందేగాని తగ్గలేదు. "నీళ్లు పోస్తాను. మెల్లగా దిగి ఈ పీట మీద కూర్చోండి," అన్నది పార్వతి.

సాంబశివరావు భార్యసాయంతో కిందికి దిగి, పీటమీద కూర్చున్నాడు. గోరు వెచ్చని నీళ్లు పోసింది. "సబ్బేదీ?" అని అడిగాడు భర్త అలవాటుకొద్దీ.

"అయిపోయిందండి! గుడ్డల సబ్బుముక్క రుద్దనా?" అని అడిగింది పార్వతి భయపడుతూ.

"అన్నీ అయిపోయాయి! అన్నమైనా పెడతావా? లేక బియ్యంకూడా ఐపోయిందంటావా? ఏదో ఒకటి తీసుకురా, గుడ్డల సబ్బే తీసుకురా," అన్నాడు విసుగ్గా గుడ్లెర్ర జేసి.

పార్వతి గుడ్డలసబ్బుముక్క తెచ్చి వొళ్లంతా బాగా రుద్ది చక్కగా నీళ్ళుపోసి తుడిచి, తిరిగీ అతన్ని మంచంమీద పడుకో పెట్టి, ఉతికిన గుడ్డలు కట్టింది. తిరిగి, గుడ్డలు ఉతకటానికి దొడ్లోకి పోయింది. మరొక్క రెండు గంటల్లో పనులన్నీ పూర్తిచేసుకుని ఆఫీసుకి పోవాలి.

ఆమె గుడ్డలారేసి దొడ్లో పిట్టగోడ దగ్గిర నుల్చుని "వొదిన గారూ!" అని సీతమ్మని కేకవేసింది. రెండో కేకకి సీతమ్మ వచ్చింది.

"ఒక శేరు బియ్యం బదులిప్పిస్తారూ. కాస్త వేదవతి గారితో చెప్పి?" అని నసిగింది. సాంబశివరావు అనుకున్నట్టే బియ్యంకూడా లేవు. క్రితం రాత్రి పార్వతి అర్దాకలితోటే లేచిం దసలు.

సీతమ్మ "దానికేం భాగ్యం తల్లి! తెచ్చి పెడతా,"నని లోపలికిపోయి మానెడు బియ్యంతెచ్చి పార్వతి చెంగులో పోస్తూ, "శేరు బియ్యం పూటకే సరిపోయె, అందుకని రెండు శేర్లు తెచ్చా. రేపు తిరిగి ఇస్తువుగాని. వేదవతమ్మగారితో చెప్పే తెచ్చానులే," అన్నది.

పార్వతి "ఇవ్వాళ జీతాలిస్తారండి. అన్నీ కొనుక్కురావాలి. సాయంత్రం తిరిగి ఇచ్చేస్తాలెండి," అన్నది.

"రేపు కాకపోతే ఎల్లుండి ఇవ్వవమ్మా," అనేసి లోపలికి వెళ్ళిపోయింది సీతమ్మ.

పార్వతి ఇంట్లోవున్న కొద్దిపాటి సామాన్లతోటే వంటచేసి భర్తకి పెట్టింది. ఆఫీసులో గత సాయంత్రం ఇంటికొచ్చే ముందు కైలాసమిచ్చిన మోపెడు కాయితాలు తల్చుకుంటే, ఆమెకు గుండె ఖరువెక్కిపోయింది.

భర్త భోంచేస్తూ, "రాను రాను నీ వంట తగలేసినట్టుగా వుంటున్నదే!" అన్నాడు మొహం ఒక మాదిరిగా పెట్టి. "నీ ఉద్యోగం కాదుగాని, వెధవ ఉద్యోగం...నాలుగు ముద్దలు తృప్తిగా తినలేకుండా వున్నాను," అని విసుక్కున్నాడు.

పార్వతి "ఇవ్వాళ్టి వరకు ఇంట్లో ఎలాగో అన్నీ సర్దివాడు కుంటూ వచ్చానండి. నెలాఖరుకే చాలావరకూ అన్నీ ఐపోయి నాయి...అన్నీ వుంటే వంట ఎందుకు బాగుండదూ? నేను ఇది వరకు చేసిందాన్నేగా!" అన్నది దీనంగా.

సాంబశివరావు ఎంత కఠినుడైనా అతనూ మనిషే. అతనికి ఈ బాధలు తెలియనివి కావు. "సరేలే. ఇవ్వాళ జీతం వస్తుందిగా! అన్నీ తీసుకురా. వంట నోటికి బాగుండకపోతే తినబుద్ధి కాదు మరి!" అన్నాడు సౌజన్యంగా.

పార్వతికి కొంచెం విశ్వాసం కలిగింది మొహాన. భర్త తనను అర్థంచేసుకోటానికి ప్రయత్నిస్తున్నాడు! అంతే చాలు. ఇవ్వాళ కాకపోతే రేపయినా తన కష్టాన్ని గుర్తించకపోరు...ఇలా అను కుంటూ, భర్తకి మజ్జిగన్నం పెట్టి, "నేను నాలుగు మెతుకులు తిని ఆఫీసు కెళ్తానండి. బోలెడు పని వుందక్కడ," అంది. ఎంత పని వున్నా ఆమె విసుక్కోదు, అలసిపోదు, మొహాన చిరునవ్వు మాయ కుండా తిరుగుతూ వుంటుంది.

పార్వతి గబగబ రెండు ముద్దలు తినేసి, తల దువ్వుకొని, దొడ్లోని ఊకబంతి పువ్వు తల్లో పెట్టుకుని బయల్దేరింది. ఆమె తల దువ్వుకోడం, పువ్వు పెట్టుకోడం, అద్దంలో ఒకటికి రెండుసార్లు చెంపల మీదికిపడ్డ ఉంగరాల జుట్టు సవరించుకోడం చూస్తూన్న భర్తకి అరికాలిమంట నెత్తికెక్కింది. 'తను మంచంపాలై ఇలా

ఏడుస్తూవుంటే దీనికి షోకు లెక్కవౌతున్నాయ్. ఎవడికోసం ఈ షోకులు ?" అని అతని బాధ.

కాని, అది స్త్రీ సహజ లక్షణమనీ, అలంకార ప్రియత్వం వాళ్లని మరీ నిర్బంధమైన పరిస్థితుల్లోతప్ప వదలదనీ అతడు చదివిన సెక్సు పత్రికల్లో సైతం రాసేవున్నా, ముఖ్యమైనవాటిని మర్చిపోతా డతను.

పార్వతి వెళ్తూ వెళ్తూ, "కోప్పడకండి. ఏమండీ...మిమ్మల్నే. కాఫీ పొడి నేను వచ్చేటప్పుడు తెస్తాను. ఓ గంటముందే వచ్చి కాఫీ పెట్టి ఇస్తాగా!" అన్నది, ఖాళీ ప్లాస్కు గూట్లోపెట్టి పోతూ.

"వీలైనంత త్వరగా రా. పో," అని గోడవైపు తిరిగి పడుకుని, ఆమెకేసి చూడ్డం ఇష్టంలేక సమాధానం ఇచ్చాడు సాంబశివరావు.

పార్వతి, వీలయినంత త్వరగా నడిచి ఆఫీసు చేరుకుంది. సాయంకాలం కైలాసం ఆమెకి అప్పజెప్పిన ఫైల్సుకి ఇంకా కొన్ని చేరి ఎత్తుగా వున్నాయి బల్లమీద. ఆమె గబగబ టైపుమిషన్ మీద మూతతీసి కిందపెట్టి, కొత్త కార్బన్ కాయితం తీసుకొని పని ప్రారంభించింది. మామూలుగా అందరూ ఎవరి కుర్చీల్లో వారు కూర్చుని పనులు చేసుకుంటున్నారు. పార్వతి వొచ్చి కూర్చోగానే, కైలాసం "ఏమమ్మా, అందులో 'అర్జంటు' అని వున్న కాయితాలు ముందు టైపుచేసి ఇవ్వు," అన్నాడు. తర్వాత సుబ్బారావు వైపు తిరిగి, "ఈ నెల శలవ లెక్కలైనాయి, పనులు అలాగే ఆగిపోయి వున్నాయి. కాంతారావుగారు, మీరూ కాస్త తొందర తొందరగా కానివ్వాలి," అన్నాడు.

సుబ్బారావు "ఈ పూట ఇచ్చేస్తానండి లెక్కలు..." అని నసిగాడు. కాంతారావు "బందరునించి మనం అడిగిన 'ఎక్స్ప్లనేషన్' ఇంకా రాలేదండి, ఇవ్వాళ టపాలో వుంటుందేమో—"అని గొణిగాడు.

ఆవేళ సాయంత్రం ఓ గంట ఎక్కువగానే పని చెయ్యాల్సి వచ్చింది అందరు గుమాస్తాలున్నూ. పార్వతి గుండెలు దడదడ

లాడుతున్నాయి; భర్త కాఫీ పెట్టివ్వలేదని ఎంత కోపంతో వుంటారో?...ఆరున్నరకి ఒక్కొక్కరే జీతాలు తీసుకుని వెళ్లి పోయారు. ఇక మిగిలిందల్లా పార్వతీ, హెడ్ క్లార్కు కైలాసమూ ఇద్దరే. ప్రతినెలా ముందుగా పార్వతినే పిల్చి జీతం ఇచ్చి పంపించే కైలాసం, ఆవేళ కావాలనే పార్వతిని ఆపాడు.

పార్వతికి గోడ గడియారపు ప్రతి 'టిక్కు' గూడా "రా, రా," అని భర్త పిలుస్తున్నట్టే వినిపిస్తున్నది. అందరు గుమాస్తాలూ వెళ్ళిపోగానే, కైలాసం "ఏమమ్మా పార్వతి, లోపల అయ్యవారు నిన్ను పిలుస్తున్నారు. వెళ్లు," అన్నాడు, కాలింగ్ బెల్ మోతవిని.

చీకటి పడడంవల్ల, దీపాలు వెలిగించారు ఆఫీసులో. మంత్రమూర్తి కుర్చీలో తాపీగా కూర్చుని పక్క కిటికీగుండా బైటికి చూస్తున్నాడు. పార్వతి గావడంతోటే, ఆమెవైపు తిరిగి, "ఏమమ్మా! నీకు తీరికవుంటే, మా పిల్లలకి సాయంత్రం వేళల్లో ప్రైవేట్ ట్యూషన్ చెప్పగలవూ?" అని అడిగాడు.

పార్వతి ఉన్నట్లుండి ఈ మాటలు వినేసరికి ఉలిక్కిపడింది. ఏంచెప్పాలో తోచలేదు. దిక్కులు చూడ సాగింది.

పార్వతి ఎంతకీ తేల్చలేక పోయింది. భర్త అనుమతిలేనిదే ఏం చెప్పడం?

"ఆలోచించి..." అని అన్నది. మంత్రమూర్తి చిరునవ్వు నవ్వి, "అలాగే రెండు రోజుల్లోగా చెప్పండి..." అన్నాడు.

"వెళ్ళొస్తానండి," అన్నది పార్వతి ఆయనకి నమస్కరించి.

తల ఊపా డతను.

బైటికివచ్చాక కైలాసం "ఏమని చెప్పొచ్చావు?" అని ప్రశ్నించాడు, ఆయనకి ముందే తెలుసుగాబట్టి. పార్వతి "మా వార్నడిగి ఏ సంగతీ రేపు చెబుతానండి," అన్నది.

"అమ్మాయి, నీ కథవిని ఊరుకోలేక వారితో మాట్లాడాను. పిల్లలకు చదువు చెప్పించి, నీకో ఇరవై ఇవ్వటానికి ఒప్పుకున్నారు వారు. ఇవ్వాళే మీ వారితో మాట్లాడి ఒప్పించు. ఏం?" అన్నా డాయన, ఆమె జీతం లెక్కచూసి బల్లమీద పెట్టి.

పార్వతి "అలాగేనండి," అన్నది సంతోషంగా. ఇంకో ఇరవై రూపాయలు—బిళ్లమీద దస్కతు జేసి డబ్బులు తీసుకొని బయల్దేరింది. అప్పటికే ఏడుగంటలు దాటింది. ఆమె మొదటి పనిగా, దారిలో ఓ కొట్లో కాఫీపొడి, పంచదార తీసుకుని, ఇంటికి వెళ్లింది.

సాంబశివరావు "తొందరగా వస్తానని ఇంత ఆలశ్యం చేశావేం?" అని విరుచుకు పడ్డాడు. వేళకు వేన్నీళ్ళు గుటకపడక పోయేసరికి అసలే నీరసం శరీరం, తలనొప్పి విపరీతంగా వేధిస్తూందతన్ని. ఆ నొప్పితో మరీ మండిపడుతుంటే, పార్వతి మౌనంగా దీపం పెట్టి, తొందర తొందరగా ముందు కాఫీ కాచి ఆయనకిచ్చి, "ఏమండీ, మనకు మంచిరోజు లొస్తున్నాయ్!" అన్నది, భర్తదగ్గిర కూర్చుంటూ.

సాంబశివరావు కమ్మని స్ట్రాంగ్ కాఫీ తాగి, కొంచెం తమాయించుకొని "ఏమిటది?" అని అడిగాడు, దిండుకు ఆనుకుని కూర్చుంటూ. పార్వతి భర్త జుట్టు చేత్తో సవరిస్తూ, "సాయంత్రం వేళల్లో మా యజమానిగారి పిల్లలకి ట్యూషన్ చెప్పమంటున్నారు. నెలకి ఇరవై ఇస్తారట...ఒప్పుకోమన్నారా?" అని ప్రశ్నించింది జాలిగా చూస్తూ.

"అయితే సాయంత్రం ఐదుగంటలదాకా ఆఫీసులో ఉంటావు. అక్కణ్ణించి ట్యూషన్ కి వెళ్లి రాత్రికి వస్తావు! ఏడ్చినట్టే వుంది. ఇంక నువ్వు ఇంటిదగ్గిర వుండేదెప్పుడు? నాకు కూడు పెట్టేదెప్పుడూ?" అన్నాడు సాంబశివరావు.

"ఎందుకూ? సాయంత్రం ఐదు గంటలకల్లా ఇంటికొచ్చి మీ కన్నీ చూసి, తర్వాతే వెళ్తానండి. ఓ గంట చదువు! వెంటనే వచ్చేయనూ? మిమ్మల్ని వదిలి ఎంతసేపుండగలను? ఆఫీసులో వున్నంతసేపూ మీ ధ్యాసే! కాని, తప్పదాయె. ఇంకోగంట శ్రమ పడితే ఇరవై రూపాయలు వస్తాయి. డాక్టర్ ఫీజుకైనా వస్తుంది," అన్నది పార్వతి.

లోలోపల తర్కిస్తున్నాడు సాంబశివరావు. ఈ బుజ్జగింపంతా తనకోసమేనా? నిజంగా ట్యూషనే ఒప్పుకుంటున్నదా?

ఇంకేమైనా...ఛీ...ఛీ! అలాంటి దానికింకా ఏ నిదర్శనమూ లేదు మరి! ఇంకా ఏదైనా అయితే, ఆమె మొహం అంత నిర్మలంగా వుండడం సాధ్యమా?......"రేపొద్దున్నే చెబుతా లేవే. వెళ్లి వంట ప్రయత్నం చెయ్యి," అన్నాడతను, ఏ భావమూ ధ్వనించని స్వరంలో.

పార్వతి మరేమీ మాట్లాడక లోపలికి వెళ్లి సంచి తీసుకుని దగ్గరలోవున్న కొట్లోకి వెళ్లింది అప్పటికి కావల్సిన సామాన్లకోసం. అట్లాగే కాళిదాసు ఇంట్లోకెళ్లి, వేదవతికి పాతిక ఇచ్చింది.

"మేం ఏం ఇబ్బంది పడిపోతున్నామని? ఈ నెల సర్దుకుని వొచ్చేనెలో, తర్వాత నెలో ఇవ్వు, ఫర్వాలేదు," అన్నది వేదవతి.

"ఎప్పటికైనా ఇవ్వాల్సిందేకదా? తీసుకోండి. ఋణం వుంటే మనసుకి బరువు!" అన్నది పార్వతి.

"అట్లాగ్గేదులే పోవమ్మా! పెద్ద పెద్ద వందలు, వేలూ బాకీ ఉన్న సావుకార్లే హాయిగా నిద్రపోతారు—ఏ దిగులూ లేకుండా. నీ కేమిటమ్మా! వెళ్ళు వెళ్లు. అసలై రూపాయల్లో పాతిక నాకిచ్చి ఏం తింటావమ్మా ఈ నెలంతా?"

"ఏమిటండి మీరూ?" అంటూ పైకం తిరిగి తీసుకుని, అర్ధ మనస్కంగా వెళ్లిపోయింది పార్వతి.

మర్నాడు ఉదయం, ఆఫీసు కెళ్ళేటప్పుడు భర్తని అడిగింది పార్వతి, "ఏం చెప్పమన్నారు ఆఫీసులో అడిగితే?" అని.

రాత్రల్లా, ఇదే సమస్యతో తల పగలగొట్టుకున్న సాంబశివ రావు చివరికి ఒక నిర్ణయాని కొచ్చాడు. 'కొంతకాలం చూద్దాం. సంగతి సందర్భాలు తెలుస్తాయి...'అనుకున్నాడు. పైగా డబ్బులు కూడా వస్తాయి, ఇగనై అంటే ఇగనై! ఆవిడ అన్నట్లు, తన వైద్యానికీ సంసారానికీ ఈఅరనై చాలవానెను..."సరే. వప్పుకో— ఈనెల చూద్దాం," అన్నాడతను అన్యమనస్కంగా.

పార్వతి సంతోషంతో ఆఫీసు కెళ్ళింది. ఆమె సంతోషానికి రెండు కారణాలు: వేదవతి తిరిగి ఇచ్చిన పాతికతో కొంత

దిగులు తీరింది. భర్త తనకు ట్యూషన్ చెప్పే అవకాశం ఇవ్వడం తోటి ఇంకో ఇరవై వస్తుందికదా అని మరింత ఉత్సాహం కలిగింది.

ఆమె వెళ్ళాక తిరిగి సాంబశివరావు ఆలోచించసాగాడు. 'తాను సరే అనగానే ఇంత సంతోషంతో పోవటానికి కారణం ఏమిటి ? కష్టపడ్డానికి ఎవరైనా వెనుదీస్తారుగాని, ఇంత సంతోషంగా ముందుకు వెళ్తారా ? ఇదేదో గూడుపుఠాణీగా వుందే—' అనుకున్నాడు. ఈ ఆలోచనలతో అతని బుర్ర వేడెక్కింది.

## 30

సుబ్బారావు చెవికి పార్వతికి ట్యూషన్ కుదిరిన సంగతి సోకిన రోజు మధ్యాహ్నం ఆఫీసుకి శలవ పెట్టాడు. అతను ఆవేళ మధ్యాహ్నం—అంటే, జీతాలు తీసుకున్న మర్నాడు ఆఫీసుకి శలవ చీటి పంపించి, ఆలోచిస్తూ కోటిలింగం షాపునించి బయల్దేరి, సాంబశివరావు ఇంటివైపుగా నడవసాగాడు.

అప్పుడు మధ్యాహ్నం రెండుగంటలవుతుంది. ఎండ చుర్రుమంటున్నది. వీధులంత రద్దీగా లేవు.

సుబ్బారావు, సాంబశివరావు ఇంటిముందుకొచ్చి ఆగాడు. లోపలికి అడుగెట్టేందుకు ముందు ఆగి, కాసేపు ఆలోచించాడు. తిరిగి గుండె దిటవుచేసుకుని లోపలి కెళ్ళాడు. "ఏరా సాంబాయ్ ! గుర్తున్నానా ?" అన్నాడు పోవడంతోటే.

సాంబశివరావుగూడా వెంటనే తన హైస్కూలు మిత్రుణ్ణి గుర్తించి "సుబ్బాయ్! నువ్వా? ఏమిటిది–దారితప్పి ఇటొచ్చావు ? ఎక్కడ వుంటున్నావు ? ఏంపని చేస్తున్నావు ?" అని అడిగాడు, మిత్రుణ్ణి తన మంచంమీదనే ఒక పక్కన కూర్చో పెట్టుకుని.

"నీకు నీ వైఫ్ చెప్పనేలేదటోయ్. ఆమె పనిచేస్తున్న ఆఫీసులోనే నేనూ పనిచేస్తున్నానోయ్. కాపరం వెనకఉన్నచోటనే ననుకో. ఏమిటీ...నీ కాలు ఏదో విరిగిందట ! నీ వైఫ్ చెప్పింది... చాలా ఇబ్బంది పడుతున్నావట !" అని ప్రశ్నించాడు సుబ్బారావు.

సాంబశివరావుకి సుబ్బారావు రూపురేఖలు, అతనూ తన భార్య ఒకే ఆఫీసులో పనిచెయ్యడం, మనస్సులో కలుక్కు–

వున్నాయ్. కాని పైకేమీ తెలియచ్చకుండా, "ఏదో కులాసాగానే వున్నావన్నమాట! పెళ్లి చేసుకున్నావా? మీ అమ్మా నాన్నా బాగున్నారా?" అని అడిగాడు.

"ఏదో నీ దయవల్ల కులాసాగానే వున్నాను. ఇంకా పెళ్లి చేసుకోలేదోయ్. పెళ్లి చేసుకుంటే ఈ స్వేచ్ఛపోతుందని నా భయం. మా అమ్మా నాన్న బాగానే వున్నారు...నీ కాలుకి దెబ్బ తగిలి ఎన్నాళ్లయిందీ?" అని ప్రశ్నించాడు.

"నాలుగు నెలలయింది. ఈ కాలు ఉన్నా ఉపయోగం లేకుండా వుంది. పైగా లేచి తిరగటానికి అడ్డు. మొన్న లేచాను, మళ్లీ లోపల ఎముకకి మొనటి కొచ్చింది. నా బాధ ఇంతింత కాదనుకో; చెప్పకుండామన్నా ఎవరూలేరు...చివరికి మా ఆవిడ ఉద్యోగం చేయాల్సిన గతి పట్టింది," అంటూ వాపోయాడు సాంబ శివరావు.

"తప్పేమిటిలేరా. మనకు జరగనప్పుడు ఏంచేస్తాం చెప్పు? నీ పొజిషన్‌లో ఎవరున్నా వాపూ అంతేగా!" అన్నాడు సుబ్బా రావు, లోపలి కృత్రిమత్వం బైటపడకుండా జాగ్రత్తపడుతూ.

"ఆడది సంపాయించి మగవాడు తినటం మా వంశంలోనే లేదు. ఇదే మొదలు. నాకు తలకాయి కొట్టేసినట్టుంది సుబ్బా రావూ! కాని ఏంచెయ్యటం? ఇదంతా ఎట్లావున్నా, ఈ వంటరి తనం సహించలేకుండా వున్నాను," అని బాధతో అన్నాడు సాంబశివరావు.

"నిజమేలే. ఎప్పుడూ తిరిగేవాడివి, సదా వాగుతూండే వాడివీనాయె; ఒకచోట కట్టేసినట్టు పడివుండటమంటే కష్టమే మరి. కాని చేసేదేమిటి? అయితే నాకు తెలియక అడుగుతాను, ఆ కాలు ఎల్లకాలం ఇంతేనా? లేచి తిరిగే యోగ్యత వున్నదా ఎప్పటి కైనా?" అని ప్రశ్నించాడు ఆ హైస్కూల్ మిత్రుడు.

"ఏమిటో ఏమీ తెలియకుండా వుందోయ్. డాక్టరేమో రోజూ మందిస్తూనే వున్నాడు, ప్రతినెలా కట్లు కడుతూనేవున్నాడు. డబ్బులు గుప్పెళ్లకు గుప్పెళ్ళు వొదిలిపోతూనే వున్నాయి. డాక్ట రేమో ఏమీ చెప్పడు. 'నయమౌతుందిలే, అంటాడు. నాకీ చెర

ఎప్పుడో దులుతుందా అని తల్లడిల్లిపోతున్నాను. నిజానికి మా ఆవిడ అర్భకురాలు. ఈ చాకిరీ అంతా ఎలా తట్టుకుంటున్నదో నాకు అర్థంకాదు. దీనికేంగాని సుబ్బారావు, మా ఆవిడ ఆఫీసులో చేసే పనేమిటిగా ?" అని ఆసక్తిగా అడిగాడు సాంబశివరావు.

"ఏం పెద్ద పనులిస్తారు ఆడవాళ్ళకి ? మేమంతా లేమూ ? నాలుగు కాయితాలు టిక్కు టిక్కుమని టైప్ చేసి అక్కడ పడెయ్యడం, దూలాలు లెక్కేస్తూ కూచోడమున్నూ ! ఆడవాళ్ళు సున్నితమైనవాళ్లు కదట్రా ? నాలుగు ఫైల్సు ఒక్కసారి చేతికిచ్చి లెఖ్ఖలు పరిచూడవమ్మా అని గదమాయిస్తే పరి—గుడ్లనీరు పెట్టి, నోరు తెరుస్తారు. మీ ఆవిడ ఏదో పెద్ద శ్రమపడుతోందనుకోకులే. మా ఆఫీసులో సులభమైన పని ఆమెదే," అన్నాడు సుబ్బారావు. 'పార్వతి ఏదో కష్టపడుతుందని సాంబశివరావు అనుకుంటున్నట్టయితే ఆ సదభిప్రాయాన్ని మార్చాలి. మెల్లమెల్లగా ఆమె అంటే తేలిక పరచాలి. సూటిగా చెప్పకుండా డొంక తిరుగుడుగా చెబితే నెపం తనమీద వుండదు...' అని అతని ఊహ.

"నేనూ అనుకుంటూనే వుంటానులే, అదేం పెద్ద పనులు చెయ్యటంలేదని. ఈ పనికే అది అల్లాడిపోతూవుంటుంది. ఒక్కొక్క నాడు 6½ కి, 7 గంటలకీ వస్తుంది ఇంటికి. అప్పటిదాకా ఏం చేస్తార్రా ఆఫీసులో ?" అని ప్రశ్నించాడు భర్త. ఎన్నాళ్లనించో ఎవరినైనా అడుగుదామనుకుంటున్న ప్రశ్నలివి.

"నే నే మాట చెప్పినా—బాగుండదు...పోనీరా," అన్నాడు సుబ్బారావు అదోలా మొహం పెట్టి.

"ఏమిటో చెప్పరా. నేనేం అనుకోనులే. ఉన్న సంగతే చెబుతావా, ఏదైనా కల్పించి చెబుతావా ?" అని బతిమాలాడు ఆ అశక్త భర్త. అతనికి అనుమానం కలుగుతోంది.

"ఐదు గంటలయితే మేం అంతా వెళ్లిపోతాం. ఆఫీసు ఏవాడూ ఐదు దాటి ఉండదు. మీ ఆవిడకూడా అప్పుడే వెళ్లి పోతుంది రోజూ. బజార్లో ఏమైనా పన్లుంటే చూసుకుని వస్తుంది గాబోలు, ఆలశ్యం అవుతుంది ! అన్నట్లు మర్చిపోయానురా. ఒకటి రెండుసార్లు యజమాని 'నువ్వుండవమ్మా, కొంచెం పని వుంది,' అని

మేం వెళ్ళేటప్పుడు అనటం విన్నాను. ఎందుకో, ఏమో అను కున్నాను. ప్రయివేట్ కాయితాలేమైనా ఉంటే అప్పుడు టైప్ చెయ్యమన్నాడేమో!" అన్నాడు సుబ్బారావు. చాలా జాగ్రత్తగా విషం పోస్తున్నాడు, చుక్కలు చుక్కలుగా.

"అంతే అయివుంటుంది. యజమానులకి కనికరం వుండదురా! ఆడదిగదా, చీకటిపడ్డదాకా ఉంటే ఎలాగని అన్నా ఆలోచించ రేం?" అన్నాడు భర్త—లోలోపల అనుమానం వేధిస్తున్నా, పైకి పొంగకుండా జాగ్రతపడి. ఇందుకనే గాబోలు, ఆమెని ట్యూషన్ వంకపెట్టి ఇంటికి పిలిపించుకుంటున్నాడన్న ఆలోచన కూడా కలి గింది ఛాయాప్రాయంగా. కాని, మరునిమిషమే ఆ భావాన్ని అణి చేసుకున్నాడు.

"జీతం ఇస్తున్నప్పుడు ఆడేమిటి, మొగేమిటిరా సాంబశివ రావు...వాడు యజమానీ, వీళ్ళు గుమాస్తాలు. వాడు చెప్పినట్టు వింటేనే వీళ్ళకి మెతుకులు. లేకపోతే లేదు. ఒప్పుకున్నాక అర్థ రాత్రిదాకా చెయ్యమన్నా చేసి తీరాల్సిందే!" అన్నాడు సుబ్బా రావు. "ఈ పూట వేరే పనుండి శలవ పెట్టానోయ్. శివాలయం దగ్గిర పనివుండి వెళ్తూ దారికదా, అని నిన్ను చూసిపోదామని వచ్చాను. వెళ్తాన్రా!" అంటూ లేవబోయినాడు.

"కాస్సేపుండవోయ్...వెళ్దువుగాని," అన్నాడు సాంబశివ రావు, అతని చెయ్యిపట్టుకొని. సుబ్బారావు "వెళ్ళాలిరా. అప్పు డప్పుడు వస్తూవుంటాలేరా. టైమ్ అయింది, వెళ్తాను," అంటూ లేచాడు.

"సరే. అంత అర్జెంటు పని వుంటే వెళ్లు. అప్పుడప్పుడు కనపడుతూండు మరి!" అని శలవిచ్చాడు మిత్రుడికి సాంబశివ రావు, ఇష్టం లేకుండానే.

సుబ్బారావు లేచి వెళ్లిపోయినాడు. సాంబశివరావు అతను వెళ్ళాక అతను చెప్పిన మాటలన్నిటినీ జ్ఞాపకం చేసుకుంటూ బాధ పడసాగాడు.

# 31

'పార్వతి ట్యూషన్ చెప్పడానికి ఒప్పుకుంది. అంటే ఆమె భర్తకూడా ఒప్పుకున్నాడన్న మాటే! పోనీలే! వేన్నీళ్ళకు చన్నీళ్లు తోడు. దీంతోటి ఆమెకి వందలు రాకపోయినా కొంత ఖర్చు కలిసొస్తుంది. ఉత్తరోత్తరా ఆమెపట్ల యజమానికి సానుభూతి కలిగితే ఆమె అడిగిన (తనతోటి మాత్రం చెప్పుకున్న) ఆ పెద్ద మొత్తంగూడా ఆయన ఇవ్వవచ్చు. ఇవ్వాళే ఆ పైకంగూడా ఇవ్వ మని యజమానిని అడగడం బాగుండదు,' అనుకున్నాడు కైలాసం.

ఆవేళ అన్నివిధాలా మంచిదని, పార్వతి ఆఫీసు వొదలగానే ఇంటికివచ్చి ఓ గంటసేపు ఇంటి పన్లు చూసి, వంట వగైరా చేసిపెట్టి వుంచి, ట్యూషన్‌కి బయల్దేరింది. దీని దుంప తెగ, విజయవాడేం చిన్నదీ చితకదీ కాదు; ఆమె ఇంటినుంచి, బందర్ రోడ్డులో దాదాపు చివరగావున్న మంత్రమూర్తి ఇల్లు చేరుకొనేసరికి, ఎంత గబగబ నడి చినా ఆరూ ముప్పావు ఐంది.

మంత్రమూర్తి వరండాలో పడక కుర్చీలో పడుకున్నాడు. పిల్లలు ముగ్గురూ ఆయనకి కొంచెం దూరంలో సిరిచాప మీద కూర్చున్నారు పలకలూ, పుస్తకాలూ ముందేసుకుని. పెద్ద కుర్రాడు లేడు. చిన్నబ్బాయి ఏదో బొమ్మలపుస్తకం తిరగేస్తూ అందులో లీనమై వున్నాడు.

పార్వతి మెల్లెక్కి వరండాలో ప్రవేశించి, మంత్రమూర్తితో "నమస్కారమండీ," అంది చిరునవ్వు నవ్వుతూ.

"రావమ్మా రా. నీకోసం ఎదురు చూస్తున్నాను. అదిగో, కూచున్నారు చూడు. మధ్యాహ్నమే చెప్పాను—మీకో కొత్త పంతు లమ్మగారు వస్తుంది ఇవ్వాళ అని. 'ఎట్లావుంటుంది? కొడుతుందా?' అని లక్ష ప్రశ్నలేసి చంపుతున్నారు నన్ను. ఎలా చదువు చెప్తా వో వీళ్ళకు. వీళ్లైనంతవరకూ దండోపాయం ఉపయోగించ కుండా చూడు. నేను ఎదురుగా కూర్చుంటే నీ మాట ఖాతరు చెయ్యరు... నేను లోపలికి వెళ్తాను," అంటూ మంత్రమూర్తి లేచి లోపలికి వెళ్ళాడు.

పార్వతి నిదానంగా తన శిష్యులదగ్గరకెళ్ళి కూర్చుంది. పిల్లలు ఆమె వైపు ఐదారు నిమిషాలపాటు కళ్లార్పకుండా చూశారు. పార్వతిని పరిశీలిస్తున్నారు గాబోలు. పంతులంటే వాళ్ళకేం సదభిప్రాయంలేదు. పెద్దకుర్రాడు నరసింహారావు వాళ్ళ పని మనుస్సులకు "ఒరే తమ్ముడూ! మా పంతులు గారు ఒట్టి ఎలుగుబంటిరా! ఊరికే కొడ్తారు పిల్లల్ని. అసలు పంతుళ్ళందరూ పిల్లల్ని బాగా కొడ్తారు," అని తన స్వల్పానుభవాన్ని నూరిపోసి వున్నాడు.

రెండో కుర్రాడికి కూడా బడి అనుభవం ఉంది. అతన్ని కొట్టక పోయినా, చుట్టూవున్న అతని సహాధ్యాయుల్ని కొట్టడం చూస్తూవుండడంవల్ల అన్నయ్య చెప్పింది నిజమనే నమ్మాడు; చెల్లెల్నీ నమ్మించాడు.

నాలుగో కుర్రాడిది సమస్యేకాదు. వాడి ధోరణిలో వాడు ఆడుకుంటూ ఎవరికీ అంతుపట్టని ప్రశ్నలు వేస్తూ వుంటాడు. చెప్పే వాళ్ళ ముంప తెగుతూ ఉంటుంది. వాడి యక్షప్రశ్నలకి సమాధానం చెప్పలేక మంత్రమూర్తికి తలప్రాణం తోకకు వస్తూవుంటుంది.ఎటూ గాని వయస్సు వాడిది; నాలుగేళ్ళు. కనురుకుంటే ఏడ్పు లంకించుకుంటాడు, లేదా అడిగిన ప్రశ్నే అడుగుతూ ప్రాణం తీస్తాడు.

పార్వతికూడా వాళ్ళని మెల్లగా పరిచయం చేసుకోవాలనే ఉద్దేశంతోటి, చిన్నబ్బాయిని దగ్గిరకి లాక్కుంది—కొంచెం బలవంతంగానే. కుర్రాడు బెరుకుగానూ, కోపంగానూ ఆమె దగ్గిర కొచ్చాడు. "నీ పేరు ఏమిటి బాబూ?" అంది కుర్రాడి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ. కుర్రాడు లోలోపల ఏదో గొణిగాడుగాని చప్పుడు బైటికి రాలేదు.

ఇంతలోకే సుశీల "వాడి పేరాండీ! మరేనండి... నారాయణ బాబు అండీ," అన్నది.

"అంగటమ్మా! నువ్వు మంచిదానివమ్మా! మరి నీ పేరేమిటి?" అన్నది పార్వతి, ఆ అమ్మాయి వంక ప్రేమగాచూస్తూ. "నా... నా పేరండి, సుశీలండి!" అన్నది ఆ అమ్మాయి. పార్వతి రెండో కుర్రాడి వైపు తిరిగి "నీ పేరు కూడా చెప్పు బాబూ!" అన్నది.

కుర్రాడు అనుమానంగా పంతులమ్మ వైపు చూస్తూ "గోపాల కృష్ణ," అన్నాడు కరుకుగా.

"ఓహో! చాలా మంచిపేరే!" అని పార్వతి తన వొడిలో అయిష్టంగా కూర్చునివున్న బాబుతోటి, "నువ్వు కూడా చదువు కుంటున్నావా బాబూ?" అని బుజ్జగింపుగా అడిగింది.

పార్వతి వైపు చూడకుండానే కుర్రాడు చేతిలో బొమ్మల పుస్తకం తిరగేస్తూ, "ఓ!" అన్నాడు గర్వంగా. దీన్ని అంగీకరించ నట్టుగా అమ్మాయి సుశీల "వాడేం చదువుకోటం లేదండి. అన్నీ అబద్ధాలు. వాడికి ఓ న మా లు కూడా రావు! కాదూ(టా అన్నయ్యా?" అన్నది గోపాలకృష్ణ వైపు తిరిగి.

"వాడికేం చదువురాదు, పుస్తకాలు చింపెయ్యటం తప్ప!" అన్నాడు గోపాలం. చిన్నకుర్రాడికి కోపం వచ్చినట్టుంది. "నాకు వచ్చు! నాకు వచ్చు!" అని పెద్దగా కేకలెయ్యసాగాడు, చేతిలో పుస్తకాన్ని నేలకేసి విసిరికొట్టూ.

"నీకూ చదువువచ్చు బాబూ," అని బాబును సముదాయిం చింది పార్వతి. సుశీల, గోపాలకృష్ణ నవ్వారు. "ఒఠ్ఠి అల్లరివాడండి," అన్నాడు గోపాలకృష్ణ.

ఇంతలోనే పెద్దకుర్రాడు వచ్చాడు. వాడు కొంచెం బెట్టుగా వచ్చి, కూర్చోకుండానే "నమస్కారమండి," అన్నాడు. పార్వతి కుర్రాణ్ణి తలెత్తి ఎగాదిగా చూసి "కూర్చో బాబూ!" అన్నది.

"లోపలకి పోయి పుస్తకాలు తెచ్చుకుంటానండి," అనేసి వాడు లోపలికి పరిగెత్తాడు.

"మీ అన్నయ్య పేరేమిటి గోపాల్?" అని అడిగింది పార్వతి రెండోవాణ్ణి.

"నరసింహారావు," అని ముక్తసరిగా జవాబిచ్చాడా కుర్రాడు. ఇంతలోనే పెద్ద కుర్రాడు పుస్తకాలు చేతబుచ్చుకుని వొచ్చి, నీరి చాపమీద కూర్చున్నాడు.

ఆ తర్వాత పార్వతి పిల్లలు ముగ్గురి చదువూ ఎంతవరకున్నదో పరిశీలించింది. పెద్దబ్బాయి ఫస్టుఫారం. రెండోవాడు నాలుగో తర గతి. అమ్మాయి ఇంకా ఓ న మా ల తరగతే. అయితే, అందరిలోనూ

సమానంగా ఒక లోపం కన్పించింది. వాళ్ళెవరిలోనూ చదువంటే ఆసక్తి కన్పించలేదు. బళ్లో పంతుళ్ళకి భయపడి చదువుతున్నారు. దీనికి కారణాలు ఊహించడం కష్టం... నాన్న గారాబమూ, పంతుళ్ళ నిర్లక్ష్యమూ చాలావరకు కారణాలని అనుకుందామె.

పిల్లల్లోని ఆడుకోవాలనే మనస్తత్వం ద్వారానే వాళ్ళకి ఏం చెప్పినా వంట బడుతుంది అనే వాదనలున్నాయి. ఇంకా ఎన్నో రకాల బోధనా పద్ధతులున్నాయి. అవేమీ పార్వతికి తెలియవు. ఎన్ని సిద్ధాంతాలు ఏం చెప్పినా; పిల్లల్ని ప్రేమించి, వాళ్ళల్లో తానూ ఒకర్తెయై ఏదైనా చెప్పితే వాళ్లు వింటారని మాత్రం ఆమెకి స్వతహాగా తెలిసివుంది.

ఆమె లాలించి, మంచి మాటలు చెప్పి, ఆ పూట వాళ్లకేం తెలుసో రాయించింది. ఆమె ఎంత లాలించినా పెద్దబ్బాయి మాత్రం చాలా దురుసుగా జవాబు చెప్పాడు. వాణ్ణి ఇంకా కొంత కాలం పోతేగాని లొంగదీసుకోలేమని తెలుసుకుంది పార్వతి.

పసివాడు అరగంటలోనే ఆమెని అంటిపెట్టుకు పోయాడు. వాడి అల్లరిని సమర్థించుకుంటూ ఇంకో అరగంట చదువు చెప్పడానికి ప్రాతిపదికైన పరిచయం పూర్తిచేసుకుని, ఆమె తిరిగి ఇంటికి బయల్దేరింది. పెద్ద కుర్రాడు చెబితే మంత్రిమూర్తి హైటికివచ్చి, "చాలా దూరం వెళ్ళాలను కుంటాను. పైగా చీకటిపడింది. సైకిల్ రిక్షామీద వెళ్ళు," అని చెప్పుతూ, జేబునించి పావలా కాసు తీసి ఆమె కివ్వబోయాడాయన.

'ఇవ్వాళ ఒక్కరోజు ఇస్తే ఏమైనట్టు... రోజూ?' అనుకొని పార్వతి "అక్కర్లేదు లెండి," అని నిరాకరించి, నడిచే ఇల్లు చేరుకుంది.

ఆమె ఇంటికి రాగానే సాంబశివరావు "ఇప్పుడెంతయిందేమిటి?" అని ప్రశ్నించాడు.

"ఎనిమిదింబావు అయిందేమో!" అన్నది పార్వతి.

"ఏమిటో... నీ ప్రవర్తన నాకేం బాగుండలేదు రానురాను! డబ్బులిస్తున్నారు గదా అని తెల్లవార్లూ అక్కడే వుండిపోతావా?

ఒంటరిగా ఎంత చచ్చిపోతున్నానో నీకేమైనా తెలుసా?" అని విసుక్కున్నాడు సాంబశివరావు.

"నాకు తెలీదుటండీ? ఖర్చులేమో ఎక్కువ ఐపోతున్నాయి. జీతం చాలదు...నిన్న మీరు 'సరే'నంటేనే నేను..." అని ఆమె ఏదో అనబోతుండగానే సాంబశివరావు, "నాకు తెలీకుంటే నీ ధోరణి! బాగా తిరగ మరిగావు...దానికి నా అనుమతి ఒకటా! ఎట్లాగో చావు పో! అన్నం పెట్టు. వెళ్ళు," అన్నాడు మంటగా. సుబ్బారావు తోటి సంభాషణ పర్యవసానం ఇది.

పార్వతి నవనాడులూ క్రుంగిపోయినాయి. తానేదో తప్పు చేస్తున్నట్టే మాట్లాడుతాడేం భర్త?...అందుకు కారణం ఏమిటి? ఆ కాలం బాధ తోటీ, ఒంటరితనపు విసుగుతోటీన్నీ అలా మాట్లాడుతూ వుంటారు...పార్వతికి భర్తపట్ల జాలి ఎక్కువౌతున్న దే కాని, ఆయన మాటల్ని ద్వేషంగా తీసుకోటం మానేసిందామె.

## 32

పదిహేను రోజులు ఇలాగే సాగిపోయినాయి. రోజూ పార్వతి మామూలుగానే ఆఫీసుకి వెళ్తోంది. సైరివేటు చెప్పడానికి కూడా వెళ్తోంది—భర్త రోజువారీగా ఏమేమిటో అంటున్నా పట్టించుకోకుండానే. ఆఫీసులో సుబ్బారావు తప్ప మిగతా అందరూ ఆమెతో సౌజన్యంగానే ప్రవర్తిస్తున్నారు. సుబ్బారావు ఆమెవైపు చూడ్డంకూడా మానేశాడు. అయితే, సాంబశివరావుతోటి స్నేహం పెంచుకొనే మార్గాలు ఆలోచిస్తున్నాడు. ఒకనాడు నాలుగు బత్తాయికాయలూ, పాత పత్రికలూ తీసుకెళ్లి ఇచ్చి, ఎక్కువసేపు ఉండకుండా వెంటనే వచ్చేశాడు.

ఇంకోనాడు ఆపిల్సు కొనుక్కెళ్లి ఇచ్చి, గడపదగ్గరే నిల్చుని "ఎట్లాగైనా మీ ఆవిడకి ఆఫీసులో పలుకుబడి పెరుగుతూందోయ్. మగ వెధవలు ఎంత కష్టపడ్డా అంత పలుకుబడి రాదు," అంటూ కృత్రిమంగా నవ్వి వెళ్లిపోయాడు, ఆఫీసు పని ఉందని వంక బెట్టి.

అతను వెళ్ళిపోయాక అపిలు(శ)కూడా సయించనంతగా ఆ పలుకుబడి ఏమిటా? ఎందుకు పెరిగిందా? అనే కుతర్కంలో పడి పోయాడు ఆ అశక్తుడు.

'స్త్రీకి ఇతరులమీద పలుకుబడి ఎలా పెరుగుతుంది? ఏ స్వార్థం లేకపోతే ఆమె మాటకి సీనియర్ క్లర్కులకి లేని విలువ ఇస్తాడు యజమాని?... ఆ యజమాని ఎలా వుంటాడు? ఎటువంటి వాడు? ఇలాంటి ప్రశ్నలు అతని మెదడులో తిరుగుతూ, అతన్ని వేధించసాగాయి. వీటిని భార్యనే అడిగి నివర్తించుకునే సావకాశం అతనికి వున్నప్పటికీ, భార్య నిజం చెప్పదని ఒక నమ్మకం అతనికి. ఇవన్నిటినీ తనమీద ఆరోపణలు అనుకుంటే ఆమె సరైన జవాబు తెందుకిస్తుంది? ఆమెనించి నిజం రాబట్టడం కష్టం. వీటికి సుబ్బారావు దగ్గరనించే సమాధానాలు తెలుసుకోవాలి. వాడేమో అర గంటయినా కూర్చోడు!

బత్తాయి తొక్కలు చూసి ఆ రోజు పార్వతి, "మిమ్మల్ని చూడ్డానికి ఎవరైనా వచ్చారా ఏమిటి?" అని అడిగితే, "అవును. ఎవరో స్నేహితుడు," అన్నాడు సాంబశివరావు. సుబ్బారావు అని చెప్పలేదు. పార్వతి ఆపైన ఏమీ అడగలేదు. ఆమెకి నిదానంగా విషయాలు తెలుసుకుందామన్నా తీరిక ఎక్కడ ఉంది! ఉదయం ఐదింటికి లేస్తే రాత్రి పడుకునేసరికి పదిగంట లవుతున్నది. ఈ మధ్య కాలంలో ఆమె 'అమ్మయ్య,' అని ఒకచోట విశ్రాంతిగా కూర్చునే అవకాశం నిమిషమైనా ఉండదు. ఆఫీసు పని, అంతకంటే ఊపిరాడని ఇంటి పన్ల ...

ఆమెకీ, మంత్రమూర్తి పిల్లలకీ మధ్య సన్నిహితత్వం బాగా పెనవేసుకుపోతూవుంది. అది పార్వతికున్న బోధనాశక్తి సామర్థ్యాల వల్ల కాదు. సహజంగానే ఆమెకిగల మంచితనం, ప్రేమించే తత్వంవల్లనే.

ఆమె ట్యూషన్ చెప్పడానికి రాగానే ముందుగా ఆమె దగ్గర కొచ్చేది బాబు. 'అక్కయ్యా!' అంటూ ఆ కుర్రాడు వొచ్చిరాని మాటలతో, ప్రశ్నలతో ఆమెకి ఊపిరాడ నివ్వడు. అయినా ఆమె విసుక్కోకుండా అన్నిటికీ సమాధానం చెబుతుంది.

ఒకరోజు మంత్రమూర్తి పార్వతి రాక ముందు పిల్లలు సిరి చాపమీద చదువుకు కావల్సిన సరంజామాతో ఎంతో ఓర్పుగా సర్దుకోడం చూసి, పెద్దవాడ్ని పిల్చి "పంతులమ్మ మంచిదేనా ?" అని అడిగాడు, వాళ్ల అభిప్రాయం కనుక్కుందామన్న ఊహతోటి.

పెద్ద కుర్రాడు "చాలా మంచివారు పంతులమ్మగారు !" అన్నాడు.

రెండోవాడూ, అమ్మాయీ—తండ్రి అడక్కుండానే అక్కయ్య "కొట్టనే కొట్టదు ! మంచి కథలుకూడా చెబుతుంది !" అన్నారు.

గారాబంగా తండ్రి దగ్గిరే వున్న బాబు, ఈ సంభాషణంతా వింటున్నవాడల్లా "అక్కయ్యా? నాన్నా ! మంచిదే...ఓ !" అని తన అభిప్రాయం గూడా ముద్దు మాటల్లో వెలిబుచ్చాడు. తండ్రి కుర్రాణ్ణి ఎత్తుకుని, గుండెలికి హత్తుకుని, 'నీ చేత మంచిది అనిపించుకోడం గొప్పతనం బాబూ ! ఎంతఘంది నర్సుల్ని మంచి నీళ్ళు తాగించావో !' అనుకున్నాడు లోలోపల.

"ఊరికే కథలు చెప్పడమేనా—చదువుకూడా ఏమైనా వస్తోందా పిల్లలకి ?" అని ఆవేళ పార్వతి రాగానే ప్రశ్నించాడాయన.

"చదువూ వస్తూనే వుందండి. మీరు కావాలంటే అడిగి చూడండి !" అన్నది పార్వతి బిడియంగా.

మంత్రమూర్తి నవ్వాడు. "వీళ్లని పరీక్ష చెయ్యడం నా పని కాదు. ఊరికే అడుగుతున్నాను. వాళ్లకి చదువుకూడా రావాలని నా కోర్కె." అన్నాడు.

పార్వతి కూడా నవ్వింది.

ఇలాగే వాళ్ల చదువు వ్యవహారం సాఫీగా సాగిపోతూ ఉంది.

అయితే, ఆమె చదువుచెప్పే ఉషార్‌లో, పిల్లలతోటి సరదా మాటల్లో పడిపోయి, అరగంట ఆలశ్యంగా ఇంటికివస్తే, పాంబశివగావు ఆమెకి తిరిగి తన మామూలు జీవితం ఏమిటో గుర్తు కొచ్చేట్టు ప్రవర్తించేవాడు.

తనలో తాను కుమిలిపోతున్న సాంబశివరావుకు ఆమె ప్రతి చర్యా తప్పుగా కన్పించడంలో ఆశ్చర్యంలేదు. అయితే, తన అనుమానాల్ని రూఢిచేసుకోటానికి అతనింతవరకూ పట్టి ఊహమీదనే ఆధారపడి వుండడంలో కుమిలిపోతున్నాడేగాని, అది ఆగ్రహంగా మారటంలేదు. భార్యమొహం చూడగానే అతని ఆగ్రహం చాలా వరకు శాంతించేదికూడా.

## 33

జనవరినెల దాటింది. ఫిబ్రవరినెలలో డాక్టర్ మామూలుగా సాంబశివరావుకి ప్లాస్టర్‌కట్టు కట్టి వెళ్తూ, పార్వతిని చాటుకి పిలిచి, "ఏమమ్మా! మీవార్ని మదరాసుకు ఎప్పుడు తీసుకెళ్లుతావు? త్వరపడాలి నువ్వు. తొడదగ్గర రక్తనాళాలు నల్లగా చచ్చుపడి పోతున్నాయి ... చెప్పటం నా విధి... నేను చెప్పాను. తర్వాత నీ ఇష్టం," అన్నాడు.

పార్వతి కంగారుపడిపోయి, "అయితే ... ఏమాతుందంటారు?" అని ప్రశ్నించింది. డాక్టర్ "మరేంలేదు...రక్తం చాలా త్వరితంగా చెడిపోతోందమ్మా. ఆ కాలు వీలయినంత త్వరలో తీయించు," అని చెప్పి వెళ్లిపోయాడు.

సాంబశివరావు ఆమెనిప్పుడు ఏమన్నా, ఎంతబాధ పెట్టినా ఆమె పట్టించుకోడంలేదు. 'ఎలాగైనా వార్ని దక్కించుకోవాలి. దానికి నాలుగువందలో ఐదువందలో సంపాయించాలి. ఇంకా ఎక్కువ కష్టపడి యజమానిని నప్పించి, ఆయనదయ సంపాదించి...,' ఇలా అనుకునేది.

"ఈ ముద్ద కూడా తినండి. రానురాను ఏమిటి తగ్గించేస్తున్నారే తినటం?" అంటూ బతిమాలి అన్నం ఎక్కువ తినిపిస్తుంది. "కాఫీ బాగుందా? ఇంకా కాస్త ఇవ్వనా?" అంటూ ఇంకో గుక్కెడు ఇస్తుంది. సాంబశివరావు "ఏమిటే బలవంతం? చాలు," అంటాడు విసుగ్గా.

అయినా "క్రాపు దువ్వుతాను. ఏదీ! కాస్త చిక్కిపోయారుగాని, మీ క్రాపు దువ్వినకొద్దీ బాగుంటుంది!" అంటుంది

ఆమె. "దొరల్లే తిరిగేవాడు. నా అదృష్టం బాగోలేక ఇలా గయిపోయాడు!" అని కన్నీళ్ళు పెడుతుంది ఆ అమాయకురాలు.

సాంబశివరావు మాట్లాడడు. ఆమెదంతా నటన అనుకుంటాడు. వేషం—అని తుడిచేస్తాడు. "ఇవ్వాళ వొచ్చేప్పుడు, బీడిపప్పు పాకం తీసుకురానా? మీ కెంతో ఇష్టం," అని అడుగుతుంది పార్వతి.

"పట్టుకురా," అనేవాడు ముక్తసరిగా, ఆసక్తిలేనట్టే.

సాయంత్రం ఐదు గంటలకి వస్తూ వస్తూ పొట్లం తెచ్చిచ్చి, ఇంటిపస్లు చూసుకుని స్నానంచేసి, తిరిగి ట్యూషన్‌కి వెళ్ళేది. అక్కడికి వెళ్ళడం పది నిమిషాలు ఆలస్యమైతే పిల్లలే "ఏం అక్కయ్యా, ఇంత ఆలస్యం?" అని ప్రశ్నించేవారు.

సుశీల "మీ ఇల్లు చాలాదూరమా అక్కయ్యా?" అని గోముగా అడిగేది.

"అవునమ్మా! ఏదీ నీ పాఠంతియ్యి," అనేది పార్వతి.

"రోజూ ఎందుకమ్మా అంతదూరం పోవడం? మా ఇంట్లోనే వుండిపోరాదూ?" అనికూడా అంటుంది సుశీల.

ఆమె తిరిగి వెళ్లేప్పుడు సామాన్యంగా ప్రతిరోజూ, బాబు ఆమె తొడమీద తలపెట్టి నిద్రపొయ్యేవాడు. ఆమె వాణ్ణల్లా ఎత్తుకుని అవతల పడుకోబెట్టి బయల్దేరవల్సి వచ్చేది. ఒక్కొక్కరోజు అలా లేవదీసినప్పుడు బాబు లేచి కూర్చుని, మారాంచేసి, ఆమె వొళ్ళోనే పడుకుంటానని గోలచేసేవాడు. మళ్ళీ వాణ్ణి నిద్రపుచ్చి బయల్దేరవల్సి వచ్చేది. అటువంటప్పుడు ఆమెకి ఇంట్లో చీవాట్లు విపరీతమయ్యేవి. అయినా, అటు ట్యూషనూ వొదులుకోరానిదైంది: ఇటు భర్త చీవాట్లూ తప్పనిసరి ఐనాయి. కుర్రాణ్ణి కసిరి దూరంచేసుకోటం ఆమె స్వభావానికే విరుద్ధం.

పార్వతి అరగంట-గంట ఆలస్యానికి అలసిపోవడంలేదు. భర్త నొక్కిడిశల్లనే కాని, లేకపోతే ఆ పిల్లలతో ఇంకో అరగంట గడపడం ఆమెకి చాలా ఇష్టం.

పార్వతిని గురించి ఇంకా తెలుసుకోవాలని, సుబ్బారావు కోసం ఎప్పుడూ ఎదురు చూస్తూవుండే సాంబశివరావుకి; సుబ్బారావు

అప్పుడప్పుడు ఐదు నిమిషాలు, పది నిమిషాలు మాత్రమే దర్శనమిచ్చి వెళ్లి పోతూండేవాడు. తానిక్కడికి రావడం పార్వతి కంటపడకూడదని అతనిఉద్దేశం. ఆమె ట్యూషన్ వెళ్ళాక—వొచ్చి, కనపడి వెళ్లి పోతూండేవాడు. ఈ విధం గా అతను సాంబశివ రావులోని ఆసక్తిని విపరీతంగా రెచ్చగొట్టాడు. భార్య అంటే భర్తకి ఏదో గుర్రు అన్నంత వరకూ తేల్చుకున్న సుబ్బారావు, దాన్ని పెంచటానికి అప్పుడొక మాటా, ఇప్పుడొక మాటా మాత్రం అని ఊరుకునేవాడు.

"మంత్రమూర్తిగారంటే ఆఫీసులో అందరికీ హడల్. మీ ఆవిడ మాత్రం ఆయనతో చాలా ఫ్రీగా మాట్లాడుతుందోయ్. చప్పున పైకి వస్తుంది. వొచ్చే ఏడాది జీతం పెంచాలని కూడా అన్నాడట," అన్నాడొక తడవ సుబ్బారావు.

సాంబశివరావు నోరు మూసుకుని వింటాడంతా. ఏమీ ప్రశ్నించలేడు. సుబ్బారావు, "అబ్బాయి, నేనేదో అంటున్నానను కోకు. లోకద పనిచేసిన ఆడవాళ్ళు ఇంతే. అది స్త్రీలకి వుండే ఇన్‌ఫ్లుయెన్సు. అది సహజం," అనేసి వెళ్లి పోయాడు.

మరొక్క నెల ఇలాగే గడిచింది. ఒకనాడు పార్వతి పిల్లలకి ట్యూషన్ చెబుతూవుంది. పసివాడు, ఆమె వొళ్ళో కూర్చున్నాడు. ఏమిటో అడుగుతున్నాడు. ఆమె చదువు చెబుతూ వాడి మాట విన్పించుకోలేదు. "చెప్పు అక్కయ్యా!" అని ఆమె జుట్టు పట్టుకుని పీకాడా కుర్రాడు. చక్కగా దువ్విన తలంతా రేగింది. పార్వతి కుర్రాణ్ణి ఒళ్లో పెట్టి "ఏమిటి నాన్నా?" అని తిరిగి ప్రశ్నించింది. "కాకి నక్క కథ చెప్పు!" అని ఆజ్ఞాపించాడా కుర్రాడు. జుట్టు చేత్తోనే సవరించుకొంటూ పార్వతి ఆ కథను మూడు ముక్కల్లో కుర్రాడికి అర్థమయ్యే భాషలో చెప్పింది. కుర్రాడు సంతృప్తిపడి ఊరుకున్నాడు. ఆ వేళకూడా కొంచెం ఆలశ్యమే ఐంది.

ఆ వేళ పమిటలాగి వొళ్లంతా కప్పుకుని ఇంటికి వొచ్చిం దామె. చలిగాలికి విద్యుద్దీపాలు సైతం వణుకు తున్నాయా అనిపిస్తోంది. కృష్ణ పక్కన చీకట్లు వాళ్లింటి ముందే గుమిగూడి నట్టున్నది.

సాంబశివరావు ఆమె కోసమే కళ్లల్లో వత్తులేసుకుని ఎదురు చూస్తున్నాడు గనక, ఆమె రాగానే మామూలు ప్రకారమే ఆమెని ఆపాదమస్తకం ఒకసారి చూశాడు. అతని కడుపు భగ్గున రగుల్కొంది. ఆమె నున్నగా దువ్విన జుట్టు రేగివుంది... జుట్టు చెరిగిపోయింది! 'చెంగుగూడా నలిగే వుందేం? ఎందుకలా వొణుకుతోంది?...'

"ఇటురావే!" అన్నాడు క్రూరంగా. "ఏమిటండీ?" అంటూ ఆమె దగ్గిరకొచ్చింది. అతను ఆమెను జుట్టు పట్టుకుని వొంచి, ఇష్టం వొచ్చినట్టు కొట్టేశాడు. తాను అడిగితే నిజంమాత్రం చెబుతుందా అది! ఉద్రేకం పట్టలేక ఎందుకు దండిస్తున్నాడో తెలియక అల్లాడిపోతున్న ఆ అబలకి ఏమీ చెప్పకుండా, దబదబ గొడ్డును బాదినట్టు బాది వొదిలేశాడు. ఆవేళ అతను ఆమె ఎంత బతిమాలినా అన్నం తినలేదు.

'తాను ఆలశ్యంగా వొచ్చినందుకే ఇది శిక్ష. తనమీద కక్షకొద్దీ భోజనం మానేశాడే! అసలే నీరసం... మరీ నీరసించిపోతాడేమో,' అని చాలాసేపు అతన్ని బతిమాలింది. కాని, చీవాట్లు తిని ఊరుకుంది. ఆ రాత్రి ఉభయులకీ ఏకాదశివ్రతం.

## 34

ప్రస్తుతం సాంబశివరావుకి, యజమాని మంత్రమూర్తి అంటే అర్థంలేని మంట. అతని స్వరూపాన్ని తనకు తోచినట్టల్లా ఊహించుకుంటూ డతను. ఒకసారి కోరమీసాలూ, గిరజాలూ ఉండి భీమసేనుడల్లే కనపడతాడు అతని మానసిక ఫలంకమీద. రెండోసారి చక్కని యువకుడుగా కన్పిస్తాడు. అతన్ని యుద్ధంచేసి ఓడించినట్టుగా ఊహించుకుంటాడు. పార్వతిని అతని బంధనంలోంచి ద్వంద్వ యుద్ధంచేసి రక్షించుకున్నట్టుగా కలగంటాడు.

ఎంత చేసినా, ఈ పగటి కలల్నించి మేల్కొగానే అతనికి మిగిలేప్రశ్న "మంత్రమూర్తి ఎలా వుంటాడు?" అని మాత్రమే. ఎన్నాళ్లకీకీ అది ప్రశ్నగానే మిగిలిపోతుంది. మళ్లా భార్యనడిగి తెలుసుకోడానికి పౌరుషమో, పిరికితనమో అడ్డం. నామర్దా అనిపి

స్తుంది ఆమెని ప్రశ్నించడం. ఆమె వొకవేళ చెప్పినా అది నిజమని నమ్మకమేమిటి? తానేమో ఏదీ నిర్ధారణ చేసుకోలేని అశక్తుడు. అందువల్లనేకదా ఆమె తనని ఇలా ఆడిస్తోంది! అయితే, ఆశ్చర్యమేమిటంటే, తనేమన్నా ఆమె ఎదురు తిరగదు. మౌనంగా ఊరుకుంటుంది. అదొక టెక్నిక్ గావును! భర్తలు ఎద్దల్లే తిరుగుతూంటేనే సవాలక్ష ప్రణయ కలాపాలాడే స్త్రీలున్నారని కర్ణాకర్ణిగా ఎన్నో కథలు విన్నాడు తను. ఎన్నో చదివాడు. లేవలేని మొగుడి కళ్లు కప్పడం అనగా ఎంత?

పార్వతి భర్త మనస్సులోని విపరీతమైన ఆందోళనని అతని శారీరక బాధగానే గుర్తించి మామూలుగా ప్రవర్తిస్తోంది.

ఒకనాడు పార్వతి మామూలుగా ఆఫీసుకెళ్లింది. ఆవేళ సుబ్బారావు 'అమ్మమ్మ తద్దినం,' అని శలవుపెట్టాడు. అతను మెల్లగా మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో సాంబశివరావు దగ్గిరకొచ్చాడు.

సాంబశివరావు బ్రహ్మానందంలోపడి "రారా సుబ్బాయి, ఆలోచించి ఆలోచించి బుర్ర చెడిపోతూంది రా. ఎవరైనా మాట్లాడ్డానికి దొరుకుతారా అని చస్తున్నానుకో," అని ఆహ్వానించి తన మంచంమీదనే కూర్చోపెట్టుకున్నాడు.

సుబ్బారావు "అబ్బబ్బ, పని వొత్తిడి జాస్తయి పోతున్నదిరా, చస్తున్నాను. తలనొప్పి ఎక్కువై ఇవ్వాళ శలవపెట్టానోయ్. నీకెలావుంది? కులాసాయేనా?" అని ప్రశ్నించాడు.

సాంబశివరావు "కాలందే. పెద్దబాధలేదులే. కదలిస్తున్నావా-ఏమన్నావా!" అని ఇంకేదో సుబ్బారావును అడగాలనుకున్నవాడు, 'ఎలా అడగడం, ప్రశ్న ఏ రూపంలో ఉంటే పరువుగా ఉంటుంది?' అని ఆలోచిస్తూ ఉండిపోయాడు.

ఇదే సమయాన సాంబశివరావు ఇంటికి పదిగజాల దూరంలో కాళిదాసు ఇంటిముందు, మంత్రిమూర్తి ప్లిమత్ కారొచ్చి ఆగింది. కారులోంచి దిగిన కాంతారావు, కాళిదాసు ఇంట్లోకెళ్లి, ఆయన్ని కేకవేసి బైటికొచ్చి కారులోవున్న మంత్రిమూర్తితో, ఏదోవిషయం చెప్తూ ఇటువైపు-అంటే సాంబశివరావు ఇంటివైపు, ఎండ వెలుగులో

నీటుగా డ్రెస్ చేసుకుని కూర్చునివున్న సుబ్బారావును అప్రయత్నంగా చూసి, "సుబ్బారావు!" అని కేక వేశాడు. మంత్రమూర్తి కారు కిటికీ లోంచి ఒకక్షణం బైటికిచూసి, మళ్ళా మామూలుగా కూర్చుండి పోయినాడు.

సాంబశివరావుకూడా సుబ్బారావుతోపాటే తలెత్తి రోడ్డు కేసి చూశాడు. సుబ్బారావుకి ప్లిమత్ కారు చూడ్డంతోటే గుండె లదిరిపోయాయి. 'వీళ్లు ఇక్కడ కొచ్చారేమిటి?' అనుకుంటూనే లేచాడు వెళ్లటానికి.

సాంబశివరావు "ఎవరాయన నిన్ను పిల్చేది?" అని అడిగాడు.

సుబ్బారావు వెళ్తూ "మా ప్రొప్రయిటరోయ్. నిన్న గన్న వరం వెళ్దామని కాళిదాసుగారూ, ఆయనా అనుకున్నారు. ఇప్పుడు వెళ్తున్నారు గాబోలు...అక్కడ మా కంపెనీ బ్రాంచి వుందిలే," అంటూ వెళ్లిపోయినాడు.

సుబ్బారావు చూపినవైపే సాంబశివరావు చూశాడు. నీటుగా చక్కగా అలంకరించుకొనివున్న కాంతారావు కన్పించాడు. అంతలోనే కాళిదాసు రావటమూ, కారులోకి కాంతారావూ ఆయనా ఎక్కడమూ, కారు బయల్దేరి వెళ్ళిపోవడమూ జరిగాయి. సుబ్బారావు, కాంతారావుతో ఒక్క మాటమాత్రం అనేసి, సరా సరి గాంధీనగరంవైపు వెళ్లిపోయాడు.

సాంబశివరావు మనస్సులో సుబ్బారావును అడగాలనుకున్న ప్రశ్నలన్నిటికీ ఇలా అవాంతరం యేర్పడింది. 'ఇతనా మంత్ర మూర్తి అంటే? యువకుడే! మహావుంటే పాతికేళ్ళకంటే వుండవే! వీడికి పిల్లలా? వాళ్లకి ట్యూషనా?...బాగుంది నాటకం...!'అను కున్నాడతను. కాని, ఇప్పుడేమనుకున్నా లాభంలేదు అని కూడా అనిపించింది.

ఆవేళ పార్వతి ఇంటికి వొచ్చాక ఆమెని ఆవేళే కొత్తగా చూస్తున్నట్టుగా చూశాడు భర్త. ఆమె మామూలుగానే అతనికి చెయ్యవల్సిన పరిచర్యలు చేసింది. సాంబశివరావు పిచ్చెత్తినట్టుగా కోపం, ఏదో అర్థంకాని జెలసీతోటి యేమీ అనకుండా వుండి

పోయాడు. ఉద్రేకం విపరీతమై హెచ్చుస్థాయిలో వుండడంతో మనిషి జ్వరం తగిలినవాడిలాగా వొణికిపోతున్నాడు.

"చలి ఎక్కువగా ఉందా?" అన్నది భార్య దుప్పటి కప్పుతూ.

భర్త ఏమీ మాట్లాడలేదు. ఆమెని చూస్తున్న రెండుకళ్ళూ నిప్పులు కక్కుతున్నాయి. ఏమనటానికీ ఆధారం దొరక్క అల్లాడి పోతున్నాడు ఆ అశక్తుడు. 'నీ యజమాని యువకుడు గనక, నువ్వు రంకులాడివి!' అనటమా? 'నీ జాట్టు మొన్న ఎందుకు చెరిగింది? బొట్టెందుకు చెరిగింది!' అనటమా? 'ఆఫీసునుంచి రావటానికి ఇంత ఆలశ్యం చేస్తున్నావేం—నాకు కారణం తెలీదనుకోకు,' అనడమా? 'నీ ట్యూషన్ల రహస్యం నాకూ తెలుసు!' అనటమా?— ఏం అడగడం ఆమెని? ఈ క్షణంవరకూ ఆమె తనకు విముఖురాలై వుందనటానికి ఏమాత్రం నిదర్శనంలేదు. ఆప్యాయంతోనే చూస్తున్నది. సాంబశివరావు ఆమె అన్నంపెట్టడానికొస్తే కంచం నెట్టేసి పక్కకి తిరిగి పడుకున్నాడావేళ. ఏం కారణమో తెలీక అల్లాడి పోయిందాయువతి. మళ్ళీ విధిని తల్చుకుంటూ ట్యూషన్‌కు వెళ్ళింది. అప్పటికి ఈ తతంగంతో ఎనిమిదిగంటలయింది. బాబు నిద్రకూడా పోయాడు. మంత్రమూర్తి ఇంట్లోలేడు. కైలాసం మాత్రం ఉన్నాడు. "వారు రాత్రికి వస్తారు. పదీ, పదకొండవుతుంది," అన్నాడతను.

"ఇప్పటికే ఎనిమిదింబావు అయిందండి. ఇవ్వాళ్టికి పిల్లల్ని చదువుకోమనండి. నేను చెప్పిపోదామని వచ్చాను," అంది పార్వతి. ఇంకోగంట చదువుచెప్పి ఇంటికిపోతే, ఇల్లు నరకం అవుతుందని వొణికి పోతున్నదామె. భర్తలో హిస్టీరియాలాగా వొచ్చే ఈ మార్పు లామెకేమీ బోధపడకుండా వున్నాయి. మెదడు ఆలోచనలతో పగిలిపోతున్నది.

"ఏం? పనివుందా ఇంట్లో? వెళ్ళు అయితే...నువ్వన్నదీ నిజమే. చీకటిపడిపోతోంది. వెళ్ళమ్మా!" అన్నాడాయన. రోడ్డుదాకా వదిలిపెట్టటానికి వచ్చిన కైలాసంతో పార్వతి, "ఏమండి...మా వారి కాలు తీసెయ్యాలండి...మొన్న చెప్పానుగా! అంత మొత్తం ఎలా పోగుచెయ్యనండి? మీరు కాస్త అయ్య

వారితో చెప్పాలి. ఇంకెవరున్నారు నాకు ?" అని చెంగునోటికి అడ్డంపెట్టుకుని వెక్కి వెక్కి యేడ్చింది. కోడ్డుదీపపు కాంతిలో ఆమె జాలిగొల్పే వ్యక్తిత్వం కైలాసాన్ని ఎంతయినా కదిల్చింది.

"చెబుతానమ్మా, చెబుతాను. నాకు నువ్వు వేరే చెప్పాలా ? అయ్యవారు కాస్త సుముఖంగా ఉన్నప్పుడు అంటిస్తే, ఇది వారి కెంతపని !...ఏడవకు తల్లి. మంచివాళ్ల కష్టాలు మంచులా కరిగి పోతాయని మా నాన్న అంటూవుండేవారు," అన్నాడు ఆమెని ఓదారుస్తూ.

పిల్లలు లోపలికెళ్లిపోయారు వీరిద్దరూ మాట్లాడ్డంచూసి.

పార్వతికి ఓదార్చినకొద్ది దుఃఖం పొంగి పొరలివస్తున్నది. ఆమె గద్గదస్వరంతో "నిన్నకూడా ... ఆస్పత్రికి... వెళ్తే... డాక్టర్ మళ్ళీ హెచ్చరించారు..." అంది మెళ్ళో మెరుస్తూన్న మాంగల్యం, నల్లపూసలూ చూపిస్తూ. ఆమె మాట్లాడలేక పోతున్నది. వెక్కుతున్నది. కన్నీళ్ళముత్యాలు దీపపువెలుగులో మెరుస్తున్నాయి.

తండ్రి అంతటివాడుగనక కైలాసం ఆమెను సమీపించి చెయ్యిపట్టుకుని "ధైర్యంవదలకు. కంగారైపోతే ఎలా ? నీకేమి టమ్మా, దీర్ఘసుమంగళివి ! నేను వారితో మాట్లాడి ఏర్పాటు చేస్తానన్నాగా ! వెళ్లు. దిగులు పడకు," అని ఓదార్చి పంపించాడు.

పార్వతి ఆలోచిస్తూ బయల్దేరింది.

రోడ్లన్నీ జనసందోహంతో నిండి కళకళలాడుతున్నాయి. ఎనిమిదిన్నరయినా కొట్లూ, కాఫీ హోటళ్ళూ జనంతో నిండి కోలాహలంగా వున్నాయి. పార్వతి, చెంగు బాగా కప్పుకుని పిచ్చి దానిలా నడిచిపోతోంది. రకరకాల మనుషులు ఆమెకి ఎదురుపడి తప్పుకుపోతున్నారు. జనబాహుళ్యపు కోలాహలం ఓంకార నాదంలా వినిపిస్తోంది. దీపాలు ప్రకాశవంతంగా వెలుగు తున్నాయి. హోటళ్లలోని రేడియోల్లోంచి, ఏవేవో పాటలు విన్పిస్తున్నాయి.

ఆమె పదిహేను నిమిషాలు నడిచి ఇల్లు చేరుకుంది. సాంబ శివరావు లాంతర్ వెలుగులో పడుకుని, అటూ ఇటూ పొర్లు తున్నాడు ఆలోచనలతోటీ, ఆకలితోటీ నిద్రరాక.

పార్వతి ఆవేళకూడా "ఏమండి, అంతగా సయించలేకపోతే ఒక్కముద్దే తినండి!" అని బలిమాలింది. సాంబశివరావు కొంతసేపు బెట్టుసరిగానే వున్నాడుగాని, ఆకలి తాళలేక "తగలెయ్యి కాస్త," అని రెగి వచ్చాడు. పార్వతి గబగబ మళ్లీ అన్నం కలుపుకొచ్చి అతనికి తినిపించింది. అన్నం తింటూన్నంతసేపూ సాంబశివరావు నీరసమైన తన చూపుతోటే ఆమెని దహిస్తున్నట్టే చూశాడు. పార్వతి ఇదేమీ పట్టించుకోనేలేదు. భర్త అన్నం తిన్నందుకు సంతోషిస్తూ, కైలాసం పాయంచేస్తాడన్న మొండి ధైర్యంతోటి, నిండు మనస్సుతో వెళ్లి భోంచేసి, అతని మంచం పక్కనే దుప్పటి పరుచుకుని పడుకుంది. ఆ తర్వాత సాంబశివరావు చాలాసేపు నిద్రపోలేదుగాని, ఆమె పది నిమిషాల్లో గాఢనిద్రలో పడిపోయింది. కల్మషంలేని ఆమె మనస్సు ఆమెకి గాఢ సుషుప్తిని అతిత్వరగానే ప్రసాదించ గలిగింది.

## 35

ఆశాపాశాలు, బంధనాలు మానవుల మనస్సులకే సంబంధించినవే ఐనా, వాటిమీదకూడా పరిస్థితుల ప్రభావం ఉంటుంది. పరిస్థితులు ఎంత వొత్తిడి పెట్టినా పార్వతి—మంత్రమూర్తి పిల్లలకి చదువు చెప్పడం మానలేక పోతోంది. డబ్బులకోసమే చదువు చెప్పటానికి కుదిరినా, సుశీలయొక్క మరుపురాని చిరునవ్వూ, బాబు చూపించే అనురాగం, పెద్దపిల్లలిద్దరూ ప్రదర్శించే ముచ్చట గొలిపే గౌరవాభిమానాలూ ఆమెని బంధించివేశాయి. భర్త పెట్టే రకరకాల హింసల్ని ఓర్చుకుని, ఇంకా ఆమెలో భర్తపట్ల అనురాగం దృఢపడిపోతున్నదంటే, అది ఆమె నైజశక్తి అనుకోవాలి.

పరిస్థితుల ప్రభావానికి లొంగి; బంధనాల్ని, ఆశాపాశాల్ని తెంచుకునేవారూ, సన్యాసాలు పుచ్చుకునేవారూ తరుచూ కనపడే సమాజంలోనే ఎంత వొత్తిడివచ్చినా ప్రబలమయ్యే బంధనాలు కొందరికి వుంటాయి. వారిలో నిబిడీకృతమైన మానవత్వపు విలువలే కారణమేమో! పార్వతి ఈ తరహాకి చెందిన యువతి.

రోజురోజుకీ సాంబశివరావు శారీరకంగా నీరసించి పోతున్నాడు. మానసికంగా ఎంతగా జెలసీ పెరిగిపోతూవుందో, అలాగే

శరీరంలోని రక్తం విపతుల్యమౌతున్నది. కాస్త ఉద్రేకంగా మాట్లాడితే, కాస్త గట్టిగా అరిస్తే—గుండె దారుణంగా కొట్టుకుంటూ ఆయాసం వస్తోంది. దానికి తగ్గట్టే అతను ప్రతి స్వల్ప విషయానికీ పార్వతిని కసురుకుంటూ, క్షణం క్షణం ఉద్రేకం తెచ్చుకుంటూ ఆయాసపడతాడు. అయినా ఏమాత్రం పశ్చాత్తాప పడడు.

పార్వతి రోజువారీ కార్యక్రమం ఏమీ మారలేదు. ఆమె దేన్నీ పట్టించుకోకుండా మామూలుగా ఆఫీసుకు పోతూవుంది.

ఉద్యోగంచేసే విషయంలోనైనా తగాదా రావటం లేదుగాని, సాంబశివరావుకి భార్య చీకటిపడ్డాక ఇల్లు కదిలిపోవడం ఏమాత్రం నచ్చడంలేదు.

"ఏమే, ట్యూషన్ మానెయ్యరాదూ?" అన్నాడు ఒకనాడు ఆమె ట్యూషన్‌కి బయల్దేరబోతూవుంటే.

"ఇప్పుడు ఉన్నట్టుండి మానుకుంటే ఎలాగండీ! ఇంకో నాలుగు నెలలపాటు ఎట్లాగో తంటాలుపడితే, ఈలోగా మీకు ఈ ప్లాస్టర్ చికిత్సకూడా పూర్తి అవుతుంది. ఆతర్వాత మనకి అరసైరూపాయలు సరిపోతాయి...అప్పుడు మీరు చెప్పక్కర లేకుండానే మానేస్తానండీ," అంది పార్వతి నమ్రతగా.

సాంబశివరావు ఊరుకొన్నాడప్పటికి. ఆమె గొంతులోని నిజాయితీ అతనికి అవగాహన ఐవుంటుంది.

అయినా రోజూ కీచులాట తప్పటంలేదు ఆ దంపతులకి.

పార్వతి ట్యూషనుకి బయల్దేరిన దగ్గిరనుంచీ, ఇంటికొచ్చే వరకూ, అనుక్షణం భర్త జ్ఞాపకంతోటే ఉంటుంది.

కాని-ఆ పిల్లలు! వాళ్లు మంత్రమూర్తిచ్చే డబ్బు మొత్తానికి ఎంత వరకు ప్రేమ చూపవచ్చునో అంతే ప్రేమ చూపించే నర్సులతో విసిగిపోయారు. మేనత్తకూడా సంవత్సరంలో మూడు నెలలు అక్కడేవుండి వాళ్లను చూస్తూ వుండేదిగాని, ఆమె చిరచిరలాడే మనిషి. పిల్లల్ని అనేక సమయాలలో పెద్దలతో జమకట్టి 'ఏమీ తెలీదేం వీళ్లకి,' అంటూ ప్రవర్తిస్తుంది.

పెద్ద కుర్రాడి దగ్గరనుంచి బాబు వరకూ అందరికీ పార్వతి సాహచర్యం—ఎడారిలో ఓయాసిస్‌లాగా, నీళ్లు దొరకని ఎండలో దీర్ఘప్రయాణం చేసిన బాటసారులకి మంచినీళ్లకొలనూ, మర్రిచెట్టు నీడా దొరికినట్టుంది.

వాళ్లు ఆమె రావటంతోటే ఆమె సమీపంగా కూర్చుని "అక్కయ్యా, నిన్నటి పాఠాలు చదివేశాం!" అని ఆనందంతో చెప్పుకుంటారు. లేదా సుశీల "ఇంకా లెక్కలు వేయలేదక్కయ్యా," అంటుంది.

"ఇప్పుడు వెయ్యి సుశీ! ఫర్వాలేదు," అని ఆ అమ్మాయిని బుజ్జగించి, ఇంకో కుర్రాడిచేత పాఠాలు అప్పచెప్పించుకుంటుంది. బాబు కూడా ఓ బొమ్మల పుస్తకం పట్టుకుని, "కాకి వుంది... అప్పచ్చి తెచ్చింది," అంటూ చదువుతాడు. పార్వతి అన్ని దిగుళ్ళూ మరిచి, వాడి ముద్దు మాటల్లో లీనమౌతుంది.

రెండోవాడు గోపాలకృష్ణ "ఏరా బాబూ, ఎన్నాళ్లు చూసినా కాకి కథేనా? యాక్కో—" అని వెక్కిరిస్తాడు. దీంతో రోషం వచ్చి బాబు, "అక్కయ్యా!" అని ఏడుపు లంకించుకుంటాడు.

"ఇవాళ బాతుకథ చెబుతాను," అంటుంది పార్వతి. ఏదో కథ చిటికలో సృష్టించి చెప్పిందాకా బాబు ఆరాటం తగ్గదు.

అలా తనతోటి గంటయినా, రెండుగంటలయినా అతుక్కుపోయి జీవించే ఆ పిల్లలు ఆమెకి అత్యావసరమయ్యారు కాసేపు కష్టాలను మరిచేందుకు.

భర్త మానుకోమన్నప్పుడల్లా ఆమెకి కైలాసం ఇప్పిస్తానన్న పెద్ద డబ్బుమొత్తం పిల్లల అనురాగమూ పెనవేసుకుని జ్ఞాపకం వచ్చేవి.

"ఎందుకు మానుకోమంటున్నారు? ఏం పెద్ద కష్టమని?" అన్ని ప్రశ్నించింది ఒకనాడు భర్తని.

"నీకు కష్టమని గాదు...ఒంటరిగా నే నెంత బాధపడిపోతున్నానో నీ కెప్పటికీ అర్థం కాదేం?" అన్నాడు భర్త.

"నిజమే. కాని ఏం చెయ్యడం!" అనేసి ఊరుకుండామె. డాక్టర్ చెప్పే విషయాలు భర్తకి చెప్పి, ఆయన రోజూ ఇలా వేధించకుండా చేసుకుందామనుకుంటుంది. కాని... మళ్లీ భర్త నీరసం, రోజురోజుకీ పాలిపోతున్న ఆయన వర్చస్సూ, డాక్టర్ కఠినంగా చేసిన హెచ్చరికా ఆమె నోరు కట్టేస్తాయి.

'తిరగడం మరిగింది...ఎన్నాళ్లని రోగిష్టి భర్తనే తల్చుకుని వుండగలదు వయసు భార్య? ఆమె తిరిగే పరిసరాలూ, చూసే చక్కని యువకులూ ఆమె మనసును ఎంతలో మార్చాలి? ఆమె గనక ఇలా ఉద్యోగమనీ, ట్యూషననీ బయలు దేరకుండానన్నా ఇంట్లోనే ఉన్నట్టయితే బాగుండేది...' అనుకుంటూ ఉంటే అతని నరాలూ, మెదడూ జెలసీతో, అనుమానంతో గజిబిజి ఐపోయేవి. ఇప్పటికైనా అరికట్టుకో...చూశావుగా ఆ ఆఫీసు యజమాని ఎంత అందంగా వున్నాడో! యజమానేకాదు, తోటి క్లార్కు సుబ్బారావు మాత్రం? బ్రహ్మచారి. బలిష్టంగా, అందంగావున్నాడు. ఆమె మనస్సు చలించటానికి ఎంతకావాలి? అరికట్టు నీ భార్యని! నీ వశం చేసుకో!, ఇలా అనేది ఎల్లప్పుడూ దుష్టప్రేరణలే కల్గిస్తూండే ఒక గొంతుక అతనిలోంచి. దానికే సామాన్యంగా తలవొంచే సాంబశివరావు, బుర్ర వేడెక్కి కోతిలా ఐపోతున్నాడు రోజు రోజుకీ.

## 36

మార్చి నెలలో ఉగాది ఇంకా పదిరోజులుందనగా ఒకనాడు, పార్వతి ఆఫీసుకొచ్చి అప్పుడే తన ఫైల్సు సర్దుకుంటోంది. మంత్రమూర్తి కూడా అప్పుడే వచ్చాడు. ఆయన లోపలికివెళ్తూ, పార్వతిని లోపలికి రమ్మని చేత్తో సౌంజ్ఞచేసి వెళ్లాడు.

పార్వతికి లోపలికివెళ్లి నుంచుంది.

"అమ్మాయికి రాత్రినించీ జ్వరం. ఒకటేమైనా 'అక్కయ్యా, అక్కయ్యా,' అని కలవరిస్తోంది. కాస్త వెళ్లిచూసిరా అమ్మా. ఈ పూటకు అక్కడే వుండు. ఫర్వాలేదు," అన్నాడాయన. లోపలి దిగులు ఆయన నుదుటి ముడతలలో బాగా వ్యక్తమౌతున్నాయి.

"వెళ్తానండి!" అంటూ పార్వతి బైటికి వచ్చింది. బైట ప్లిమత్ కారువుంది. డ్రైవర్ ఆమెని చూడగానే, "ఎక్కండమ్మా. అయ్యవారు చెప్పారు" అన్నాడు.

మరొక్క పదినిమిషాలలో కారు మంత్రమూర్తి ఇంటిముందు ఆగింది. పార్వతి గబగబ ఇంట్లోకెళ్లింది. పెద్దబ్బాయిలిద్దరూ బడికి వెళ్లినట్టున్నారు. బాబు, అక్కయ్య పడుకున్న మంచం పక్కనే కుర్చీలో కూర్చుని ఏదో సెల్యులాయిడ్ బొమ్మతో ఆడుకుంటూ వున్నాడు.

వంటచేసే ఆవిడకూడా మంచందగ్గిరే కూర్చునివుంది. సుశీల పడుకుని కళ్ళు సగంమూసుకునివుంది. పార్వతి వెళ్ళడంతోటే, వంటావిడ "ఏమిటోనమ్మా ఈ పిల్లలు! ఇష్టం వచ్చినట్లు తింటారు. రోగాలు రావా ఏం?" అని మెల్లగా అని, మూతి విరుచుకుంటూ, "నీకోసమే కలవరిస్తున్నదమ్మా," అంటూ లోపలికిపోయింది.

మంత్రమూర్తి ఇంట్లో వంట వాళ్లిద్దరూ, పనివాళ్లిద్దరూ ఉన్నారు.

పార్వతి నిదానంగా వెళ్లి సుశీల మంచంమీద కూర్చుని అమ్మాయి వొళ్ళు ఎలావుందో చూసింది. వెచ్చగానేవుంది. కణతలు మాత్రం బాగా వేడిగావున్నాయి. సుశీలకూడా పార్వతి స్పృశించగానే మెల్లగా కళ్ళుతెరిచి, "వొచ్చావా అక్కయ్యా?" అంది. పసిదాని మొహంలో ఎక్కడలేని వికాసమూ వొచ్చింది. బాబు కూడా పార్వతిని చూడగానే ఆమె మీదికి ఎగబడి "అక్కయ్యా! అక్కయ్యా!" అని బ్రహ్మానందంలో పడిపోయాడు. తర్వాత మెల్లగా "సుశీకి జ్వరమా?" అని అడిగాడు.

"అవును బాబూ," అన్నది పార్వతి.

"అక్కయ్యా, ఇక్కడే వుండిపోవూ?" అన్నది సుశీ.

"ఉంటాగా," అన్నది పార్వతి.

బాబు "అక్కయ్య ఇక్కడే వుంటుంది! ఓ!" అని కేకలేసుకుంటూ హాలంతా పరిగెత్తి గంతులేస్తున్నాడు. చిన్న నిక్కరూ, బనీనూ తొడుక్కుని బంతల్లే ఎగురుతున్న ఆ కుర్రాణ్ణి చూస్తూన్నకొద్దీ

పార్వతికి అపరిమితమైన సంతోషం వేసింది. ఆ పట్రాడి సంతోషం కోపమైనా అక్కడే వుండిపోవాలనిపిస్తున్న దామెకి.

మధ్యాహ్నం వొంటిగంటకు మంత్రమూర్తి ఒకసారి ఇంటికి వచ్చాడు పిల్లల్ని చూసిపోవడానికి.

"నువ్వంటే వీళ్ళు ఇంత ప్రేమగా వుంటారేమమ్మా? ఏం మంత్రం వేశావు?" అన్నాడాయన. పార్వతి నవ్వి వూరుకుంది. "రాత్రి దాకా వుండి వెళ్ళు. వీలయినంత తొందరగా వీళ్ళని నిద్ర పుచ్చి పో అమ్మా—నీ కెంతయినా పుణ్యముంటుంది," అని చెప్పి వెళ్ళాడాయన.

అట్లాగే పార్వతి గాత్రి 9 గంటలదాకా అక్కడే వుంది. ఏడుగంటల దగ్గిరనుంచీ ఆమెకి గుండెదడ ప్రారంభమైంది. 'నేను వెళ్ళి వంటచేసుకోవాలి,' అందామని ప్రతి ఐదునిమిషాల కొకసారి ప్రయత్నించినా, పైకి అనలేకపోయింది...నిర్బంధంగా, తప్పనిసరిగా వుండిపోయిందామె ప్రతి నిమిషమూ.

ఆఫీసుటైమ్ కాగానే మంత్రమూర్తీ, కైలాసమూ ఇంటికి వొచ్చి పైట వరండాలో కూర్చుని ఆఫీసు విషయాలు మాట్లాడు కుంటున్నారు.

పార్వతికి నిప్పులమీద వున్నట్టుగా వుంది. ఆమె సుశీ పక్కనే కూర్చుని, పెద్ద పిల్లలిద్దరికీ పాఠాలు చెప్పింది. ఏడుగంటల ప్రాంతంలో వంటామె వచ్చి "మీరూ ఇక్కడే భోం చేస్తారా?" అని అడిగింది. "అక్కర్లేదు," అన్నది పార్వతి.

మరో రెండుగంటల సేపటివరకూ సుశీ నిద్రపోలేదు. మేలుక్కున్నంతసేపూ "ఉండు అక్కయ్యా," అంటూనే ఉంది. ఆ అమ్మాయి పార్వతిని కావలించుకునే వుండడంచేత, ఆమె కదలలేకపోతోంది.

భర్త చీదరించుకునే క్రూరమైన కళ్ళూ, ఆలశ్యమైతే అనే వినరాని మాటలూ ఆమె మనస్సులో మెదులుతూ, కడుపులో తిప్పు తున్నాయి. దాదాపు ఐదుగంటలకి వెళ్ళి స్నానం చేయించాల్సింది మామూలు ప్రకారం. ఎనిమిదిగంటలకల్లా రెండు మెతుకులూ పెట్టాలి.

తొమ్మిదింటికి సుశీల నిద్రపోయింది. మంత్రమూర్తి "కారులో వెళ్లమ్మా. చాలా పొద్దుపోయింది!" అన్నాడు. పార్వతి మారు మాట్లాడకుండా కారెక్కి ఇల్లు చేరుకుంది. సాంబశివరావు ఆమె ఇంట్లో అడుగుపెట్టగానే చూసిన చూపుకే శక్తివుంటే, ఆమె భస్మమై వుండేది. ఆమె చీకటింట్లోకి తడుములాడుకుంటూ వెళ్లి దీపంపెట్టింది. భర్త నోటికొచ్చినట్టు వాగుతున్నా వినిపించుకోకుండా గబగబ పొయ్యిరాజేసి అన్నం మాత్రం వండి, భర్తకు పెట్టబోయింది.

సాంబశివరావు కలిపిన అన్నం కాస్తా ఆమె నెత్తిన కుమ్మరించాడు. ఆమెని దగ్గరికి లాక్కుని వొళ్లు తెలియకుండా కొట్టాడు. "రేపట్నించి ఇంట్లోంచి కదులు! చెబుతా!" సాయంత్రం ఇంటికి రావటమే మానేస్తావా? నీకెంత కండకావరం?" అని అగ్గయి పోయినాడు. ఆమెని ఏమీ చెప్పనివ్వడు. వినడు.

అన్నిట్నీ మౌనంగా వెక్కుతూ భరించిందామె. ఆమె ఆశయమల్లా మంత్రమూర్తి దయ సంపాదించి, ఐదొందలూ తీసుకుని భర్తని రక్షించుకోవాలనే వుంది గనక, అందాకా ఎటువంటి అడ్డంకు లొచ్చినా, భర్త వినిపించుకోకపోయినా, కర్తవ్యం నెరవేర్చి తీరాలనే పట్టుదలతోటి, మెదలకుండా అన్నిట్నీ సహిస్తోంది. ఆవేళటికి భార్యా భర్తలిద్దరూ పస్తు పడుకున్నారు. చాలాసేపటి వరకూ ఇద్దరూ నిద్రపట్టక మసలుతూనే వున్నారు. తెల్లారుఝాముకి ప్రకృతి కనికరించి ఇద్దరికీ ఒక్క కునుకును ప్రసాదించింది.

## 37

మర్నాడు తెల్లవారింది. మామూలుగానే ఐదింటికి లేచింది పార్వతి. రాత్రి తిండి తినకపోవడంవల్లా; భర్తకొట్టిన దెబ్బలతోనూ, వీటన్నిటికీ మించి అతనన్న మాటలకీ ఆమె బహు నీరసించిపోయింది. లేవడమే తలనొప్పితోటి లేచింది. ఎండెక్కిన కొద్దీ, తలనొప్పి మరీ ఎక్కువైంది. ఐనా ఏ పనీ మానలేదు. ఓ గుక్క కాఫీ ఎక్కువగానే తాగింది. బజారుకు వెళ్లి కూరగాయలు తెచ్చి మూలుగుతూనే వంట ముగించింది.

"స్నానం చేద్దురుగాని...పీట వేస్తాను...కూర్చోండి," అంది భర్తతో.

"ఏమీ అక్కరలేదు. ఫో," అన్నాడు సాంబశివరావు. రాత్రి కోపం ఇంకా అలాగేవుంది.

పార్వతికి ఆఫీసు వేళయిపోతున్నదన్న దిగులు, భర్త వొద్దంటాడేమో—ఏం సమాధానంచెప్పి వెళ్ళటమా అని ఇంకో దిగులు. "నేనేం చెప్పాను చెప్పండి? మంత్రమూర్తిగారింట్లో వాళ్ళ అమ్మాయికి..." అని ఆమె అనబోతుంటేనే, సాంబశివరావు "నోరుముయ్యి. వెధవకబుర్లాడక," అన్నాడు.

"నీళ్లు పోసుకోండి. నాకు ఆఫీసువేళ అవుతోంది," అన్నది ఆ అబల.

"నువ్వు ఎక్కడికీ పోనక్కరలేదు. అట్లా పడివుండుచాలు," అన్నాడు సాంబశివరావు క్రోధంకోద్దీ. కాని, లోలోపల ఆలోచిస్తున్నాడు—జరుగుబాటు ఎలాగా అని.

"పనికి పోకపోతే ఎట్లాగండీ. ఇక ఎప్పుడూ ఆలస్యంగా రానుగా. రండి, నీళ్ళు చల్లారిపోతున్నాయి," అని దగ్గరకొచ్చి బతిమాలింది ఆమె.

సాంబశివరావు ఏమీ మాట్లాడకుండా, ఆమె సాయంతోటే పీటమీదకూర్చుని నీళ్లు పోసుకున్నాడు. ఆమెపెట్టిన అన్నంకూడా మామూలు ప్రకారం వంకలుపెడుతూ గొణుగుతూ తిన్నాడు.

ఆమె ఆఫీసు కెళ్ళగానే "తిరిగి ఇంటికివెళ్లమ్మా. నిన్నటి కంటే ఇవ్వాళ కాస్తనయం," అన్నాడు మంత్రమూర్తి. ఆమె "ఈశ్వరా!" అనుకుంటూ ఎదురుచెప్పలేక మంత్రమూర్తి ఇంటికి వెళ్లింది. ఆవేళ ఏది ఏమైనా ఐదుగంటలప్పుడు ఒకసారి భర్తని చూసి మళ్ళీరావాలనుకుంది.

అలాగే కారులో ఇంటికివచ్చి భర్తకి చెయ్యవల్సిన శుశ్రూష అంతా చేసింది. సాంబశివరావు ఈమధ్య భార్య నాలుగైదుసార్లుగా కార్లోరావడం చూస్తున్నాడు. కసి పెరిగిపోతూంది తనలో. 'ఎంత ఆడ టైపిస్టు అయితే మాత్రం, ఎంత పలుకుబడి లేకపోతే కార్లో పంపిస్తాడు యజమాని! మొంగ గుమస్తాల్ని ఇలా

ఎవరైనా చూస్తారా ఎక్కడైనా? సుబ్బారావు అన్నట్టు 'దీని' ఇన్‌ఫ్లుయెన్సు ఏమిటి?' సాంబశివరావుకి పిచ్చెక్కి పోతోంది. ఆమె తిరిగి వెళ్ళుతున్నప్పుడు "ఎంతసేపటికి కొస్తావు? గంటలో వచ్చేస్తావా?" అని అడిగాడు.

"వెంటనే వచ్చేస్తానండి ..." అని సెలవుతీసుకొని ఆ కారులోనే వెళ్ళిపోయింది. అక్కడ సుశీల "ఇంకా అక్కయ్య రాలేదేం?" అంటూంది వాళ్ళ నాన్నతోటి. "రావమ్మా ఇదే, మీటో వీళ్లు...నీకోసం తపించిపోతున్నారు!" అన్నాడు మంత్రమూర్తి.

డాక్టర్ ఇచ్చివెళ్లిన మందును పార్వతి ఇస్తే సుశీ—ఇష్టంలేక పోయినా తాగింది. వంటూమె ఎంత బతిమాలినా తాగలేదు. తండ్రి చెప్పినా వినలేదు. "అక్కయ్యరానీ," అనేసింది. ఆ ఇంట్లోవున్న వంటవాళ్ళూ, పనివాళ్ళూ అసూయ కూడా పడ్డారు—నిన్న వొచ్చిన ఈ అమ్మాయి కింత పలుకుబడి యేమిటా అని!

పార్వతి ఆవేళ ఎలాగైనా తన మనస్సులోని కోర్కెని యజమానితో బైటపెట్టాలని తపించిపోతోంది. మంత్రమూర్తి 6½ ప్రాంతంలో కూతురి మంచం దగ్గరికొచ్చి కూర్చుని, పార్వతితో "అమ్మాయినిచూస్తే వాళ్ల తల్లి జ్ఞాపకం వస్తుందినాకు. అంతా అచ్చంగా తల్లిపోలికే ఈ అమ్మాయి!" అన్నాడు దీర్ఘనిశ్వాసం విడిచి.

పార్వతి "అలాగా?" అంది. "జ్వరం బాగా తగ్గిందిలెండి. డాక్టర్ ఏమని చెప్పారు?" అని ప్రశ్నించింది, అమ్మాయి జుట్టు సవరిస్తూ.

"న్యూమోనియా అన్నారు డాక్టర్. నాకు యేమీ తోచటం లేదు. ఆఫీసులో కూర్చోలేక పోతున్నాను," అన్నాడు మంత్రమూర్తి.

పార్వతి తన కష్టాలు చెప్పడానికి ప్రయత్నిస్తున్నది. గొంతు సవరించుకొంటూంది. మెల్లగా "మావారికి..." అని ప్రారంభించింది. "ఏమిటి?" అని ప్రశ్నార్థకంగా నొసలు పైకెత్తాడు మంత్రమూర్తి.

"మావారికి..." అని ప్రారంభించి పార్వతి క్లుప్తంగా అన్నీ చెప్పి, "ఆ ఐదువందలూ మీరే ఇప్పించాలి...జీతంలో తగ్గించుకుందురు గాని... నెలకి కాస్త చొప్పున మినహాయించుకుందురుగాని," అన్నది.

"ఈ విషయం కైలాసంగారూ మొన్న చెప్పారు. ఈ నెలాఖరుకి ఆఫీసు లెక్కలు పూర్తవుతాయి. తర్వాత..." అనిమాత్రం అన్నాడు మంత్రమూర్తి, ఆమె జాలిగొల్పే మాటలకు కొంచెంకదిలి.

పార్వతి కళ్లల్లో ఆశా, సంతోషం ప్రజ్వలించాయి. ఒక్క అరగంట అయినతర్వాత ఆమె "మా వారికి ఇప్పుడు వెళ్లి అన్నం వండిపెట్టాలండి," అన్నది.

"సరే వెళ్లు. నీ వోపికకు నాకు ఆశ్చర్యం వేస్తూవుంటుంది!" అన్నాడు మంత్రమూర్తిమనస్ఫూర్తిగా. ఆమె సంతోషంతో బైలుదేరి ఇల్లు చేరుకుంది.

## 38

నాల్గురోజులపాటు సుశీకి జ్వరం తగ్గినట్టే తగ్గింది. కొద్దిగా దగ్గు మాత్రం ఉంది. రాత్రిళ్లు ట్యూషన్‌కి పార్వతి వచ్చినప్పుడల్లా ఆమెతో బాబు "కొత్తకథ చెప్పు," అని ప్రాణం తీసేస్తున్నాడు. పెద్దపిల్లలు ముగ్గురూ ఆమె రోజూ వారీగా కొద్ది కొద్దిగా సీరియల్‌గా చెబుతూవచ్చిన ఒక కాశీమజిలీ కథకోసం తగని ఆసక్తితో ఆమెను చుట్టు ముట్టేస్తూ ఉంటారు.

"అక్కయ్యా, మరి ఆ రాక్షసుడు చస్తాడా?" అని అడిగింది సుశీల.

"చస్తాడు లేవే. అప్పుడే చెప్పెయ్యకు అక్కయ్యా! కథ బాగుండదు," అని ఆజ్ఞాపించాడు పెద్దవాడు నరసింహారావు.

"రాజకుమారిని రాజకుమారుడు పెళ్లి చేసుకుంటాడా?" అని రెండో వాడి ప్రశ్న.

వీటన్నిటినీ విని, పార్వతి "ముందు మీరు పాఠాలు చదవండి. చివరికి కథ," అనేది. పిల్లలూ అందుకు ఆమోదించి చదువుతున్నారు; లెక్కలు వేస్తున్నారు. ఈ నాలుగు రోజులూ పార్వతి

వేళత ప్పకండా ఇంటికి పోతున్నది. ఒక శుక్రవారం ఆమె తలంటు కున్నది. అందువల్ల తలకి నూనె రాసుకోకుండానే వదులుగా జడ వేసుకుని ట్యూషన్ చెప్పడానికి వెళ్లింది. అదిన్నీకాక ఆఫీసునించి వచ్చి భర్తకు నీళ్ళుపోసి, వంటచేసి మళ్ళీ బయలుదేరేటప్పటికి వ్యవధి లేక గబగబ జడ అల్లుకుని వెళ్లింది. ఈ అత్యల్పమైన విషయాన్ని సుశీ కనిపెట్టింది. ఆవేళ ఆ పిల్లకి మళ్ళీ కొద్దిగా జ్వరం తగిలింది. మంచంమీద ముసుగెట్టి పడుకుంది. డాక్టర్ చలిగాలి ఏ మాత్రం తగలగూడదని చెప్పడంవల్ల, పిల్ల తలకి మఫ్లర్ గూడా కట్టు కుని, పడుకొని ఉంది. పార్వతి వెళ్ళగానే, ఆమెని తన దగ్గరే కూచుని కథ చెప్పమంటూ ఆసక్తిగా వింటూన్న సుశీ, "తల అట్టా లేగి వుందేం అక్కయ్యా! నూనె రాసుకోలా?" అంది.

"తలంటి పోసుకున్నానమ్మా. అందుకని," అంటూ కథ చెప్పుకుపోయింది పార్వతి. పెద్ద పెంగపిల్లలు కింద కూర్చుని వింటున్నారు; బాబు ఆమె వొడిలోనే కూర్చుని వింటున్నాడు. పార్వతి కథ చెప్పే పద్ధతి, పసిపిల్లల్ని సైతం గసానుభూతిలో ముంచెత్తేట్టుగా ఉంటుంది.

ఆమె కథ పూర్తి చేసేసింది. "రాజకుమారుడు ఏడు సము ద్రాలు దాటి ముత్యాలదీవి చేరుకుని అక్కడున్న అప్సరసలకు చిక్కి పోయాడు. వాళ్ల దగ్గరవున్న బంగారు పంజరంలోని చిలకను చేజిక్కించుకుంటేగాని రాక్షసుడు చావడు," అన్న దాకా చెప్పి కథ ఆపేసింది ఆమె.

"ఇంకా చెప్పు అక్కయ్యా," అన్నది సుశీ.

గోపాలకృష్ణ, నరసింహారావూ కూడా, "చెప్పు అక్కయ్యా," అన్నారు. పార్వతి "రాత్రల్లా చెప్పినా ఇంకా కథ ఉంటుంది. రేపు చెబుతాగా," అన్నది. మంత్రమూర్తి ఇంకా ఇంటికి రాలేదు. ఆయన వొచ్చాకగాని వెళ్ళడానికి వీలుకాదు గాబట్టి ఆమె తటపటాయిస్తోంది. గంట ఎనిమిదికి పావు తక్కువ. సుశీ "అక్కా, తలనొప్పిగా అక్కా... బాగోలేదు," అన్నది నొసలు చిట్లించి.

"ఇంటికెళ్లి జడ వేసుకుంటాలేమ్మా," అన్నదామె చిరు నవ్వుతో. తన మీద ఎంత అక్కర ఆ పిల్లకి! సుశీ "ఇక్కడే వేసుకో అక్కా, దువ్వెన తెమ్మన్నా ?" అంది.

ఇంతలోనే గోపాలకృష్ణ లోపలికి పరిగెత్తి నూనె, అద్దం దువ్వెనతో హాజరైయ్యాడు. "ఇదిగో అక్కయ్యా! జడ వేసుకో," అని అన్నాడు, అన్నీ చాపమీద పెట్టి.

ఆశ్చర్యపడింది పార్వతి. ఇప్పుడు జడ వేసుకోకపోతే ఈ అమాయకపు పిల్లలు వొదిలేటట్టులేరు. కుర్రాడు తెచ్చిన నూనె ఖరీదైన సువాసన తైలం. పార్వతి అదేమి గమనించకుండా గబగబ జడ వేసుకుంది. అద్దంలో మొహం చూసుకుంది. సంతృప్తి పడింది.

ఆమె జడ ముగించగానే సుశీ చప్పట్లు చరిచి "బాగుంది... ఇప్పుడు బాగుంది!" అన్నది. పది నిమిషాలకల్లా మంత్రమూర్తి వొచ్చాడు. ఆయన రావడంతోటే పార్వతి సెలవు తీసుకొని ఇంటికి బయల్దేరింది.

ఇంట్లో అడుగుపెడుతూనే సాంబశివరావు చూసిన చూపుకి కంగారు పడిందామె. 'వేళయినా మించలేదే...ఎందుకు ఆయన కీ కోపం?' అనుకుంటూ కాళ్ళు కడుక్కొచ్చి, భర్తకి అన్నం వడ్డించింది. ఆమె దగ్గరకు రావడంతోటి హేర్ ఆయిల్ యొక్క సువాసన గుప్‌మని భర్త నాసికలకు సోకింది. అదిన్నీగాక ఇప్పుడు పార్వతి వెనకటిలాగా ఉస్సూరుమని ఉండక, కొంచెం మిసమిసలాడుతూ వుండడంగూడా అతడు గమనించాడు. ఆమె విశాలమైన కళ్లల్లోని భయం తన సమక్షంలో, తనపట్ల ఏర్పడిందే అనుకోక. అర్థంచేసుకో లేక, ఆమెచేస్తూన్న (ఏదో ?) తప్పులవల్లనే తననుచూసి అలా భయ పడి పోతున్నదని అతని ఊహ.

"ఏమిటీ గుబాళింపు? నువ్విక్కడనించి వెళ్లేటప్పుడు ఏమీ లేదు! ఎమిటీభడవా ?" అంటూ అతను లాగి, ఆమె గింగురాలు తిరిగిపోయి, వెనక్కి పడిపోయ్యేంత దెబ్బకొట్టాడు ఆమె నున్నటి చెంపమీద. పార్వతి కళ్లముందు మెరుపులు మెరిశాయ్. భోరుమని ఏడ్చేసిందామె. తర్వాత మెల్లగా, "తల మరీ రేగి

మొహాన పడుతూంటే మంత్రమూర్తిగారింట్లో జడవేసు......" అగి పోయిందామె, భర్త గర్జనతోటి. "నేనూ అదే అనుకున్నానులేవే!" అన్నాడు.

పార్వతికి, కొంచెంసేపు ఏమిటో అర్థంకాలేదుగాని, తర్వాత భర్త ఏదో అనుమానపడుతున్నాడని ఊహించుకుంది. ఏంచెప్పినా వినిపించుకోడని తెలుసుగాబట్టి 'మౌనం కలహం నాస్తి,' అని ఊరు కుంది ఆవేళటికి.

## 39

ఉగాదికి ముందు రోజు పార్వతి బజారుకువెళ్లి అన్ని సామాన్లూ—పండగకు అవసరమైయ్యేవి కొనుక్కొచ్చింది. పది రూపాయలు మిగిల్చి, భర్తకి పంచ, చొక్కాయి తెచ్చింది. అన్నీ ఆయనకి చూపించింది. "చొక్కాగుడ్డ ఇంకా మంచిది కొనక పోయావూ?" అన్నాడతను. "అయినా... డబ్బులుచాలవో అంటూ, వీటికి డబ్బు ఎక్కడిది?" అని గదమాయించాడు కూడా.

పార్వతి లెక్కలు చెప్పింది, "కాళిదాసుగారిచ్చిన పాతిక రెండునెల్లనించి ఆయన కివ్వనేలేదుగా? ఈ నెల ఇద్దామని వెళ్తే, 'అఖ్ఖర్లేదు పోవమ్మా,' అన్నారాయన. ఆ డబ్బు మిగిలింది. దాంట్లోనే అన్నీ తెచ్చానండి. నాకు వేరే డబ్బెక్కడిది?" అన్నది.

సాంబశివరావుకి ఈ డబ్బు సంగతి తెలుసు కనక ఊరు కున్నాడు.

ఆవేళ ఆఫీసుకెళ్లి కూర్చోగానే కైలాసం ఆమె దగ్గిర కొచ్చి "అయ్యవారు, నువ్వు రాగానే ఇంటికి పంపించమన్నారమ్మా. అమ్మాయికి రాత్రినించి జ్వరం మరీ ఎక్కువైందట మళ్లీ. అయ్య వారు ఇంటినించి కదలాలంటే నువ్వు వెళ్ళాలి. కారు ఇక్కడే ఉంది. వెళ్లమ్మా," అన్నాడు.

ఈ సంభాషణంతా వింటున్న సుబ్బారావుకి, తాననుకుంటు న్నట్టు ఆమెని తీసెయ్యడం కుదరలేదు సరిగదా, ఆమెకి పలుకుబడి మరీ ఎక్కువైపోతున్నందుకు అతనికి కడుపు రగులుకు పోతున్నది.

ఆమె లేనప్పుడల్లా పైపు పని అతనే చెయ్యవల్సి వస్తుందడం మరొక కారణం. కాని, ఏ ఉద్దేశాన్ని బైటపెట్టలేక అల్లాడిపోతున్నా డతను.

పార్వతి తలవంచుకుని మేడమెట్లుదిగి కారులో కూర్చుంది.

కారు మంత్రమూర్తి బంగళా ముందు ఆగింది. పార్వతి కంగారుగా లోపలి కెళ్లింది. మంత్రమూర్తి కూతురి మంచంమీదనే కూర్చున్నాడు. ఆమె లోపలి కెళ్ళగానే బాబు ఎదురొచ్చి కౌగి లించుకున్నాడు. ఆమె కుర్రాణ్ణి ఎత్తుకుని మంచం దగ్గిరకి వెళ్లింది.

హాలంతా అతి నిశ్శబ్దంగా ఉంది. పనివాళ్ళూ, వంటవాళ్లూ ఎవరి పని వాళ్లు చేసుకుంటున్నారు గాబోలు. మంత్రమూర్తి "మీ ఇంటికే కబురుచేద్దామనుకున్నానమ్మా. మళ్ళీ ఆఫీసుకొస్తావు గదా అని ఊరుకున్నాను. ఇదిగో...అమ్మాయి నీ కోసమే కలవ రిస్తోంది. నన్నూ కదలనివ్వటం లేదు. నాకు ఆఫీసులో ఈ నెలల్లా తలమునిగే పని. నువ్విక్కడవుంటే నే నొక్కసారి ఆఫీసుకి వెళ్ళొస్తాను," అన్నాడు. ఎప్పుడూ గంభీరంగా ఆజ్ఞాపించే ఆయన స్వరం తగ్గిపోయి దిగులుగా, విరక్తిగా మారిపోయినట్లుంది.

"అలాగే వెళ్లిరండి. అమ్మాయి దగ్గర నేనుంటానుగా," అంటూ పార్వతి అమ్మాయిదగ్గరగానే కూర్చుంది. సుశీలకు జ్వరం తీవ్రంగానే వుంది. కఫం గొంతులో గరగరలాడుతూ ఊపిరాడక బాధపడుతోందాపిల్ల. గంట గంటకీ డాక్టర్ వొచ్చి చూసి వెళ్తు న్నాడు. ఇంజక్షనులు ఇస్తున్నాడు. కఫం కరిగి, శ్వాస సరిగ్గా ఆడడానికి ఏదో ప్లాస్టర్ గూడా రొమ్ములమీద వేశాడు.

దగ్గి దగ్గి మొహంఅంతా ఎర్రబారి, చమటపట్టి, కళ్ళు తెరిచిచూసింది సుశీల. "అక్కయ్యా," అంది మూల్గుతూ.

"నే నిక్కడే వున్నానమ్మా. మాట్లాడకుండా పడుకో," అంది పార్వతి, ఆ అమ్మాయి తల నిమురుతూ. ఆవేళకూడా, రాత్రి 8 గంటలదాకా అలాగే అక్కడే గడియారపు ప్రతి టిక్కుకూ ఉలక్కిపడుతూ ఆమె కూర్చునే వుంది. మధ్యాన్నం కాఫీ, టిఫన్ లిచ్చారక్కడే. ఈలోగా మూడుసార్లు వచ్చివెళ్లాడు మంత్రమూర్తి. చివరికి రాత్రి షుమారు 8½ గంటలప్పుడు "వెళ్తానండి," అన్నది

పార్వతి నిదానంగాలేస్తూ. మంత్రమూర్తి ఆమె స్థానంలో కూర్చుంటూ, ఆమెస్థితిని కొంత ఊహించుకుంటూ "వెళ్లిరా అమ్మా," అన్నాడు కృతజ్ఞతతోటి.

పార్వతి ఇంటికి వెళ్లింది కారులోనే. సాంబశివరావు ఆవేళ కూడా తీవ్రంగా ఘర్షణపడ్డాడు ఆమెతోటి. "దీపమన్నా పెట్టే దిక్కు లేని కొంపలో—చీకట్లో దెయ్యంలా కుర్చున్నానే భడవా! నీకు నా ధ్యాసకంటే మంత్రమూర్తి ధ్యాస ఎక్కువైందే!" అని గోల పెట్టాడు.

పార్వతి యథాప్రకారమే మౌనంగా వుండిపోయేసరికి తగాదా పెరగలేదు. ఆమె దృష్టి యావత్తూ, నెలాఖరుకి మంత్ర మూర్తి ఇవ్వగలరనుకుంటున్న డబ్బుమీదవుంది. దంపతులు ఒకరితో ఒకరు మాట్లాడకుండానే ఆ రాత్రంతా గడిపేశారు.

తెల్లారి ఉగాది. ఆఫీసులేదు. పార్వతి మామూలుకంటే ఎక్కువ ఉషారుగా పనులు చేసుకుంటోంది. పట్నమంతటా పండగ ఉత్సాహం వెల్లివిరిసి కన్పిస్తోంది. సాంబశివరావు 'వొద్దు' పాట పాడుతూనే, విసుక్కుంటూ స్నానంచేసి కొత్తగుడ్డలు కట్టు కున్నాడు. పార్వతి, త్వరగా వంటచేసింది. పదకొండు గంటల కల్లా భోజనాలుకూడా ఐపోయాయి. తనకి కొత్తగుడ్డలు లేవన్న చింతకూడా లేదామెకి. పండగపూట భర్తచేత చీవాట్లు తినకుండా వెళ్లితే అదే పదివేలు అనుకుంటోంది. భోజనాలయ్యాక భర్త దగ్గరగా కూర్చుని తమలపాకులుచుట్టి అతనికిచ్చి, తనూ వేసుకుం టోంది.

ఉతికినగుడ్డలు కట్టుకున్నా అందంగా కన్పిస్తోంది ఆమె సాంబశివరావు కళ్లకు. ఆమె ఆకర్షణీయంగా కన్పించడం అతను సహించలేడు. తెల్ల రవిక వేసుకుని, చిలకపచ్చరంగు వాయిల్ చీర కట్టుకుంది. చిన్న మల్లెపూలబంతి ఆమె నల్లని కేశాల్లో నక్షత్రాల్లా మెరిసి పోతున్నాయి. వసంతాగమనంలో ప్రకృతిలాగా ఆమె ప్రతి అవయవమూ పొందికగా, అందంగావుంది; ఆహ్లాదం గొల్పుతున్నాయి. సాంబశివరావు, "నేను కాసేపు పడుకుంటాను," అని పడుకో బోయాడు ఆమెని చూడలేక.

ఇంతలోనే మంత్రమూర్తి కారువచ్చి ఇంటిముందు ఆగింది. డ్రయివర్ కంగారుగా లోపలికివచ్చి "అమ్మగారూ, తొందరగా రండి. అయ్యవారు వెంటనే మిమ్మల్ని ఉన్నపళంగా తీసుకు రమ్మన్నారు!" అన్నాడు. పార్వతికి ఏమీ తోచలేదు. భర్తతో చెబుదామనికూడా తోచలేదు. సుశీకి ఎలావుందో అనుకుంటూ వెళ్లి కారులో కూలబడింది. కారు వెళ్లిపోయింది.

ఆమె వెళ్లిపోయినతర్వాత కోపంతో వొణికిపోయాడు సాంబశివరావు. 'ఎంత నిర్లక్ష్యం దీనికి! తనతో చెప్పడమే మానేసింది. పండగనాడు కలవగడా...తనతో మాట్లాడుతూ కూర్చోడం కూడా దానికి నామర్దా ఐపోయింది. వాడు కబురుచెయ్యగానే గభాల్న లేచి పారిపోతుందా? ఇవ్వాళ అటో ఇటో తేల్చెయ్యాలి. తాను ఎంత అశక్తుడైనా పౌరుషం చచ్చి ఊరుకోలేదు...కాలం బాగుండలేక ఇలా పడివుంటేమాత్రం ఇంత స్వేచ్ఛా?'

సాంబశివరావు నిద్రపోతానన్నవాడు మేల్కొని ఉద్రేకంతో ఆలోచించుకోసాగాడు. ఇప్పటివరకూ జరిగినదంతా సమీక్షించుకుంటున్నాడు.

'ఆవేళ ఒకనాడు జుట్టు చెరిగి, బొట్టుచెరిగి వచ్చింది...ఇంకోనాడు సువాసనతైలం రాసుకుని వచ్చింది... మొదట్లో వేళకువచ్చేది... రానురాను దాని ఇష్టం వొచ్చినట్టు రాసాగింది...ట్యూషన్ వంక పెట్టుకుని అర్ధరాత్రి దాకా అక్కడే వుండి వస్తున్నది...' బిందువు మాత్రంగా వుండిన ఈర్ష్య కొండంతయి అతని హృదయాన్ని తొలుస్తున్నది.

ఇలా అన్నిటినీ తన కనుకూలంగా ఆలోచించుకుంటూ పార్వతి 'కులట' అనే నిర్ణయించుకున్నాడతను. 'ఎంతకాలం మోసం చెయ్యగలదు? ఇవ్వాళ రానీ...ఇవ్వాళటితో ఏదో తేలిపోవాలి.' అతను ఇలా అగ్గిబుగ్గయిపోతూ మంచంమీద కూర్చుని చుట్టూ చూస్తున్నాడు. ఈ ఆలోచనలతోటి అతని దేహంమీద చమట ధారకడ్తున్నది.

పార్వతి మంత్రమూర్తి ఇంట్లో కెళ్లేటప్పటికే సుశీ జ్వర తీవ్రతతోటి పెద్దగా కలవరిస్తోంది. డాక్టరు, కైలాసము, మంత్రమూర్తి అక్కడే ఉన్నారు. ఆమె సరాసరి మంచం దగ్గరకెళ్లి పసి

దాని పక్కనే కూర్చుని "ఇదిగోనమ్మా వచ్చాను...చూడు," అంది. సుశీ మెల్లగా కళ్ళుతెరిచి చూసింది. పదినిమిషాలకల్లా అర్థమైంది వచ్చింది పార్వతేనని. "అక్కయ్యా, ఎక్కడికెళ్లావు? కథ చెప్పవూ?" అంది నీరసంగా.

"చెబుతానమ్మా," అంది పార్వతి. "ఆ రాజకుమారుడు... బంగారు పంజరంలో..." అని కథ ప్రారంభించింది. సుశీ అంత జ్వరం లోనూ ఆసక్తిగా వింటోంది, మాగన్నుగా చూస్తూ.

డాక్టరు, మంత్రిమూర్తి, కైలాసం అక్కణ్ణించి లేచి వరండా కుర్చీల్లో కూర్చున్నారు మాట్లాడ్డానికి. మంత్రమూర్తి కైలాసంతో "ఆ కొత్త చీర ఆమెకివ్వండి. పండగపూట కట్టుకుంటుంది. కట్టుకుని కూర్చోమనండి," అన్నాడు.

వాళ్ల ఆఫీసులో పనిచేసే గుమాస్తాలందరికీ, ఇంట్లో పనివారికీ, వంటవారికీ, అందరికీ ప్రతి ఉగాది పండగకూ కొత్త బట్టలివ్వడం మామూలు. అలాగే ఈ ఏడూ అందరికీ బట్టలు పెట్టారు. గుమాస్తాలు ఉదయమే వచ్చి తీసికెళ్లారు.

కైలాసం లోపలికెళ్లి కొత్తచీర, రవికగుడ్డ తెచ్చి పార్వతి కిస్తూ "నీకు మొన్ననే చెప్పానుగదూ—పండగకి చీర పెడతామని? లేచి లోపలికెళ్లి కట్టుకురా అమ్మా! వెళ్లు. అందాకా నేను ఇక్కడ నిల్చుంటాను. వెళ్ళు," అన్నాడు వాత్సల్యంతోటి.

పార్వతి చీరవంక చూసింది. అరచేతి వెడల్పు జరీ అంచుగల నూరో నెంబర్ కనకాంబరం రంగుచీర అది. అదేరంగు రవికగుడ్డ. కళ్ళు చెదరగొట్టే పెద్ద జరీగల పమిట అంచు. పాతిక రూపాయ లుంటుంది. "చాలా ఖరీదే నే!" అన్నది. "ఇంటికెళ్లి కట్టుకుంటా లెండి," అనికూడా అన్నది.

"ఇక్కడే కట్టుకోవమ్మా...అయ్యవారు చెప్పారు," అన్నాడు కైలాసం.

పార్వతి ఇక నిరాకరిస్తే బాగుండదని లోపలికెళ్లి చీర కట్టు కొని వచ్చింది చప్పున. సుశీల "కథ చెప్పు అక్కయ్యా..." అని గొణుగుతోంది.

పార్వతి మళ్లీ కథ ఆరంభించింది. కొత్తచీర ధగధగల్లో ఆమె లక్ష్మిలా వుంది.

బైట డాక్టర్ "నేను చెప్పలేదండి? పిల్లల సైకాలజీ తెలిసి ట్రీట్‌మెంట్ చెయ్యాలి. మందులే పని చెయ్యవు. వాళ్లకి ఇష్టమైన వాళ్లని అంటిపెట్టుకుంటారు పిల్లలు. సగం జబ్బు దాంతోటి తగ్గుతుంది. ఆమె ఎవరేమిటి?" అన్నాడు.

"మా ఆఫీసు టైపిస్టు. సాయంత్రాల్లో పిల్లలకి ట్యూషను చెబుతుంది. అదీ పరిచయం వాళ్లకి. ఏమిటో ఇట్టే అతుక్కుపోయారు పిల్లలు ఆమెతోటి," అన్నాడు మంత్రమూర్తి.

పార్వతిని సుశీ గట్టిగా కౌగలించుకుని పడుకుంది. తల తొడమీద పెట్టుకుంది కాసేపు. పార్వతికూడా కన్నతల్లిలాగా ఆ అమ్మాయిని ప్రేమగా తన గుండెకి హత్తుకుని "నీకేం భయంలేదమ్మా ... నేనున్నానుగా," అంది. అక్కయ్య తన దగ్గర వున్నందుకు సుశీకి బ్రహ్మాండమైన ధైర్యం. జ్వరం అంటేనే భయం ఆ అమ్మాయికి. లేనిపోని ఖంగారంతా పెట్టేస్తుంది ఇంట్లిపాదినీ.

గోడ గడియారం సంగీతస్వరాలతో ప్రతిగంటా గడిచిపోవటాన్ని తెలియజేస్తోంది. సాయంత్రం మూడింటికి పార్వతి మంచం మీద అలా ఆ అమ్మాయిని తొడమీద పడుకోపెట్టుకుని కూర్చునే కాఫీ తాగింది. అమ్మాయికి జ్వరం ఏమీ తగ్గలేదు. ఇంజెక్షనులూ, మందులూ గంట గంటకీ ఇస్తూనే వున్నారు.

భర్తకు ఎవరితోటయినా కబురుచేద్దామా అని సాయంత్రం ఐదు గంటలకు ఒకసారి అనుకొంది పార్వతి. కాని, మళ్ళీ జంకింది. 'ఆ పంపించే మనిషిని భర్త నానామాటలూ అంటే వీళ్లేమనుకుంటారో! బాగుంటుందా?' అనిపించి, ఆ ప్రయత్నం విరమించిందామె.

ఏడుగంటల దగ్గరనించీ ఆమెకి భయం ఆరంభించింది. ఇటు చూస్తే ఈ పిల్ల తనను కావలించుకుని వొదలడంలేదు. తను వొదిలించుకుపోగలదు. అదెంత పని? మంత్రమూర్తి 'పో! పర్వాలేదు,' అనేస్తాడు నిక్కచ్చిగా. తర్వాత తనకి కావల్సిన పనులెలా నెరవేరయితాయి? ఇంకెవరున్నారు తనకి? దిక్కులేని తనకి దారి

కిన ఈ ఆశ్రయాన్ని తాను జాగ్రత్తగా కాపాడుకోడం తన విధి. తనకైనా బుద్ధిపూర్వకంగా చూస్తే—ఇట్లా జ్వరవేగంతోటి పూర్తిగా స్పృహలేకుండా పడివున్న ఈ పసిదాన్ని ఎలా వదిలిపోవడమూ అనిపిస్తుంది. చిన్నగా నవ్వితే ఎర్రబారే ఆ చిట్టి బుగ్గలూ, లేత గులాబీరంగు పెదాలూ, అలలు అలలుగావుండే నిగనిగలాడే నల్లటి జడా పార్వతి మనస్సుని కరుణామయం చేసి వేస్తున్నాయి.

గోడ గడియారం తొమ్మిది కొట్టింది. మంత్రమూర్తి "భోం చేస్తావా అమ్మా?" అని అడిగాడు పార్వతిని. ఆయన వొచ్చి కూర్చున్నాడు రెండోవైపు. ఇంటికి వెళ్దామని లేవబోయింది పార్వతి. సుశీ కదిలి, "వెళ్తున్నావా అక్కయ్యా?" అని నసిగి ఏడ్పు ప్రారంభించింది. పార్వతి మళ్ళీ కూర్చోవాల్సొచ్చింది. మంత్రమూర్తి ఒక దీర్ఘ నిశ్వాసవిడిచి, లోపలికి వెళ్లి పార్వతికి కాఫీ పంపించాడు.

ఆ కాఫీ తాగుతూ పార్వతి భర్త గురించి ఆలోచించింది. కాఫీ రుచించలేదు. అన్నీ అయోమయంగా తోచసాగాయి ఆమెకి. ఈలోగా మాధవరావు వొచ్చాడు అమ్మాయిని చూద్దామని. చూసి వెళ్లాక, మంత్రమూర్తితో మాట్లాడుతూ కూర్చున్నాడు.

పది గంటలకి డాక్టర్ సుశీకి ఇంజెక్షన్ ఇచ్చి వెళ్తూ, "ఇంకో పదినిమిషాల్లో అమ్మాయికి నిద్రపట్టవచ్చు. అయినా దగ్గిరే వుండండి," అని చెప్పి వెళ్ళాడు.

పార్వతి అమ్మాయి గనక నిద్రపోతే ఇప్పటికైనా బయల్దేర వచ్చు అనుకుంటూంది. భర్తతో ఇవ్వాళ సంఘర్షణ తప్పదు అనుకుంటున్నది. వేసవి కావడంవల్లనో, భయంవల్లనో ఆమె మొహ మంతా ముత్యాల్లా చమట పట్టింది.

ఇంటి దగ్గిర సాంబశివరావు చీకట్లో ఎలా వున్నాడో అని ఆమెకి ఒకటే దిగులు. అక్కడ సాంబశివరావు సాయంత్రందాకా ఆలో చించాడు, ఆలోచించాడు. అన్నీ ప్రశ్నలే కావడమూ, సమా ధానాలు లేకపోవడంతోటి మరీ రెచ్చిపోయినాడు. సాయం కాలం ఆరు గంటలనించి—ఆరు గంటల్నించే కాదు, ఆమె ఇంటిదగ్గిరనించి వెళ్లినప్పట్నించీ ప్రతినిమిషమూ ఆమె రాక కోసం ఎదురుచూస్తున్నాడు. ప్రతి నిమిషమూ నిరాశ చెందు

తున్నాడు. మధ్యాహ్నం ఐంది; రాత్రి ఐంది. చీకటి. సాంబశివ రావు మెల్లగా కిందికి దిగి, దేకుతూ వంటింటి గూట్లోవున్న దీపం వెలిగించాడు. ఇదివరకెప్పుడూ చేసి ఉన్నవాడు కాదు. కానీ ఇవ్వాళ అవసరమైంది. అతనిలో మండుతున్న అనుమానం, ద్వేషం అలవిగాని పన్లు చేయిస్తున్నాయ్. ప్రతి నిమిషమూ ఆమె స్ఫురణే. వచ్చి ఆమె మంచినీళ్లు ఇస్తుందని ఇందాకణ్ణించీ అనుకున్నాడు. దప్పి ఎక్కువౌతోంది...దీపం కిందపెట్టి పక్కనే బిందెలో వున్న నీళ్ళు ఓ గ్లాసు తాగాడు; ఇంకో గ్లాసు తాగాడు. దప్పిక అయితే తగ్గింది గాని—ఆవేశం తగ్గలేదు...'మొగుడంటే పూచికపుల్ల ఖరీదు లేదు దాని దృష్టిలో...ఆరు నెలలూ ఏడు నెలలూ ఎవతె వుండగలదు చచ్చు మొగుడుతోటి?' అనిపించింది ఒక పక్క...'ఆమె వాంఛల్ని—ఇప్పుడు తన ఆటంకమేమీ లేదు గనక స్వేచ్ఛగా తీర్చుకుంటోంది... లేకపోతే అంత మిఎమిస ఎక్కణ్ణించి వొచ్చింది దాని మొహంలో? భలే నాటకం ఆడుతోంది. ఇన్ని మెతుకులు తన మొహాన వేసి, మొరిగే కుక్కకు బొమిక పారేసినట్టు—తన సౌఖ్యం తాను అనుభవిస్తోంది...ఇవ్వాళ అటో ఇటో తేల్చుకోవాలి...' అనుకుంటూ ఇంకా ఆమె రానందుకు అనుక్షణం పెరిగిపోతూన్న కోపం తోటి చుట్టూ చూశాడు. సాంబశివరావుకు వంటఇంటి గోటిపక్కనే గోకలిబండ కనపడింది. సాంబశివరావు రెండుగజాలు దేకి, దాన్ని చేత్తో తీసుకుని, 'ఇవ్వాళ దానికిబడిత పూజచేసి, నిజం దాని నోటంబడినే కక్కించాలి. ఇన్నాళ్లనుంచీ, చేత్తో చచ్చు దెబ్బలు కొడ్తావుంటే దానికేమి తగిలినట్టే లేదు...' అనుకున్నాడు. అతని కళ్లు అక్కడ వెలుగుతూన్న బెడ్ రూమ్ లైటు కాంతిలో తాగుబోతువాడి కళ్లలాగా మసకబారి ఎర్రగా మెరుస్తున్నాయి. నీరసించిన అతడి అవయవాలలో అసాధారణమైన ఒక ఉద్రేకం ప్రవహిస్తోంది. అతడు సరాసరి దేక్కుంటూ వచ్చి, మంచం ఎక్కి కూర్చున్నాడు. గోకలిబండ చేత్తో పుచ్చుకుని, 'మంత్రమూర్తిని చూసుకుని తనను నిర్లక్ష్యం చేస్తుందా,' అనే ఒక్కటే బాధ అతడి మెదడులో తిరుగుతూ, అతడికి ఊపిరాడనివ్వడం లేదు. ఈ ఆలోచనలతో అతడికి రక్త ప్రసారం ఎక్కువై ఆయాసం కూడా వచ్చింది; రొప్పుతున్నాడు.

నొళ్ళంతా చెమట పట్టింది. దీనికి తోడు ఆకలి బాధ కూడాను. ఉదయం పదకొండు గంటల్నించీ ఏమీ తినలేదు. అతనికి తిందామని లేదుకూడా. ఐనా అతని పట్టదలలమధ్య, ఆవేశాలకు ధూపం వేస్తున్నట్టు జఠరాగ్ని కూడా రగుల్కొని మండుతోంది.

పదిన్నర ఐంది...జనసందడి పూర్తిగా తగ్గినట్టేవుంది పట్నంలో. పక్కనే కాళిదాసు ఇంటినించి రేడియోలో ఏవేవో పాటలు కొంతసేపు అస్పష్టంగానూ, కొంతసేపు స్పష్టంగానూ వినవస్తున్నాయి.

'ఇంకా రాదేం అది ? మంత్రమూర్తి కౌగిట్లో హాయిగా...' అని ఊహిస్తూ, ఆ అశక్తత భగ్గ నొణికిపోతున్నాడు జెలసీతోటి.

అక్కడ పార్వతి పదిన్నరకు అమ్మాయి కాస్త మగత నిద్రలో పడగానే, మంత్రమూర్తితోటి "వెళ్ళొస్తానండి. మా వారికి అన్నం అదీ పెట్టాలి. మళ్ళీ కావాలంటే...వస్తా," అన్నది నమ్రతగా.

మంత్రమూర్తి "సరే వెళ్ళు. నీతోటి అంత అవసరం గాదనుకుంటాను. అమ్మాయి నిద్రపోయిందిగా," అంటూ "కారులో డాక్టర్ గారు వెళ్ళారు. రిక్షామీద వెళ్ళు," అని ఒకరూపాయి ఆమెకిచ్చాడాయన.

పార్వతి గబగబ బయల్దేరింది. హాల్లో గడియారం అరగంట కొట్టింది. అలవాటు ప్రకారం ఆమె 'శుభ శకునమే,' అనుకుంటూ ఆ ఇంటినించి పదిగజాలు నడిచి, ఒక రిక్షా చేసుకుని ఇంటికి బైలు దేరింది. ఆమెకి గుండెదడ తిరిగి ప్రారంభమైంది. ఏది ఏమైనా ఇప్పుడు చేసేదేమీలేదు...ఎలాగో ఒకలాగా సమాధానం చెప్పకోవాలనుకుంటూ, రిక్షావాడితో "చిల్లర ఉందా ?" అన్నది. "ఉందండి అమ్మగారూ," అన్నాడతను. "అయితే ఇవ్వు...ఇదిగో రూపాయి, పావలా పోనూ ముప్పావలా ఇవ్వు," అన్నది. రిక్షావాడు తన బాడిగ తీసుకుని ,తొందర తొందరగా బండిని పోనిస్తున్నాడు. బండి ఎంత తొందరగా పోనిస్తున్నా ఆమె మనోవేగం ముందు అది తాబేటి నడక అనిపిస్తోంది.

పదిహేను నిమిషాల్లో రిక్షా ఆమె ఇంటిముందు ఆగింది. ఆమె బండి దిగింది. చుట్టూ చీకటి. బండి వెళ్ళిపోయింది. ఇంట్లోకి

చూసింది. దీపం వెలుగుతోంది. 'ఎవరు వెలిగించారబ్బా!' అని ఆశ్చర్యపడుతూ ఆమె లోపలికి అడుగుపెట్టింది. మంచంమీద కూర్చుని వున్న, సాంబశివరావు ఆమెని గడపమీద వుండగానే చూశాడు. కొత్త కనకాంబరం రంగుచీర ... రేగిపోయిన జుట్టు... మధ్యాహ్నం నించీ అమ్మాయి దగ్గరే కూర్చోడంవల్ల కొంచెంవాడిపోయిన మొహం. ఆమెని చూడగానే సాంబశివరావు కోపం ఉచ్ఛదశలో కెళ్ళింది. "వచ్చావూ? మొగుడూ ఇల్లూ జ్ఞాపకం వచ్చాయా?" అని అరుస్తూ మెల్లగా తడబడుతూ లేచి నిలబడ్డాడు. కాలు నరాలు చచ్చుబడి బాధ అనిపించడంలేదు. "బజారీ లంజా! ఇంత మోసమా?" అని తన ఎదుట భయంతోటి నోట మాటరాక నిలబడివున్న పార్వతి వంక ఉరిమి చూశాడు ఒక క్షణం. "నీకు మాటలతో బుద్ధిరాదు," అని తన చేతిలోని రోకలిబండను పైకెత్తి—ఆమె తప్పుకోవాలని ఆలోచించి దాన్ని ఆచరణలో పెట్టేముందే, చాలా బలంగా ఆమె నెత్తిపై కొట్టేశాడు. తిరిగి కొట్టాడు. రెండవ దెబ్బతో పార్వతి బోర్లా పడిపోయింది. కపాలం పగిలి మెదడు బైటికివచ్చేసింది తెల్లగా. ఆమె తలచుట్టూ నెత్తురు మడుగు. ఆమె పడిపోయే క్షణంలో మెల్లగా 'అమ్మా' అని కేక వేసింది... అంతే. ఆమెలో వెలుగుతున్న జీవశక్తి ఆరిపోయింది.

పక్క ఇంటిలోంచి అస్పష్టంగా...

'ఏది జీవితం?

ఏది మృత్యువు?

ఓ మహాత్మా-ఓ మహర్షీ!'

అనే పాట విన్పిస్తోంది. సాంబశివరావు ఉద్రేకంతోటి వొణికిపోతూ కూర్చోలేక గోడ నాధారంగా పట్టుకుని నిల్చున్నాడు. అతని చేతి లోని రోకలిబండ రక్తంతోటి తడిసి ఆమె పక్కనే పడివుంది. 'భడవా! ముండా దీనికి కావాల్సిందే!' అని తనను తాను సమర్థించు కుంటూ ఆమెవైపు ఇంకా దహిస్తున్నట్టే చూస్తున్నాడతను. చుట్టూ ఆవరించిన అమావాస్య చీకటిలాగే అతని అంతర్యంకూడా జెలసీ తోటి చీకటిగానే ఉంది. బైటిచీకటికన్నా దట్టమైన అజ్ఞానపు చీకటి

అని. దేన్నీ తెలుసుకోడానికి వీల్లేని దట్టమైన చీకటి ఆవరించుకుని ఉందతని మలినమైన మనస్సును.

అక్కడ పార్వతి బయల్దేరిన ఐదునిమిషాలకే మళ్లీ తిరిగీ మగత నించి మేల్కొని, "ఏది అక్కయ్యా? అక్కయ్యా!" అని గోల ప్రారంభించింది. తిరిగి ఊపిరాడని దగ్గువచ్చింది. మంత్రమూర్తి కంగారై పోయాడు. "ఆమెని తీసుకుగావాలండి మాధవరావుగారూ... ఎలాగా?" అన్నాడు. ఆయన పక్కనే వున్న మాధవరావు, "డాక్టర్‌కి ఫోన్ చేసి ఆయనగాగానే మనమే వెళ్లి తీసుకొద్దాం. ఈ స్థితిలో మీరు పోతేగాని ఆమెగాదని నా ఊహ," అన్నాడు.

అలాగే డాక్టర్‌కి ఫోన్ చేశారు. పది నిమిషాలకల్లా డాక్టర్ వచ్చాడు. "మేంవెళ్లి ఆవిడని తీసుకొస్తాం ఐదునిమిషాల్లో. మీరు అమ్మాయిని చూస్తూవుండండి," అనేసి మాధవరావూ, మంత్రమూర్తీ బయల్దేగారు.

కారు స్టార్ట్ కాగానే మాధవరావు, "ఏమండీ, నేనొక్క మాట అడుగుతాను, కోపం లేకుండా సమాధానం చెబుతారూ?" అన్నాడు మంత్రమూర్తితోటి.

"కోపం దేనికీ... అడగవయ్యా," అన్నాడు మంత్రమూర్తి ఆయన ధ్యాసంతా కూతురు మీద వుంది.

"మీ కూతురు ప్రాణమంటే మీకు ఇంత ఆదుర్దాగా వుందే! పార్వతి తన భర్త ప్రాణం కోసం అంత ఆదుర్దాపడదుటండీ? ఆమె ఘోషంతా కైలాసం నాకు చెప్పాడిందాక. ఆమె అడిగిన పైకం ఆమెకిచ్చాగామీరు? ఆమె మీ కూతురికోసం ఎంత శ్రమపడుతూందో గమనించారా? 'ఇస్తాలే... చూద్దాంలే!' అంటున్నారట. ఎవరి స్వార్థం వాళ్లదని ఊరికే అన్నారా! నా మాటవిని ఆమెకాడబ్బు ఇయ్యండి. మీకేం మునిగిపోతుంది ఇంతలో?" అన్నాడు మాధవరావు, కారుని బాగా వేగంగా పోనిస్తూ. కొట్లూ, ఇళ్లూ చాలా వేగంగా వెనక్కిపోతున్నాయి. నిర్మానుష్యమైన వీధులగుండా కారు పరుగెత్తోంది.

మంత్రమూర్తి "ఊరుకోవయ్యా! నేనివ్వననలేదే. ఆమె మా. కుటుంబానికి ఇప్పుడు అత్యవసరమైన వ్యక్తి ఐంది. రేపో మాపో

మనమే ఎంత ఖర్చయినాసరే, ఆమె భర్తని మద్రాసు తీసుకెళ్లి కాలు నయంచేయిద్దాం. అంతేనా ?" అన్నాడాయన ఉద్రేకంతో.

"అంతే," అన్నాడు మాధవరావు.

కారు ఆస్పత్రి రోడ్డులో ప్రవేశించి రెండు నిమిషాల్లో పార్వతి ఇంటి ముందు ఆగింది. ఇద్దరూ కారుదిగి లోపలికొచ్చారు. మొదటి చూపుతోటే నెత్తురు మడుగులో పడివున్న పార్వతిని చూసి వాళ్ళగుండెలు ఝల్లుమన్నాయి.

పక్కనే సాంబశివరావు తాగుబోతువాడిలాగా గోడకి జేర్లగిలబడి ఉండడం చూసి "ఏమిటిది ?" అన్నాడు మాధవరావు అయోమయంగా.

ఇందాకట్నించీ, తన ఆలోచనల్లో తాను మునిగిపోయి, వర్తమానం మరిచిపోయివున్న సాంబశివరావు ఉలిక్కిపడి, "మీరెవరు?" అని ప్రశ్నించాడు కోపంగా. పార్వతిని శిక్షించానన్న సంతృప్తి ప్రజ్వలిస్తోందా కోపం మధ్య. కారు ఆగగానే అది మంత్రిమూర్తి దేనని ఊహించుకున్న అతను, "ఏడీ ఆ మంత్రిమూర్తి ?" అని కూడా ప్రశ్నించాడు.

మాధవరావుకు అంతా అయోమయంగా వుంది. అయినా, "ఏం ? ఈయనే మంత్రిమూర్తిగారు," అని పక్కన నిలబడి ఏమీ తోచక, బుద్ధి దీపం మసక వెలుగులో నెత్తురు మడుగులో పడివున్న పార్వతినీ, పక్కనే పడివున్న రోకలిబండనీ చూసి—ఏమనుకోవాలో కూడా ఆలోచించలేక శిలలాగా అయిపోయిన మంత్రిమూర్తిని చూపించాడు.

సాంబశివరావు కళ్లకు సత్యం మెరుపల్లే బోధపడిందా క్షణాన. 'ఆవేళ సుబ్బారావు "అదిగో మా ప్రొప్రయిటర్ పిలుస్తున్నాడు," అన్నప్పుడు, ఈయన కారులోంచి బైటికి చూశాడు ! ఈయనా మంత్రిమూర్తంటే ? తలంతా నెరిసి, మొహం ముడతలు పడి. ఏభై అరవై ఏళ్ళకు తక్కువ ఉండదే? ఈయనతోనా పార్వతికి తాను రంకు కట్టాడు !'

సాంబశివరావు పాదాల క్రింద భూమి కంపించి పోతున్నట్టుగా ఉంది. అతని అంతరాత్మ 'ఓరి నీచుడా !' అని ఘోషపెడ్తోంది.

తనకాళ్ల దగ్గరే నెత్తురు మడుగులో పడివున్న పార్వతికేసి ఒక్క-క్షణం చూశాడు. అంతే! ఆ ఉద్వేగంతోటీ, పైగా అసలే విపరీతంగా స్పంధిస్తూన్న హృదయం చప్పున ఆగిపోవటంతోటీ సాంబశివరావు అమాంతంగా "అయ్యో పార్వతీ!" అంటూ మొదలు తెగిన మ్రానులాగా—తనకు జీవనాధారమై, తనకోసమే జీవించి, చివరికి తన చేతుల్లోనే అసువులుబాసిన భార్యపై పడి పోయాడు.

ఇవంతా అర్థంకాని మంత్రమూర్తీ, మాధవరావూ చప్పున అతన్ని పొర్లించి చూశారు. మాధవరావు పెదవి విరుస్తూ "ఇతనూ పోయాడు," అని మాత్రం అన్నాడు. వాళ్లిద్దరూ కాస్సేపు శిలా ప్రతిమల్లాగా నిలబడిపోయారు.

—సమీపంగావున్న రేడియోనించి:

'ఏది సత్యం?

ఏదసత్యం?

—ఓ మహాత్మా! ఓ మహర్షీ!'

...అనే చరణం హెచ్చుస్థాయిలో విన్పిస్తోంది వాళ్లకి!

